# శ్రీ భగవద్గీతా గర్భిత భావబోధిని

శ్రీ కోకా వెంకటరామానుజులు నాయుడుగారు రచించినది.

తెనుగులో, శ్రీమద్భగవద్గీతకు ఇంత చక్కని మహాభాష్యం మరొకటి లేదు. శ్రీ నాయుడుగారు భగవద్గీత అంతా చిరకాలం పారాయణ చేసీ, మననం చేసీ, మథించీ తాము తెలుసుకున్న గూఢార్థాలన్నీ లోకశ్రేయస్సుకోరి యీ గ్రంథరూపంగా భద్రపరిచి మనకు ప్రసాదించారు. వారు ప్రతీ శ్లోకానికీ ముందు ప్రతిపదార్థం ఇచ్చారు. తరవాత ప్రశ్నోత్తరాల రూపంగానూ వివరణరూపంగానూ గూఢార్థాలన్నీ ఉల్లేఖించారు. ఈ గ్రంథం పరిశీలించకుండా ఎవరైనా సరే "మేము భగవద్గీత చదివాము" అనుకోడం సాహసం అనిపించుకుంటుంది. రాయలుసైజున 724 పేజీలూ, 16 పేజీల అవతారికా గల గొప్పగ్రంథం. కాలికో బైండు చెయ్యబడ్డది. కాని వెలమాత్రం పరమ సులభం 6 - 0 - 0.

# శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు

సంపాదకులు — ఘృతస్థానం నరసింహాభాగవతులవారు.

ఇందులో, మేళకర్త రాగాల వరసను 505 కీర్తనలూ, 19 పవ్వళింపు కీర్తనలూ వున్నాయి. ఘనరాగపంచకం కీర్తనలకుమాత్రం మొదట స్వరం చేర్చబడివుంది. తక్కిన కీర్తనలన్నీ మూలం మాత్రమే ముద్రించబడ్డాయి. కఠినపదాలకు అర్థమున్నూ తెలుపబడ్డది. 16 పేజీల శ్రీ త్యాగరాజస్వామి చరిత్ర గలదు. మొదట మేళకర్త రాగాల వరసనూ, చివర అకారాదిగానూ కీర్తనల సూచిక చేర్చబడ్డది. తెళనరి కాగితాలు. చక్కని బైండు. వెల 5-0-0 మాత్రమే.

# మంగళహారతులు, శ్రీకృష్ణసేవ.

శ్రీమతి కొచ్చెర్లకోట వీరలక్ష్మమ్మగారు రచించినవి.

ఈ రెండు పుస్తకాల్లోనూ స్త్రీల కందుబాటుగా ఉండే శైలిలో చక్కని మాదిరులలో 150 పాటలకు తక్కువకాకుండా ఉన్నాయి. అన్నీ భక్తిరసం ఉట్టిపడేవి, శ్రీరామ, శ్రీకృష్ణుల సేవను తెలియచేసేవిని. దేనికదే వెల 1-0-0.

---

☞ మా పుస్తకములు పేరుపడ్డ అన్ని బుక్ షాపులలోను ఈ ధరలకు దొరుకును.

సరస్వతీ గ్రంథమాల: [illegible]

శ్రీ శివశంకరశాస్త్రి సంపాదితము

# చిన్నకోడలు

శ్రీ పనసప్పు నరసింహము

మహారాష్ట్రభాషనుండి తెనిగించినది.




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# సంపాదకుని ప్రస్తావన

మహారాష్ట్రులకొఱకైనను మహారాష్ట్రునిచే మహారాష్ట్రభాషయందు రచితమైనను, యాంధ్రభాషలోనికి పరివర్తితమై, ప్రకటింపఁబడిన నవలలలో "చిన్న కోడలు" మొదటి దని చెప్పవచ్చును. మా మిత్రులు శ్రీ వాసుదేవరావుగారు పూర్వము కొన్నిపుస్తకములు మహారాష్ట్రభాషనుండి తెలిఁగించిరి; కాని యవి బంగాలీ నవలలకు మరాఠీభాషాంతరములు. వీరి సోదరుఁ డిటీవలఁ గొన్ని నవలలు సరాసరిగా మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరించినట్లు తెలియవచ్చినది. నే నెఱిఁగినంతవఱకు మరాఠీనుండి కథలను సూటిగా మనభాషలోనికి మార్చినవారిలో మొదటివాఁడు మన్మిత్రము విస్మృతుఁడు నగు శ్రీ నల్లగొండ మంగయ్య.

ఈనవల మహారాష్ట్ర సంఘాచారములను దెలుపుటకు రచింపఁబడినను మనసంఘమునకుఁ గూడఁ దగిలివచ్చునట్లు స్ఫురించుచుండును. ఏలన, ఆంధ్రులకును మహారాష్ట్రులకును చాలవిషయములందు సాదృశ్యము కలదు. పాదరక్షలు, అంగవస్త్రధారణము, పొడుగుకోటు, పాగా, నామధేయాంతములు మొదలగు సామాన్యవిషయములలోనే గాక సాంఘికవ్యవస్థలలో సయితము మనకును వారికిని పోలిక యున్నది. మహారాష్ట్రులు ప్రాచీనాంధ్రుల సంతతివా రను సిద్ధాంతము మహారాష్ట్ర విద్వద్వరిష్ఠులగు శ్రీ భండార్కరుగారు మొదలగు చరిత్రపరిశోధకు లంగీకరించినదే. ఒకానొక సంఘస్థితిని వర్ణించు గ్రంథ మితరసంఘములలో నన్వయించునట్లు స్ఫురించుచున్నచో నట్టిది బహుళవినోదదాయక మగుట నిస్సంశయము. ఈనవలయు నట్టిదే.

ఇందలి యితివృత్తము సహృదయరంజక మనియు, రంగములు నూతనము లనియు, పాత్రలయందు వైశిష్ట్యము కలదనియు, సర్వశేఖ

మన్యేను. “ లేపమ్మా ! ఇంతయుఁగ్రాని ముక్కడని జూడలేను. గోపికాబాయీ, మన మాడుముండలు చదువుఁ వ్రాయుట నేర్చుకొనుటెందులకో ? ఉద్యోగములు తగులపెట్టి మన కాంపోలు ! ఈముండలు తెగఁబడినారు. ”

హస్తముసంగలక్షీండను చప్పుచప్పున నీటిలో ముంచి గోపికాబాయి యిట్లనెను “కానిచో మఱేమి ? కానిలే, నేనొక్కటి చెప్పెదను. దాని మొగము ముండ ! దానికెంత గర్వమే! మగని కేమైన సంపాదనా చట్టుబండలా ? మెడలో రెండు గుల్లల లయిన నున్నవా యింతపొగరుకు ? ఒంటికి చిన్న నెత్తుబంగారము లేదుకద ! పొద్దున తినిన సాయంత్రము మెతుకురా భగవంతుఁడా, అనేదగులు. మఱికెట్లా వచ్చినదాని కీమిడిసిపా టెందుకో ?”

“బాగుగా చెప్పితివి!” అని యమునాబాయి తన యంగీకారమును సూచించుచు “ఆరోజున పార్వతి బిడ్డలిద్దఱు నన్నమూ రామచంద్రా అని వీధిలో నేడ్చుచు నిలుచుని యుండ మాయింటికిఁ గొనిపోయి నేను వారిరువురకు నన్నము పెట్టితిని. దాని కేమిచేటో! దాని కది విష మయిపోయినది ! ఎక్కడనుండియో పరుగుపరుగున వచ్చి, నోటికి వచ్చినట్లు కూసి, ఆపిల్లల నిద్దఱను తెగబాది యింటి కీడ్చుకొని పోయినది. అమ్మా ! నిజము చెప్పినను నమ్మవు, అనత్యము చెప్పినను నమ్మవు. ఆరోజునుండి దానిపైకైన నెత్తుటలేదు.” అనెను.

ఇంతలో నాయత్తల్లి యుతుకుచున్న చీరె నట్టే చేతఁ బట్టుకొని యిట్లనియెను. “ఏమమ్మా ! చదువుట వ్రాయుట వచ్చినందువల్ల నేనా యీపిల్లదాని కింతయతిశయము ? అమ్మా, నాకును మిగుల భయమగుచున్నది. మానానాపెండ్లాము కూడా చదువుకొనిన ” దఁట. యమునాబాయి తనలోఁ దాను నవ్వుకొనుచు గుడ్లు మిటకరించుచు

చూడలేదమ్మా!"

ఇవ్విధమున వారందరు వారలసంభాషణ మెంతయు వింతగా నుండెను. ఇంతలో ఘలుమని బిందె చప్పుడుచేయుచు పార్వతియత్తగారి రాధాబాయి మెల్ల మెల్లగ పవనానది రేవు సమీపించెను. అంతట నాస్త్రీ లెల్లరు రాధ వచ్చె రాధ వచ్చె నని కనుసన్నల నొకరి కొకరు దెలిపికొనుచు నిశ్శబ్దముగ నుండిరి. కొందఱు మునుపటివలెనే తమతమ భాండములు వడివడిఁ దోముచుండిరి. కొందఱు [illegible]రని బట్టల నుతికికొను చుండిరి. కొందఱు పవనానదీతటమునందుఁ గల గణపతివిగ్రహమునకుఁ బ్రదక్షిణము లొనర్చు చుండిరి. ఇట్లు వారు తమతమ కార్యములయందు నిమగ్నలై యుండిరి. ఎవరినోట నొక్కమాటైన వెలువడుట లేదు. గంభీరములు, విరక్తములు నగు రాధచూపులు తమపైఁ బ్రసరింపఁగనే వారు తమతమ ముసుఁగు లెట్లో యట్లు ముడించుకొని నిశ్శబ్దముగ నింటితోవఁ బట్టిరి. నానాతల్లి తప్ప తక్కినయందఱు మెల్లమెల్లగా నంతర్ధాన మయిరి.

కొంతసేపటికి రాధ తనలో "ఔరా, రవ్వంతైన సజ్ఞానము లేదే! ఈసిగ్గుమాలినది నాకెక్కడ దాపరించినది! నేఁ బుట్టినతరువాత నా స్థితి యెట్లుండునో రేపు గాని తెలియదు. నాతల వగిలి చచ్చినదైన పోను! భగవంతునకుఁగూడ నాపై దయ రాదేను! వాఁడు నన్నెత్తుకొనదైనను బోవఁడు! రెండుజాముల ప్రొద్దెక్కినది. ఇంతవఱకు స్నానమైన లేదు. దిక్కుమాలినదానను! చచ్చినదయిన నేనే పాచిబిందె చేతబట్టుకొని రావలెను—" అనుకొనెను.

నానాతల్లి విఘ్నేశ్వరునకుఁ బ్రదక్షిణ మొనర్చి యుతికినమడుఁగులు భుజముపై వైచికొని, యిట్లనెను. రాధమ్మా! నీసంగతి జూడ "ముక్కుచిన్న ముత్తెము పెద్ద"వలె నున్నది. ఇందుకు నీదయా స్వభావమే కదా కారణము? నే నొకటి చెప్పెదను. పిల్లలను చిన్న

తలదగ్గఱనే కూర్చుంటిని. ఈలాటి తెలిమాలినవాం డెచ్చటను లేండే ఉమా ఈలాటికొంటరిపనులుచేసి ' నన్ను వేధించుకొని తినుచున్నాడ —"

ఉమాబాయి నవ్వుచు నిట్లనియెను. "కోడలిని తీసికొనివచ్చినచో మనవానిమనసు సంసారమునందే వర్తించును. ఇదియే మంచి యుపాయము."

ఇట్లు వారిరువురు కొంతవడి ప్రసంగించిరి. అనంతరము ఉమాబాయి తనదారి నేగెను. పిమ్మట రాధ యిందె భుజములు నడికొంగి యింటిదారి పట్టెను. రాధహృదయాకాశమున ఉమాబాయిపలికిన యుపాయవాక్యమే ప్రతిధ్వనించుచుండెను. అట్టియోజనతోనే యామె దారిని నడచుచు నింటి కరిగెను.

౨

సదాశివరావుగృహ మొంటియంతస్తుమేడ. మంచియిటుకలతోను కట్టంబడినను నీసమయమున నందు శిథిలము లైనభాగము లచ్చటచ్చటం గానవచ్చు చుండెను. వీధిగుమ్మమునంటియే యొక్కచావడి యుండెను. అందది యున్నను కూర్చుండుటకుం గాని నిలుచుటకుం గాని యేమాత్రము యోగ్యముగ లేదు. ఎలుకలు పందికొక్కులు మొదలగునవి చేయు కన్నములలో నిర్భయముగా విహార మొనర్చు చుండెను. చావడిలో నొకప్రక్క దేవతార్చనగది యున్నది. ఇప్పు డద్దానికూడ కీటకప్రభృతులకు లీలావిహారభూమియై యెన్నను కనువైన చిమ్మచీకటికిని దత్తికటకములకు సంపూర్ణసామ్రాజ్యము స్థాపించుట కెంతయు ననువై యుండెను. బీటువారిన గోడల యందు నాల్గు రావి మొదలగువృక్షములు వ్యాపించి యుండెను. పడమటింటిసంగతి యిక చెప్పనక్కఱయే లేదు. కానియందు మూండు నాల్గు చిన్నగదులు కలవు. అవియు సాధారణస్థితియం దున్నవి.

అందొకటి వంటకు తక్కువ వడక మొదలగువానికి. అట్లు గృహ స్థితి శోచనీయమై యుండెను. దొడ్డిపైనున్న వసారాపైన నొక పెంకైనను నిలుచుటకు వీలు లేకుండ విరిగిపడి యుండెను. గోడ లచ్చటచ్చట నేల గూలుచుండెను. అచ్చటచ్చట కసువు నిలిచి యుండుటచే దుర్వాసన మెండుగ నుండెను. ఇంటి నిచ్చట జూచిన మూర్తీభవించిన దారిద్ర్యదేవత సింహాసనాసీనయై యుండెను. రాధ గృహము జేరి భుజముపైనున్న యానకభాండము స్వయంపాక గృహమున నుంచి కట్టుకొన్న తడిబట్ట విప్పి "పిల్లా పిల్లా ఓసిపిల్లా" అని కేక వైచెను.

పార్వతి తనగదిలోనుండు చాపపైఁ బడి గుర్రుకొట్టుచు నిద్రించుచుండెను. అత్తగారు పిలిచినపిలుపంతయు నామెకు వినరాదయ్యెను. పార్వతి యేదో పనిమీఁద నిరుగుపొరుగిండ్ల కేగి యుండనోపు నని రాధ తలఁచెను మరల నెటనే యామె మనసున కేమిస్మరణకు వచ్చెనో గాని తత్క్షణమే పార్వతి నిద్రించుచున్నగదిగవాక్షమున కడ్డముగఁ బెట్టినబల్ల నొక్కవిసురున ద్రోసి లోనికి తొంగి చూచెను. పార్వతి లోన గుఱక పెట్టుచు హాయిగ గాఢసుషుప్తియందు మునిఁగి యుండెను.

చిన్నతనమునుండియు పెద్దనోరు పెట్టుకొని బడబడవాగు వ్యాధి రాధా[illegible] గాదు. ఎవరితోఁ గలహించినను క్షణకాలములోనే మరల వారితో నవ్వుచు మాటలాడును. [illegible] నిష్కాపట్యము. గృహకృత్యములను జక్కబెట్టుటయం దామె కెంతయు నాసక్తి. కాఁబట్టి చేయుపనియందు మందమనస్కు నెవ్వరినైన పెద్దనోరు పెట్టుకొని కేకలు వేయుచు, గొణుగుచు, సణుగుచుండుఁగాని యామె యుత్సాహముతో పని చేయు[illegible]. వివాదమునకుఁ గాని జగడమునకుఁగాని యెవ్వరు లేనియప్పు డామె తన దురదృష్టమునకు వగ

రాధనేత్రములు అశ్రుపూరితములు అయ్యెను. కొంతతడవున కామె యేడ్వఁదొడఁగెను. పార్వతి తనకోపమును మనస్సులో నణఁచుట యెంతమాత్రము నిష్టము లేదు. నిజమే. బిడ్డలు గలిగింప. వట్టి మధ్యాహ్నసమయము యయ్యెను. ఇట్టిసమయమునందు చెప్పిపెట్టుని చెప్పులు యవసరమగుకాదా? పార్వతికి సహన మెట్లుండును? అని తెలుసుకొనుచు కోపపరవశయై యిట్లనెను. "ఇదిగో నామాట వినుము. మీరిట్లు వేళ కాని వేళ నుండియింటఁ గూర్చుని యేడ్చుచుండుట భావ్యము కాదు. ఎంత పాపిష్ఠి వేళ నీ కొంపలో నడుగుపెట్టితినో కాని యొక్కనాఁడైన సుఖ మెఱుఁగను. ఇంటికి రానిమ్ము. దీనికి తగిన కట్టుబాటేదియో చేసి గాని నే నీ యింట గ్రుక్కెఁడు నీరైనఁ గ్రాగను."

"చేయుము, చేయుము. ఏమిచేసెదవమ్మా! నన్నింటనుంచి గెంటించెదవా? చేయుము. నీవు సుఖముగా నుండుము. నేనుగూడ నీ బాధనుండి విముక్త నయ్యెదను. ఈనిబొల్లి బెదరింపులు నానోటి నేమియు కట్టఁజాలవు—" అని రాధ మిక్కిలి యేడ్వసాగెను.

పార్వతి తీవ్రతర మగుకోపమున నిట్లనియెను. "ఆహాహా! యీాగడుసుపలుసలిమాటలు వినండి! నే నన్న దానిలో నాయర్థ మేమైన నున్నదా!"

పార్వతినోటనుండి యీాపలుకులు వెలువడ రాధ యాగ్రహము నకు పరిమితి కానరాదయ్యెను. ఆమెయధరము చలింపఁ దొడఁగెను. ఇరువురును చేతులుచేతులు కలుపఁ జొచ్చిరి. ఒకరినొకరు మెడలపైఁ జేతులు వైచి క్రిందికిఁ బడఁద్రోయ యత్నించుచుండిరి. ఒకరి నొకరు తిట్టికొనఁ గడఁగిరి. ఏడుపులు మెం డయ్యెను. ఇట్లు ఘోర సంగ్రామము మితిమీాఱుచుండెను. ఇంట నిట్లు భయంకరకదనము జరుగుచుండ సదాశివరావు గృహమున కరుదెంచెను. లోపల జరుగు చున్న యీాప్రచండయుద్ధప్రసంగ మాతనికి వీథిలోనికి వినవచ్చెను.

ఆసవ్వడి చెవిసోఁకి నంత నాతని ప్రాణములు పైకెగసిపోయెను. పాపము ముందున కాలిడి కదుగు సాగదయ్యెను. తాను లోని కరిగినచో నాఁటిలహోగ్ని మఱియుఁ బ్రజ్వరిల్లుఁనని యతఁడు విచారింపసాగెను. భయమున నాతఁడు మెల్లమెల్లన నడుగు లిడుచు నడుమటింటిలోని తనగది జేరెను. కొడుకును నాఁచినంత రాధ పెద్దపెట్టున రోదన మొఱ్ఱుచు కోడలి దుర్ణయమంతయుఁ జెప్ప మొదలిడెను. పార్వతియుఁ దం బెళుకు చూపుల నాతనిపైఁ బఱపి టక్కులు దాఁచుచు సోఁకుచు భర్తకడ నత్తగారి గుణవర్ణన మొనర్పఁ గడఁగెను. అది విని వృద్ధురాలు నిర్ఘాంతపడియెను. సదాశివరావు చిక్కులిచిక్కునఁ జిక్కుకొనెను. ఒకవంక ప్రత్యక్ష మాతృదేవత, మఱియొకవంక మూర్తీభవించిన ధర్మపత్ని. కొంతదనుక నాతఁడు పాషాణమూర్తివలె స్తబ్ధుఁడై యుండెను. నాసికి నోట మాటరాలేదు. కొంతవడి కాతఁడు భార్య నతినిష్ఠురము లగు మాటలతో మందలించెను. అందులకుఁ బార్వతి మిక్కిలి రోదన మొనర్పఁ దొడఁగెను. అట్లు కొంతతడ వేడ్చియేడ్చి, నిదురించుచున్న తనబిడ్డల నిద్దురను మేలుకొల్పి వెంట నిడికొని బిరబిరనడచి యామె విధవెంటఁ బడెను. పోవునప్పు డామె భర్తయెడ యథేచ్ఛముగ నొనర్పవలసిన షోడశోపచారపూజల కేమియుఁ గొఱతె కలుగనిచ్చినది కాదు.

గృహము నుండి వెలువడునప్పు డామె నెవ్వరు వారింపరైరి. సదాశివరా వామెను వారింపఁ డయ్యెనే యని యతనిని నిందింపరాదు. రాధయాగ్రహ మింతయంతయని శాంతింపమి నామెను వారించుట శక్యమైనది కాదు. అయినను పార్వతి పుట్టినింటికే గాని యొక్కరుగాను దలఁపరైరి. పార్వతి కట్టియూహతో బయలు దేరెనని చెప్పుటకు వీలుపడదు. తా నేగుచుండ భర్తయో యత్తయో తన్ను బతిమాలుదు రని యాశ యుండెను. ఇట్లు కొంతతడ

## 3.

రమారమి యొంటిగంటకు మెల్లమెల్లగ వినాయకరావు గృహాభిము
ఖుఁడై వచ్చెను. వాకిటనుండియే యాతఁడు కేకలువేయ మొదలి
డెను. "అమ్మా, అమ్మా, ఇ అమ్మా అ."

రాధ రోదన మున్నిటికి కడముట్టి యుండెను. ఆమె తన పైట
చెఱఁగు తలనిండ ముసిఁగిడి గదిలో నొకవైపున నేలపైఁ బడియుండి నిదు
రించుచుండెను. సదాశివరావు తనగదియందు చింతాంబుధిమగ్నుఁడై
కూర్చుండి యుండెను. అట్లగుట వినాయకుని కేక లెట్లు వినియు
ప్రతిశబ్దములు వచ్చును? మరల వినాయకరావు "వదినే, ఓవదినే
అరే ఇంట్లో నెవరును లేరా యేమి!" యనుకొనియెను.

వినాయకునియాక్రంద ఘోషము వినఁగనే సదాశివుఁడు మందగమ
నమున గదివెడలివచ్చి "ఎవరా—వినూ! ఇటు రా" అనియెను.

ఖిన్నవదనుఁడగుసదాశివుని గాంచినంతనే వినాయకరావు భయ
మంది, రయమున నాతని జూసి కంపితగాత్రుఁడై "అన్నా యింట
నెవరును కనఁబడరేమి? ఇదియేమి? అమ్మయును వదినెయు నెక్కడికైన
వెళ్ళిరా?" అని అడిగెను.

"అమ్మ లోపలిగదిలో పండుకొని యున్నది. మీవదిన యెక్క
డికో పోయినది—జగ్గును రాముని వెంటబెట్టుకొని కోపమున"

"ఆ? పోట్లాట గీట్లాట జరిగిన దని తోఁచుచున్నది"

"మహాయుద్ధము."

"సరే వదినె యెక్కడి కేగినది!"

"ఎక్కడికో వల్లకాటిలోనికి!"

అది విని వినాయకుఁ డేమియు మాటలాడ లేదు. అతఁడు మెల్ల
మెల్లగ నింటివెలుపలకు నడచుచుండెను. అట్లగుట గాంచి సదాశి
వరావి ట్లనెను. "వినూ, యెక్కడికి పోవుచుంటివి?"

"వదినె యెక్కడికేగినదో విచారించి వచ్చెదను."

"చాలు మధ్యాహ్నమగుచుండెను. చాల పొద్దెక్కినది. నీవు ముందు భోజనము చేయుము. అమ్మకూడ నింతవఱకు భోజనము చేయలేదు. భోజనమైనపిమ్మట సావకాశముగ వెళ్ళవచ్చును."

"జగ్గు రాముడుఁగూడ వెంట నున్నారా?"

"అందువలననే యింటిలో నెక్కడికి వెళ్ళును? అంతగా వెళ్ళిన రామశాస్త్రిగారింటికి."

అయినది వినాయకరావు ప్రయత్నము వెనుదిరిగినది. మరల నాతఁడు గృహాంతరము జొచ్చి తల్లి పరున్నగది ప్రవేశించెను. అచట జేరినంతనే కూనాఁడు నడచినకదన ప్రకరణ మంతయు వేఱుగ నాతఁడు విచారించి తెలిసికొన నవసరములే దయ్యెను. అతఁడు నిశ్శబ్దమున నడుగు లిడుచు తల్లిపాదములవద్దకుఁ బోయి కూర్చుండి మెల్లమెల్లగ నామెపాదము లొత్తసాగెను. అప్పట్టున క్రోధావేశ ముక్కుపట్టున రాధమ చుట్టుకొనియుండెను. అట్లగుట వినాయకరా వొనర్చు పాదసేవ యంతయు నామెకు రుచింప దయ్యెను. ఆపైన నామె కాలితో వాని నొక్కతోపు తోసెను. వినాయకరావు మాతృదేవతను శాంతపఱచుటకై తన మనసమున భీష్మప్రతిజ్ఞఁ బూని యుండెను. ఆమె యేమి చేసినను నాతఁడు తనపనినుండి మాత్రము విరమింపఁ డయ్యెను. అందువలన తల్లి కెంతయు నాగ్రహము వచ్చెను. "పొమ్ము. ఇచటనుండి లేచి పొమ్ము. చచ్చినవాఁడా! మొగము చూపించఁబోకు. నీబుద్ధి బుగ్గిగాను! నీయుండావళ్ళు నాయెముకలు విఱుగు చున్నవి. మాసంసారముమీఁద నిప్పుపెట్టా! దేవుఁడు నన్నొక్కనాఁడు తీసికొనిపోఁడే! ఈనల్లకాటక్రమమంతయు నాకు వదలియైన పోను!"

వినాయకరావు మాతృసేవయం దన్యథా వర్తింపక నవ్వుచు ని

ట్లనియెను. "అమ్మా! రెండుజాములు దాటినది. కడుపులో కాకులు
కూయుచున్నవి. ముందు నన్నము పెట్టి తరువాత నీ యిచ్చవచ్చి
నట్లన——"

రాధ కహంకారము మితిమీరెను. "చచ్చినవాడా! అన్నము
పెట్టుమనుటకు నీకు సిగ్గైన లేదే! సిగ్గుమాలినవిధవా! ప్రతిదినము
నిద్దుర లేచినప్పటినుండి కన్న మెట్లువచ్చును? ఒక్క దినమైన దమ్మిడీ
సంపాదించు ప్రయోజకత్వము లేదు. పెద్దగ విడిగే దేలవలె తినుట
మాత్రమే! రెండుజాము లైన దేట? ఇంత సేపటివఱకు నెక్కడ నణం
గిపోతివి? ఏమిపని వెలగబెట్టు చుంటివి? నాపాప మిట్లు ప్రబద్ధ లైనది.
ఒక్కనికైన జ్ఞానము లేదు."

ఇవ్విధముగ దిట్టుచు గొంతెత్తి యఱచెను. వినాయకుడు తా
నొనర్చుచుండిన పాదసేవమాత్రము విరమింపడయ్యెను. జననివలన
ననుదిన మిట్టిసంభావన జరుగనిది యొన్నడును కడుపులోని కన్నము
పోదని పాప మాతనికి నిశ్చయమే యుండెను. ఎల్లప్పటికి నిది సహజ
మగుట వినాయకుడు డానందమున నిట్లనియెను. "అమ్మా శివాల
యములోని సంకీర్తనలు నెఱుంగుదువు కదా? మే మీయింట నందఱము.
ముందు నాదికి నైవేద్యము పెట్టుదురా లేదా? తరువాత నీయిష్టము
వచ్చినన్ని యనుము. అబ్బబ్బా. నా కెంతో యాకలి యగు
చున్నదే! ఇదిగో నాకడుపు చూడుము. ఎట్లులోపలికి పోయినదో?"

అమాయకుడు మూర్ఖుడు అజ్ఞాని యైనను నతడు కొమరుడు;
ఎంతైన నామె కన్నతల్లి. ఎట్లు స్వస్థముగ నుండగల్గును? వెనుక
టివలె నోటితో బడబడవాగుచు రాధ తడిబట్ట కట్టుకొని వంటయింటఁ
బ్రవేశించి విస్తరి వైచి "చచ్చినవాడా! కూర్చుండుము. నీపిండము
పిల్లులకు వేయుము." అని యఱచెను.

"ముందు నీకు పిండము వైచి తరువాత నాపిండము వైచుకొ

నెదను అన్నా! నీవుకూడ కూర్చుండుము. ఈదినము మనమిరువురము కూర్చుని తిందము." అని వినాయకుఁడు నవ్వుచు ననియెను.

ఆ సంతోషాతిశయమున రాధాబాయి కన్ను లశ్రుభరితము లయ్యెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచు "మీయింట నే నిఁక నెప్పుడు సన్నము ముట్టను. శాస్త్రోక్తమైన జీవించెదను కాని మీయింట పంచభక్ష్యపరమాన్నములైనను నాకు వలదు. నోటికి వచ్చినట్లెల్ల నది నన్ను కూయునా? చేతలు గోతలునా? అక్కడికిని జడియుచునే యుందును. దానిచే నష్టమైన మాటలు పడలేక నా దేహము చిల్లులు పడుచున్నదే! పూర్వజన్మమున నెట్టి పాపము చేసితినో" యనియెను. వినాయకుఁ డిట్లనెను. "ఇప్పుడు నీ వంటివిగదా ఒక్కనికికూడ దమ్మిడీ సంపాదించు జ్ఞానము లేదని. మేము నీ కేమియును పెట్టుటలేదు. నీవే మాకు పెట్టుచుంటివి. ఇంక మా మాట యెక్కడ? మా యిల్లెక్కడ? వదినెవిషయ మంటివా దానికి నే నేమిచేతును? సంసార మన్న నెంతో సహన ముండవలెను. నీవన్న లక్ష్యము లేకుండ వదిన మాటలాడుచుండును. అటు లుండుట యామెతప్పే. ఊరిలో నందఱు నీవిషయమున నామెనే నిందించుచుందురు."

ఈతియ్యని పలుకులవలన రాధక్రోధము క్రమక్రమముగ తగ్గసాగెను. వినాయకునియందు నామెకుఁ బ్రేముడి హెచ్చెను. పుత్రుని వేడికోలు వలన నామె తానుకూడ విస్తరి వైచికొని వడ్డించుకొని భోజనమునకుఁ గూర్చుండెను. రాధ కాగ్రహ ముదయించిన నెంతటిదైనగాని కలిసి మాటలను బ్రతిమాలనియెడల నామె కోపాగ్ని చల్లారదు.

వడివడి భోజన మొనర్చి రాధ కొడుకుతో నిట్లనియెను "వినూ, మనజగ్గు రాముఁడు నెక్కడికేగిరో వారి నొక్కమాటు వెదకి చూడరా, నాయనా!"

తల్లియనుమతి చొప్పున పిల్లల నరయ నేగుటకు వినాయకుఁడు

ధూర్త స్వభావ యగు పార్వతి పాలనే సంసారమున కెన్నియో యిక్క-
ట్టులు వాటిల్లెను. అందు పార్వతి పుత్రద్వయమునుగూడఁ దోడు
కొని చనుటచే మదనపల్లె యగ్రహార మొంటరి యగునట్లయ్యెను.
ఆ మనోహరిణి బడబడవాగుటయే కాని పాప మామెమనసున మరు
ద్దేశ మణుమాత్ర ముండదు.

దినములు గడచినపిమ్మట వినాయకరావు భోజన మొనర్చుచు
నడుమనడుమ కసికిపాట్లు పడుచు సదాశివరావుతో "అన్నా! మగఁడు
సంగతి యేమి?" అనెను

సదాశివుఁడు విరక్తితో "అంతేమిచారు నుండెను? పోనిమ్ము. ఆ
గయ్యాళి వల్లనటయే నశించిది. ఆ దౌర్భాగ్యురాలి మొగ మింకఁ
జూడఁగూడదు." అని పలికెను.

"అది యటు లుండనిమ్ము. అమ్మను సమాధానపెట్టు టెట్లు?"

"అహోరాత్రములు పోట్లాడుట కిరుగు పొరుగువా రెందఱో
యున్నారుకదా!"

వినాయకుని మనసప్పుడే గంజాయిమీఁది కోర్కెచాటున పరువె
త్తినది. సదాశివుఁడు చెప్పిన దేమో వానికి సరిగా తెలియ దయ్యెను.
కడపటి రెండుమూఁడు వాక్యములుమాత్ర మాతఁడు విని యిట్లనెను.
"ఇరుగుపొరుగువా రనేకు లున్నమాట నిజమే. కాని వా రెవ్వరైన
నమ్మను కొంచె మైన నోదార్చిరా?"

పాపము సదాశివుఁ డెంతయు విచారగ్రస్తుఁ డయ్యె. కొంతతడవు
వఱకు దుఃఖాతిశయమున స్తబ్ధుఁ డై యుండి గంభీరస్వరమున "ఓరీ
వినూ, ఇప్పు డైన దేమో మంచిదే యైన దని తలఁచెదను."
అని పలికెను.

ఇంతలో రాధ రోదన మొనర్చుచు లోపలినుండి వచ్చి సదా
శివునితో నిట్లనెను. "ఏమిమంచిరా నాయనా! నాకుమాత్రము తల

మంపులుగ నున్నది. ఊరిలో నందఱును మనలను కాకులు పొడిచినట్లు పొడిచెదరు. మన మెంత బీదవాండ్ర మయినను మానాభిమానములఁ బాటింప వలదా? నానోరు పడిపోతే నాకావేళ నేమియున్నది—"

రాధకన్నులు రెండును నిండిపోయెను. జనని యాకులపాటు గాంచి నంత పుత్రు లిరువురు దుఃఖించిరి. వినాయకుఁడు కొంతదనుక ఖిన్నుఁడై కూరుచుండి పిమ్మట చప్పుచప్పున నన్నముదిన దొడఁగెను. సదాశివుఁడు మనమున మిగులవిచారించుచుఁ గూర్చుండియుండెను. అట్లు కొంతసే పయినతరువాత సదాశివుఁ డిట్లనియెను. "అమ్మా, మనపైన నీ నింద లేకుండఁ బోవుట కిప్పు డేమి చేయవలయు నని నీయభిప్రాయము? చెప్పుము."

పయిటకొంగుతోఁ గన్నుల నొత్తియొత్తి యామె యిట్లనెను. "నాయనా తెల్లవారునప్పటికి పార్వతిని, ముద్దుబిడ్డల నిరువురను తీసి కొనిరారా! నాబిడ్డలు వెళ్లిపోవుటచే నాయిల్లంతయు చిన్నపోయి నది. నాయనా, నాకోడలితో నిఁక నెన్నటికిని పోరాడను. దేవుని తోడు దానిమాటమైన నెత్తను. అది నన్ను కొట్టినను సరే. ఆ ఊఁ అనను. నాకోడలు మంచిది. వెళ్లు నాయనా వెళ్ళు. తెల్లవా రుజామున నే బయలుదేఱి పొమ్ము. ఎలాగో దానిని మంచిచేసికొని రమ్ము. తీసికొని రమ్ము."

అత్తవారింటి కరుగుటకు సదాశివుఁడు మొట్టమొదట నిశ్చయింపఁ డయ్యెను. అది గాంచి వినాయకుఁ డిట్లనెను. "అన్నయ్యా, అమ్మ చెప్పినట్లు చేయుట మే లని నాయభిప్రాయము."

"పోనీ నీవు వెళ్ళరాదా?" అని సదాశివుఁ డనెను.

"అన్నయ్యా, ఇందులకు నన్ను క్షమింపుము. ఆపని నావల్ల కా దబ్బా! నీ వక్కడికి వెళ్ళినట్లయిన నే నిక్కడిపని యంతయుఁ జూచె దను. నీవు తిరిగి వచ్చువఱకు నే నిల్లు కదలను. సంసారభారము నేఁ

రమ్మన్నోరు. అమ్మా, యేంసెయ్యానూ? నిబద్ధిఅనుకుండా! పాసి మొగమైనా కడుక్కోలా అలాగే యెల్లాను. వదినెమ్మగారెల్లా అబద్ధాలుచెప్తారని నాకేం తెల్సు?" అని పలికెను.

రాధకోపం మితిమీరి యిట్లనియెను. "ఆహాహా, యెంతటక్కులాడివే! ఓసీ నిజముగ దానితండ్రికి రోగము వచ్చినట్లయిన బిడ్డలనుకూడ నెంటఁబెట్టుకొని యొంటరిగ బోవునే? అవకతవకపు ముండా! నీవుచేసినపని తప్పని తెలుసుకొని, అది కప్పిపుచ్చి నన్నేగతాళి చేయుటకు వచ్చితివా?"

సఖూబాయినేత్రము లశ్రుభరితము లయ్యెను. అది వెక్కివెక్కియేడ్చుచు నిట్లనెను. "లేదండమ్మా! మీపాదాలసాచ్చి! నాబిడ్డతోడు! నాకేం యెరిక లేదు. మారాజులు తమ గంజి తాగి తమర్నే నా ఆచ్చేపించడం? తమకు మాకు తగ్గొంటోరు. లేదు లేదమ్మగారూ! నే నెప్పుడల్లా——"

రాధ పెద్దగొంతుతో కేకలువేయఁ దొడఁగెను. రాధ కంతట దానిపై కొంచెము దయపుట్టెను. కావున శాంతస్వరమున నామె యిట్లనెను. "ఓసీ నీకు కొంచె మైనజ్ఞాన మున్నచో నాతో చెప్పి మఱివెళ్ళుదానవు. మాయిల్లేమి క్రోసులా ఆమడలా?"

సఖూబాయి కన్నులం దుడిచికొని తలయూచుచు "ఔనుఔను. నాకీమాట తోసిందికాదు. ఇయ్యాల్నుంచీ ఇకెప్పుడల్లాసెయ్యను. నాకిప్పుడు తెలిసివచ్చింది." అని చెప్పెను.

"సరే, యేమేసఖూ! నిన్నుఁ జూడగానే యక్కడివా రందరేమనిరి?"

"యేంసెప్పనమ్మా! మమ్మల్నిసూసి అంతా తెల్లమొగా లేశారు. [illegible] నోట రక్తలేదు. వదినెమ్మోరుమట్టికి లాంది. యికెప్పుడు [illegible]రింటికి రాను. మాఅత్తమ్మ నేతులో పళ్లేను. యేషా

ద్దు నూసినా చూపహాగ్గాతే. బువ్వనాన్న కడుపునిండా యెట్టదు. ఇం కేంచేంటో చెప్పింది. అవన్నీ చెప్పటానికి నోరాడదు"

సఖీ చెప్పిన యీ సమాచారమంతయు వినినంత రోషమున రాధశరీర మాపాదమస్తకము కంపింప నిట్లనెను. "స-రే, స-రే, ఇంక నెన్నడును నక్కడికి రాను! సరే మానివేసినే! దానిసంగతి యంతయు తెలిసిపోయిందిలే!"

సఖీ మరల నిట్లనెను. "అహూ! మరిచిపోయినా వదినమ్మ అన్నుండాదే. ఆ మునగోడు, లేదు లేదు, ఇప్పుడూ చిన్నత్తోరింటికే పంపనన్నాడు. ఇంకో మాట లచ్చిబాయమ్మగారి ఆళ్ళమ్మ కాపురానికి పంపనన్నాండని షావుకారు మోహ్నారు ఆళ్ళతో చెప్పింది. అమ్మా! ఏంచెప్పను! ఆళ్ళజిమ్మటియ్యా, ఆళ్ళంతా పకపకా నవ్వారు."

అనుమాటలు వినినంతనే రాధకోపానలము జాజ్జ్వల్యమానమై ప్రజ్వరిల్లసాగెను. క్రోధావేశమున నామెకన్నులు గిరగిరదిరుగ దొడంగెను. కొంతవడక నట్టె నిలిచి యుండి పిదప నిట్లనెను. "నాకుంగనుక నీసంగతి నిన్ననే తెలిసియుండినచో మా సదాశివు నక్కడికి పంపకపోదును. సరే, సఖీ, ఇట్లు మానుము. ఈసంగతి యంతయు నూరిలో నెవరికిం చెప్పకుసుమా! మా పరువంతయు పోవును సుమా!"

సఖీ కొంచెము గాంభీర్యము తెచ్చుకొని యిట్లనెను. "అమ్మా! నాకీసుద్ది మీరు చెలవియ్యాలా? అంతేనా! నేనొకర్తెనా చెప్పుతానా?"

ఇంక నేపు యీ రెండుమూడు శాంతవచనములు పలికి సఖీ యట నుండి బయలు దేరెను. గృహాము వెలుపలికి వచ్చి [illegible]త్నము చేసినను తద్విషయము దానికడుపు నిముడదాయెను. నాగ

యీవిషయ మేరివద్దను కొంచెముకూడఁ దలపెట్టవల దని సఖూహృద యమునఁ బదిలముచేసి యుండెను. కాని యీవృత్తాంత మెవ్వరికిని నైనబడనైచి తనభారమును తగ్గించుకొనిన గాని దానిమనసునకు తృప్తి కలుగదయ్యెను. గృహము వెలువడినప్పటినుండియు నీరహస్య మెవ్వ రిముందయిన నెప్పుడు బాఱవేతునా యని యాపె తొందరపడు చుండెను. కాని పాపము, దానిమనదృష్టమువలన నెంతదూరము నడచినను, దారియం దొక్క పిట్టకూడ కానఁబడ లేదు. ప్రక్కనంటుకొ నియే వడ్లవానియిల్లు కలదు. సఖూ యందు బ్రవేశించి బిగ్గఱగా ని ట్లని కేక వైచెను. "యేంచేత్తూండావు వొదినప్పా?"

వడ్లవానిభార్య యాసమయమున వంటయిల్లూడ్చు చుండెను. ఆమె చేయుచున్నపనిని వదలి తొందరతొందరగ నీవలికి వచ్చి "ఏమి టంటావు ప్రిభూ?" అనెను.

సక్కూబాయి దొంగవలె నలువంకలఁ గలయఁ జూచి, యెవ్వరు లే రని దృఢ మైనపిదప రహస్యముగఁ బార్వతి సను స్వవృత్తాంతము చాతుర్యమున నొకటికి పది కల్పించి దాని చెవిని బడవైచి చివర కిట్లనెను. "ఒసే, దా నత్తగా రీక థొరికీ చెప్పొద్దంది. వొరికనా చెప్తే మాత్రం మనకెళ్లో యేం పడుతుంది? మనం నేదోళ్లం— నాకూట్లో దుమ్మొడ్తుంది. ఆళ్లతో యీళ్లతో చెప్పి ఆళ్ల నల్లరి సేస్తే నే నరకూపంలో పడనూ? నువే చెప్పు?"

వడ్లవానిభార్య యించుక నవ్వి "కాదటే?" అన్నది.

ఈవిధమునఁ దోవపొడుగునను కంట బడినవారి కెల్ల సక్కూ బాయి యీవృత్తాంతము తూచా తప్పకుండఁ జెప్పివైచెను. తనకుఁ గొంచెము పరిచయము గలవా రెవ్వరైన నిద్రించు చుండినను వారల మేలుకొల్పి యీవృత్తాంతము సవిస్తరముగఁ దెలుపు చుండెను. ఇవ్విధమున నద్ది గ్రామ మంతయు వ్యాపింపఁ జేసెను.

౬

ఉదయము ఎనిమిది గంటలయ్యెను. వినాయకుఁడు ఉ ఉ హు హు హా హా అని కాలుసేతులు సాగ దీసికొనుచు, ఒడలు విరచికొనుచు నొక్కవిసరున బడకనుండి లేచెను. అతఁడు ప్రాతర్విధుల నిర్వర్తిం చునప్పటికి తొమ్మిది గంట లయ్యెను. అనంతరము వినాయకరావు గారి దినచర్య ప్రారంభమయ్యెను. ప్రప్రథమమున చిలుము (గంజాయి త్రాగుపరికరము) సిద్ధమైనది. అతఁడు దొడ్లువిడచి బయట కేఁగు నప్పుడు నిత్యకృత్యములలో నత్యావశ్యకమైన పారఁబాసను గాని నాల్గుగ్రుక్కలు చిలుము పీల్చుటయందు మాత్రము పొరపడఁడని యింతవఱ కెన్నఁడు విని యుండము. అట్లగుట చక్కఁగ కడిగి తుడిచి పరిశుభ్రపఱచిన ప్రియుఁతో నగు ఆగంజాయి నాలుగైదుదమ్ములు పీల్చుటలో సమగ్రశక్తి తోడను బీల్చి, మిక్కిలి తీవితోఁ ధూమ మును చుట్టలుచుట్టలుగ నాలి చిన్న చిన్న మేఘముల గల్పించుచు స్తంభమున కానుకొని వినాయకరావు కూర్చుండెను. ఇంతలో "వినూ! ఓరే వినూ! ఒక్క పదిగంటలు కొట్టినారురా. నీచాదస్త మింకను కాలేదటరా! నీవు బాజారునకు వెళ్ళు టెప్పుడు? వెచ్చములు తెచ్చు టెప్పుడు? నేను వంట చేయు టెప్పుడు? ఏమి చేయ నమ్మా యీపిల్లవానిని! ఇంట నొక్క బియ్యపు గింజైనను——" అని తల్లి పలుకగా,

"వాని కాలస్య మేమిటి? అప్పుడే తిరిగివచ్చినాఁ డనుకొను" మనుచు వినాయకుఁ డుత్తరీయము పైనవైచి కొని తలపై టోపీ బెట్టుకొని తల్లికడకు వచ్చి వెచ్చము లేమేమి తేవలయునో యామె వలనఁ దెలిసికొని యింటినుండి వెలుపలకు వచ్చెను. అంతలో వాని కొకవిషయము స్మరణకు వచ్చినది. బాజారున కేగు టెందులకు? దగ్గఱ పైకము లేనిచో బాజారులోనివస్తువు లింటికి వచ్చు టెట్లు?

వినాయకునికడ నొక్కచిల్లిగవ్వ యైనలేదు. ఎటునుండి వచ్చును ? పాపము వాని కేమియు నుద్యోగము లేదు. ఉద్యోగము చేయుట కావశ్యకము లగు శక్తియుక్తులును వానికడ లేవు. శుభాశుభముల కెచ్చటనైన దొరకినదక్షిణలు ప్రాణసమాన మగు గంజాయిచిలుము యం దెప్పటి కప్పుడే భస్మమగుచుండెను. అప్పటికిని వానికి గంజాయి క్షుధాశాంతి యాగుట లేదు. దగ్గఱ డబ్బేమియు లేనప్పుడు మాత్రము వినాయకుండు గంజాయికొఱ కెవ్వరిపాదములనైనఁ బట్టుకొనుచుండును. అటులొనర్చుటచే నేదోయొక మాదిరిగ గంజాయి క్షుధ తీరగలదు. కాని యింటికి కావలసిన వస్తువు లెవరి పదములపైఁ బడినను దొరకవు. దీనికి జేబులో పైసా యుండితీరవలయును! వినాయకుఁడు లజ్జితుఁడై తలవంచికొని నేలఁజూచుచు నిలచియుండెను.

అప్పటి కప్పుడే కొమరుని స్థితి రాధకు జ్ఞప్తికి వచ్చెను. పాప మాపె యేమి చేయఁగలదు? "చచ్చినవానికి బుద్ధి లేదు. నన్ను బెదరించి తినుటతప్ప మూఁడుపుట్లు—" అని యేమేమో గబగబ నాలుగు తిట్టి స్వయంపాకగృహమునఁ బ్రవేశించి శిథిలమైన యలమారులో, లోపలగి, జీలకఱ్ఱబుట్టలో, కడు జాగరూకతతో దాచి యుంచిన పదునాలుగణాలలో నాలణాలు తీసి, వినాయకున కొసఁగెను. ఆ అణాలు దృష్టిపడినంత వినాయకుఁడు ప్రఫుల్లవదనుఁ డయ్యెను. అతఁడు చప్పుచప్పున వీధిలోనికి వచ్చి హుటాహుటిగ బజారువైపునకు నడచెను.

వినాయకుఁడు బాజారునకు వచ్చినతడవుగ నప్పుడే రాముకాకా ణాదా రాత్రిని కేకవైచి తా నొసఁగు గంజాయిపొట్లము స్వీకరించి వెళ్ళవలసిన దని వేఁడికొనియెను. వినాయకుఁ డాదుకాణదారుని వేదికతో లును, గంజాయిబోఁడి మోహమును ద్రోసివేయజాలక కూర్చుండెను. చిలుము తయారగుచుండ లోకాభిరామాయణము చెప్పుకొ

నుచు మెల్లమెల్లగ రెండు మూడు నాల్గు అయిదు ఆఱు ఏడుసార్లు దమ్ము పీల్చెను. వినాయకుఁడు తన్మయుఁడై పోయెను. వాని కన్ను డఱచేత స్వర్గము గానవచ్చు చుండెను.

ఇట్లు ఈకొణమునందు జరుగుచున్నకథ రక్తికట్టు చుండెను. ఇంతలో యజ్ఞేశ్వరభట్టు వడివడివచ్చి వినాయకుఁడచట గూరుచుండుటఁ గాంచి యాశ్చర్యమున నిట్లనియెను. "బలే, ఎట్టిసంసారివి రా! ఊరంతయు దిరిగినను నీజాడయే కనబడదు? నీవిక్కడ సంతోషముగ ముచ్చటలు వినుచుఁ గూర్చుంటివి. లే-లే- తొందరగ పరుగెత్త వేమి? హరభట్టుపినతల్లి చావునకు సిద్ధముగా నున్నది. త్వరగ పరుగెత్తు ప ప- న- న నేను వా వా -ని మంత్రము చెప్పుటకు దీసికొని వచ్చెదను. ఇట్లు చెప్పి యజ్ఞేశ్వరభట్టు వడివడినడచి దాన రకర్మ చేయించు పౌరోహితునియొద్దకుఁ బరువెత్తెను. యజ్ఞేశ్వరభట్టు వలన నీసంగతి విని నంత వినాయకుఁ డొక్కక్షణమైన విలంబన మొనర్పక హరభట్టు పినతల్లి గృహమునకు వచ్చిచేరెను.

ఆహాహా! వినాయకరావున కెంతయాత్రము! ఎంత పరోపకార పరీణత! సర్వభక్షకుఁడగునయ్యగ్ని దేవుని తొందరకంటెను వినాయకుని తొందర యెక్కువగ నున్నదే! వినాయకుడు వచ్చి చూచు నప్పటి కాగృహమంతయు నిశ్శబ్దముగ నుండెను. మృత్యుదేవత సామ్రాజ్యము ప్రబలి యుండెను. ఇంటియందు మరణోన్ముఖి యగు ముదుసలి తప్ప నింకెవ్వరుఁ గాన రారైరి. ఆమెను భూశయన మొనర్చుట కైన నింకొకఁడు లేఁడు. ఇంతలో బయటనుండి యజ్ఞేశ్వరభట్టుగుదెంచి, శంఖమునూదించు వినాయకుని మొగమును గాంచినంత నాతఁడు నిశ్చేష్టుఁడై, కొంతవడికి చేత నున్న దహన సామగ్రి యటనుంచి, వెనుదిరిగిపోయి, యిరుగుపొరుగు మనుష్యులను బోగుచేసికొని వచ్చెను. అంత నాప్రేతమును శ్మశానమునకుఁ జేర్చిరి. వినాయకుఁడు దహనాదిక్రియ లొనర్చుటయం దగ్రేసరుఁడు.

వినాయకునకు వీడు తనవాడు వీడు పెరవాడను నను భేదము లేదు. పాపము మిక్కిలి సాధుశీలుఁడు. అనాధులకును, నిరాశ్రయులకును, సహాయము మొనర్చుట యనన నీతని కెంతయు సంతసము. శ్మశానమున నందఱు చల్లని చెట్లనీడల ముచ్చట లాడుకొనుచుఁ గూర్చుండి యుండ నమాయకుఁ డగువినాయకుఁడు తీవ్రమగు నెండలో జాము సేపు చితిసమీపమున నుండి దహనసంస్కార మొనర్చెను. ఆవృద్ధ ప్రేతము దహనమగునప్పటికి సంధ్యాకాల మయ్యెను. అనంతరము నదిలో స్నాన మొనర్చి యందఱు నిండ్ల కరిగిరి.

తాను బాజారున వెచ్చములు కొనిపోవుటకై వచ్చి యుండుటయు, నింటియందు తల్లి తనకై యెదురు చూచుచుఁ గూర్చునియుండు ననియు, నాకస్మికముగా నతనికి స్మరణకు వచ్చెను. అంత నప్రయత్నముగ వానిచేయి రొండిపైకిఁ బోయెను. నదిలో స్నాన మొనర్చునప్పుడు రొండిడబ్బు లెప్పుడు జలసమాధి యయ్యెనో పాపమింతవఱకు నాతఁ డెట్లు తెలిసికొన నగును? ఇప్పుడుమాత్ర మాతఁడు నిర్విణ్ణహృదయుఁ డయ్యెను. ఇప్పట్టునమాత్రము తల్లి తనయెడఁ గలప్రేముడి బాటింప దనుభయమున మెల్లమెల్లగ వినాయకుఁ డింటిముంగిలికి వచ్చి చేరెను. మెల్లగఁ జెవియొగ్గి వినియెను. గృహమున నెవ్వరిసవ్వడియు గానిపింపదయ్యెను. ఒకటి రెండుఘడియలప్రొద్దు పోయినది. అప్పటికైన నింట దీపము వెలుగుట లేదు. వినాయకుఁడు మెల్లగ భీతిగొల్పు స్వరమున 'అమ్మా అమ్మా ఓఅమ్మా అ—' అని పిలచెను.

అప్పటికిని ప్రత్యుత్తరము లేదు. అప్పుడు వినాయకుఁడు తిరుగ నుచ్చైస్స్వరమున, "అమ్మా—మ్మా—అ—" అని కేక వైచెను. వెంటనే యాకసమున నొకప్పుడెట్లు భయంకరశబ్ద మగునో యవ్విధమున రాధ గర్జన వినవచ్చెను. "ఓరి తెల్లమొగమా! ఇప్పుడా యింటికివచ్చుట?

ఎప్పుడు వెళ్లుట, ఎప్పటి లోకము! ఇంతసేపు వెచ్చములు కొనుచునే యుంటివా? చచ్చినవాడా! నన్నొక్కనాటికే చంపగూడదటరా! నీ చేతులో బాధ——!"

తల్లియొక్క యీ యూరకసంభాషణ నాకర్ణించి యంత వినాయకుని ప్రాణము తెక్కడికక్కడ జేరుకొనియెను. వానికి జననిస్వభావము తెలిసియే యుండెను. తన్నెప్పుడు నిందలం గట్టునో యప్పుడు దాపి కోపానలము చప్పున చల్లారవలసినదే! ఇది వినాయకుడు బాగుగ నెఱిగియుండుటచే నాతండు మాటలాడుటకు సాహసించెను:- "అమ్మా! మీనాయన పినతాత మనుమరాలు చచ్చిపోయినది. ఆమె దహనమునకు వెళ్ళితిని పాపము పేద దగుటచే నెవరును వచ్చినారు కారు. నేను మాత్రము వెళ్ళినాను. అమ్మా! నీవే చెప్పుము? అట్టిసమయములో నుపేక్ష చేసినచో దైవము మెచ్చునా?"

రాధకు మిక్కిలి యాగ్రహము జనించెను. "నీ మెచ్చులమీద నీమీద నిప్పుపెట్టా! చచ్చినవాడా! పీనుగులను తగులవేయుటకా, నీవు జన్మమెత్తినది? నీవుతప్ప వాండ్లకు కెవరును దొరకలేదా? లోకము లెట్టి తుచ్ఛపు ముండాకొడుకులో చూడుము. ఈ పనికి చచ్చినవాళ్ళెట్లు నాబిడ్డను పిలువ వచ్చిరో! ఇంకే దేని శుభకార్యములలో మాత్రము మా చచ్చినవాళ్ళకు మావాని జ్ఞాపకమే యుండదు! ఈ పిచ్చి ముండాకొడుకున కంతబుద్ధి యేది? బజారుకని నీవింటనుండి బయలుదేఱి, మనసు వదలిపెట్టి, యెవతెనో తగలవేయుటకుం బరుగెత్తితివా! సర్కారువారు నిన్ను పీనుగులను తగుల వేయుటకు నియమించినారా; ఎవం డైన చచ్చినాం డని ఖబురు చెవిం బడిన జాలును, విధవవు పరుగెత్తుకొని పోదువు! పెద్దగుఱ్ఱమువలె నుంటివి. నీ కింకను సంసారభాధ్యత యేల కలుగదు? నీకు బుద్ధివచ్చున దెప్పుడు? నే చచ్చినతరు——"

ముసలి దానిగ్రహము సమాప్తమగు సమయమునకు గంగా యమునల సంగమము తప్పక కావలసినదే! అట్లగుట నామె కొంతవఱకు రోదన మొనర్చెను. కన్నులు, హృదయము, ఆగ్రహావేశమునుండి మరలినపిమ్మట కొమరుని సంగతి స్మరణకు రాగా నామె యిట్లనియెను. "నాయనా, వినూ! ఇంతకు నీ వేమైన భోజనము చేసితివా ?"

వినాయకుఁడు భయపడుచు "నా పురాణమా! ఇంతవఱకు గుక్కెడు నీళ్ళు కూడ నే నోటికో మెఱుఁగను!" అని పలికెను.

రాధ కోపాగ్ని మరలఁ బ్రజ్వలింపసాగెను. ఆమె శరీరము చలింపఁ దొడఁగెను. ఒక్కతీరున నామె లోపల నిందింపఁ దొడఁగెను. "ఆ చచ్చినవాండ్రది మనసా పాషాణమేగా, కాని నాబిడ్డ కన్నము పెట్టవలయు నని యొక్క-చచ్చినవానికైనఁ దోఁచఁగూడదా ? స్వర్గము మాలిన ముండకొడుకులు! పిలుపులకు మాత్రము పరుగులిడుచు వచ్చెదరు— నీతియు జాతియు లేనిముండ.—"

వినాయకుఁ డామె నిరాగ్రహార్ద్రతనొప్పు నిదియే మంచి యవసర మని గ్రహించి చప్పున గ్రిందఁ గూర్చుండి యెలుఁగెత్తి జాలిగొలుపు నట్లనియెను. "అమ్మా! ఏమే! నా కెంతో ఆఁకలి యగుచున్నదే, తినుట కేమైన బెట్టవా ? హు—హు—"

ఇప్పటివఱకు రాధమనస్సు నీరయ్యెను. ఇప్పుడు తండ్రివైపున నెవ రయో చచ్చినందుల కామె కణమాత్రము విచారము కలిగినది. ఆమె కన్నులనుండి రెండుమూఁడశ్రుబిందువులుకూడ జాఱినవి. అనంతరము పుత్రుఁ డీదిన యంతయు నుపవాస మని యా వృద్ధురాలికి స్మరణకు వచ్చెను. ఆమె వడివడి దీపము వెలిగించి "ఆ డబ్బా తేవే ? ఇటు లిమ్ము" అని కొమరునితో ననెను.

వినాయకుఁడు నిరుత్తరుఁ డయ్యెను. ఏమిచెప్పవలయునో వానికి

దోఁచ దయ్యెను. చివఱ కెంతో ప్రయత్నమున నాతఁడు జడియుచు "స్నానము చేయుచుండగా రొండిడబ్బులు నదిలో నెక్కడ పోయెనో నాకు తెలియదు" అని పలికెను.

"మంచిపని చేసితివి! నాయనా దొడ్డపనిఁ జేసితివి!"

రాధ మరల నేడ్చుటకుఁ బ్రారంభించెను. ఇంచుకవడి యేగినంత నామె రోదనము సమాప్త మయ్యెను. పిదప నామె యిట్లనెను. "అయితే పిల్లఁడా! అహోరాత్రము లిట్లు నన్ను వేపుకొని తినుటందులకు? ఇట్లయిన నీవు సంసార మెట్లు జేసెదవురా?"

తల్లి చెప్పెడిమాట లాతని మనసున నాటవయ్యెను. మరల నాతఁడు కరుణాస్వరముతో "అమ్మా! ముందు నా కేమైన దినుటకుఁ బెట్టవా? పెట్టి తరువాత నీవు చెప్పఁ దలఁచిన దేమో చెప్పుము." అనెను.

ఎంతైనను తల్లిప్రాణముకదా? ఆమె చప్పున లేచి, గదినుండి రెండుగుప్పిళ్ళయటుకులు దెచ్చి వానిముందు పోసి "ఇవి తిను నాయనా! ఇవి తప్ప నింట నింకేమియు లేవు." అని చెప్పెను.

ఇట్లనుచుండ రాధనేత్రద్వయము నశ్రుపూరిత మయ్యెను.

అటుకులు కంటఁబడినంత వినాయకుఁడు సంతోషముతో నాత్రముతో నాయటుకులు నోటినిండా పోసికొని బొక్కసాగెను. తల్లి వానికి సమీపముననే కాళ్ళు పాఱజాచికొని కూర్చుండెను. ఆమె కన్నులనుండి మరల గంగాయమునలు ప్రవహింపసాగెను. "ఈదినమెంత పాపిష్ఠిదినము! నాగొడ్డు వస్తుపడి యుండెనే! ఒక్కపిడచైనను వాని నోటఁ బడలేదుపో! నాజిహ్వ మండిపోను! అమ్మా కులదేవతా! నూరు కాలములపాటు నాబిడ్డలు సుఖవంతులై యుండునట్లనుగ్రహింపుము. అంబా! నాశక్తిమేరకు నీకభిషేక మొనర్చెదను. నానోట వచ్చు తిట్లన్నియు నాబిడ్డలకు దీవెనలు చేయుము. నాయాయు

వంతయు నాయిరువురు బిడ్డలకును కోడండ్రకును, మనుమలకు నొసగి వారిని చిరంజీవులుగ నొనర్చును. అమ్మా తల్లీ! నీ ముందు నేను కొంగుపట్టి వేడుచుంటిని. నాజిహ్వ మండిపోను. నాపిల్లల నేను నిష్కారణముగ—"

వృద్ధయగు రాధమ్మ హృదయము దుఃఖపూరిత మయ్యెను. ఇచట వినాయకుఁడు యథాప్రకారముగ నటుకులు నములుచు, రాగిచెంబెడుదకము కడుపులోని కెక్కించి త్రేన్చుచు నిట్టూర్చును. "అమ్మా! ఏడ్చెద వెందులకు? తిట్లా! హాహాహా! అవి తిట్లుకావే, అవి యన్నియు మాకు దీవెన లనుకొనుము! ఈ భాగ్యమునకు నీ కంత విచార మెందుకే?"

"లేదురా నాయనా! ఈదినమునుండి నే నిఁక నెప్పుడును మీపైఁగ కోపపడను!"

రాధ మరల లోనికరిగి మఱియొక గుప్పెడటుకులు దెచ్చి వినాయకునిముందుఁ బెట్టెను. ఇప్పట్టున మాత్రము వినాయకునిసంతోష మునకు పారము లేనిదయ్యెను. అతఁడటుకుల నడినడి నోటఁ బోసికొని, పిమ్మటఁ గడుపునిండ నీరెక్కించి దాహశాంతి చేసికొనెను. అనంతరము నిత్యకృత్యక్రమణిక చొప్పున చెంబును హస్తమున ధరించి, నిశ్చలత్వముగ గంజాయిదేవిని ధ్యానించి, సంతోషాంతరంగుఁడై నిద్రింపఁ జనియెను. అతఁడా రాత్రి శయ్యపై నొకప్రక్కనుండి మఱియొకప్రక్కకొత్తిగిలనైన లేఁడు. పాపము, రాధకుమాత్ర మారాత్రి నిద్ర పట్ట దయ్యెను. ఆమె ముద్దులకొమరుఁడు వినాయకుఁడాడిన మాటయు నుపహాసముగదా! ఈవిషయ మామె మనసును నొప్పించి యుండుటవలన రేయి యంతయు నామె సెజ్జపై కటకటఁబడుచు బరుండియుండెను.

## ౨

మరునాఁడు రవివారము పండ్రెండు, ఒంటిగంటకు రాధ వంట సిద్ధమైనది. ఆమె వినాయకరావును భోజనమునకు రమ్మని కేకవైచెను. వినాయకుఁడు మందహాస మొనర్చుచు వచ్చి పీఠముపై విరాజమానుఁడయ్యెను. భోజనానంతరమున హస్తప్రక్షాళన మొనర్చినది తడవుగ వినాయకుని కంట కాలు నిలువ దయ్యెను. కుమారునిభోజనమైన వెంటనే తల్లియు భోజనమునకుఁ గూర్చుండెను. ఒకటి రెండు కబళములు గర్భగోళమునఁ బ్రవేశించెనో లేదో యింతలోఁ బొరుగున గల ఉమాబాయి మెల్లమెల్లగ నటఁ బ్రత్యక్ష మయ్యెను. వచ్చినది తడవుగ నామె "పిన్నీ నిజమేనా యీసంగతి ?" అన్నది.

రాధ చకితయై తత్తరముగా "ఎవరిసంగతే ఉమా?" అనెను.

"ఇక్కడ గంద్రగోళ మేమో పార్వతి తనపుట్టినింటికడ చెప్పినదఁటే! ఎందుకమ్మా?"

రాధకు శరీర మంతయుఁ జీమలు జెఱ్ఱులు ప్రాఁకినట్లయ్యెను. 'చెప్పిన చెప్పనిమ్ము. దానితండ్రి యెంతగొప్పవాఁడైనను యింతమాత్రమునకు నాతల యేమియుఁ దీయఁబోడు లే.' అని పలికెను.

"అవును. కాదా? వారికి జడియుదువా యేమి? ఎంతైనను నీ యంత దానవు నీవు. వాఁడెక్కువ నీ కేమిటి! అయితే పిన్నీ! ఎవరో యనుకొనుచుండగా విన్నాను — నిజమో అబద్ధమో దైవమున కెఱుక. పార్వతి నిచ్చుటకేఁ బంపుటకు దానితండ్రి కిష్టము లేదఁటే! లక్ష్మితండ్రికూడ తనకుమార్తె నిచ్చుటకేఁ బంప నన్నాడఁటే! నిజమేనా రాధమ్మపిన్నీ?"

శరీర మాద్యంతము కంపింప రాధ యిట్లనెను. "వాళ్ళనోట మన్ను బోయా పంపరుగా! మానదాశివునకు తిరిగి పెండ్లి చేసెదను. పదిమూఁడేండ్లపిల్ల సిద్ధముగా నున్నది. ఇప్పుడు తీసికొనివచ్చి మూాన్ని

కాళ్ళపట్టుక పడవైచెదను!"

నానాతల్లి తానేకోర్కెతో నట కరుదెంచెనో యామనోభీష్టము నెఱవేఱునట్టి మేమియుఁ గానరాము మనసులోన మిగులఁ జింతించి "అహాహా! ఇది మిగుల చిత్రమైనకథ. గ్రామమంతయు డప్పు లేకుండ నిశ్శబ్దముగ జాటించవలెను. ఇదియే మంచితరుణము. ఇట్లొనర్పనిచో స్త్రీజన్మమెత్తి యేమిసార్థకము. మరల నొక్కసారి ప్రయత్నించి చూచెదఁ గాక" యని తలపోసి యిట్లనెను. "ఏమి రాధమ్మ పిన్ని! నీకోడలి కింతమాత్రము జ్ఞానము—"

"నాకోడలిజ్ఞాన మెట్టిదో నేను చాలకాలమునుండి యెఱిఁగియే యుంటిని. అది యిప్పుడు క్రొత్తగాఁ దెలిసికొన నవసరము లేదే?"

హరహర! ఈప్రత్యుత్తరముతో పాపము ఉమ హతాశయయ్యెను. తలవంచికొని యామె మెల్లమెల్లగ వచ్చినత్రోవఁ బట్టెను. ఆమె యటనుండి వెడలుట తడవుగ నప్పుడే యాస్థానమున యమునాబాయిగారి శుభాగమన మయ్యెను. అప్పుడే పాప మామెముసలి భోజనమునకు ద్వితీయవిఘ్న మావహిల్లినదే! యమున శివమెత్తినదానివలె నటించుచు నిట్లనెను. "ఏమిపిన్ని! నీవేమో పార్వతి నింటినుండి వెడలఁ గొట్టినావఁటే?"

"ఏ యర్థాయుష్మంతుండే, నీతో చెప్పింది?"

యమున గంభీరస్వరముతో "గ్రామమంతయు వ్యాపించిన సంగతి యిప్పుడు నీవు దాఁచిన దాఁగునా పిన్నీ?" అని పలికెను.

రాధ యించుక చల్లబడి యిట్లనెను. "నాకోడలిని నేఁ గొట్టెదను, తిట్టెదను, పెట్టెదను, నాయిష్టము. ఇందు లోకుల కేమి సంబంధము? ఇతరులను గుఱించి యిట్టి కానిపోనిమాటలాడుకొనుటకు మీంద్ర కేచచ్చినవాండ్రు చెప్పిరి?"

ఇంక నేమున్నది! పాపము యమునాబాయి ప్రయత్న మంతయు

నిష్ఫల మయ్యెను. అమ్మగారు నిలువున నీరైనది. అప్పట్టున లేని గాంభీర్యము దెచ్చుకొనుట కేదియో యుక్తిపన్ని "నేననునదియు నదియే" యనుచు గబగబ వెనుదిరుగ నాడకుండ నామె తనయింటి త్రోవ బట్టెను.

రాధ చల్లారినయన్నమునపై మరలఁ జేయివైచెను. మరల నామె దురదృష్టము. ఆమె యదృష్టములో నీదినపు భోజనము లిఖించియుండ లేదని తోచుచున్నది. యమునాబాయి యరిగి రెండుమూడు నిముసములు గడచెనో లేదో యప్పుడే ప్రక్కవీథి మాళసాబాయి తొందరతొందరగ రాధయింటి కరుదెంచెను. మాళసాబాయి యనగా సామాన్యస్త్రీ కాదు. గ్రామమునఁగల జనులందఱు ముఖ్యముగ నామెలిట్టనోటికి మిగుల భయపడుచుందురు. వీధిగుమ్మము తో పాదము మోపినదో లేదో యప్పుడే యొక్క పెట్టున మొగులుబ్రోతత నత్ర నిట్లనెను. "నీవయసుమీఁద నీమీఁద నిప్పులుపోయ! ఇన్ని యేండ్లు వచ్చిన నీతికున కోడలిని మనుమలను కొట్టి వెడలఁగొట్టుటకు నీకేమి సిగ్గయినలేదా! ఛూ, నీయేళ్ళపైన—"

ఇప్పట్టున మాత్రము రాధకోప మాకస మంటెను. ఆమె కోపా వేశమున నిట్లనియెను "ఎవతె యీకూఁత కూసినది?"

అయినది మొగ మింతైనది. మాళసాబాయి మనోరథ మీడేఱినది. ఇంతకన్న నామెకుఁ గావలసిన దేమి? ఆమెకంతస్వర మొక్క పెట్టున స్ఫుటస్వరము నెగసినది. "ముసలిలొట్టా! ఎన్ని భయపనాముండ అనెదవు? ఎందు నేనుభయపడనుండను? ఓసి అర్ధాయుష్మముండ! ఎందుకేయోంల్లుపట్టినది! నీవుముండవు నీ—"

ఆగ్రహమున రాధ ఆపాదమస్తకము కంపింపఁ దొడఁగెను. తన ముందరివిస్తరి చుట్టచుట్టి యుత్తరీపట్టుకొని లేచి నిలువఁబడెను. అంతట వారిరువురినడుమ నపూర్వశబ్దములతోను, అపూర్వవాక్సరణితో దను

అపూర్వాభినయములతోడను ఈ మల్లయుద్ధము ప్రారంభ మయ్యెను.
కొంతతడవునకా సంగ్రామము కడముట్టినది [illegible] రాధా సంపూర్ణపరాజయము నందినది. గయ్యాళియగు మాళసాబాయి ముందు నిష్కపటయు, సాధుశీలయు నగునామె సవతి యెందుల కక్కఱకు వచ్చును? మాళసాబాయి రణరంగమున విజయ మొందినది తన విజయార్భటిచే దిగంతములను ప్రమోగించుచు నడచిపోయెను.

## ౨

సదాశివునియత్తవారిగ్రామము పల్లెటూరు కాదు. మ్యునిసిపాలిటీ, పోలీసు స్టేషను, మునసబ్ కోర్టు, సెకండరిపాఠశాల, లైబ్రరీ మొదలగు నవి కొన్ని యచటఁ గలవు. బ్రహ్మ క్షత్రియ వైశ్యాది సకల జాతులకు నాయూర వసతులు గలవు. అందు నైష్ఠిక బ్రాహ్మణ గృహము లెన్నో. మునసల్మానుల మస్జిదులుకూడఁ గొన్ని యుండెను. ఊరిబయట చెఱువులు, చల్లనితోఁటలుఁ గూడఁ గలవు. వీథులు వెడల్పు గలిగి వచ్చిపోవుపల్లెటూరిజనులతో సందడిగ నుండును. ఇట్టియూరు గాంచినవా రెవరు దీనిని పల్లెటూ రందురు? అట్లు తలంచినవా రెవ్వరేని యీగ్రామపణ్యవీథిని గలరెండుమూఁడు సువాసనా సమృద్ధములగు నత్తరుదుకాణముల గాంచినంత శంకావిముక్తులగుదు రనుట నిశ్చయము. ఇంక రాత్రులయందు నడుమనడుమ వారయోషిజ్జనులకంఠరవములును సారంగ, సతారు, వీణా, ఫిడేలు హార్మోనియము మనోహరవాద్యసుమధురధ్వనులును వీథివెంట నడచు యువకులకర్ణరంధ్రములఁ జొచ్చి వారలఁ దల్లీనులుగఁ జేయుచుండును. ఇట్టిపురమును కుగ్రామ మనఁ జెల్లునా?

రామచంద్రపంత్ సహస్రబుధే అనుప్రసిద్ధబ్రాహ్మణుఁ డాకంఠీపురమునఁ గలడు. పూర్వ మీతఁడు బొంబాయిరైల్వేకంట్రాక్టరు.

ఆకంట్రీ క్లబ్బులో సైతఁ దమితోనుగ ద్రవ్య మార్జించి యాయుద్యోగము విడిచివచ్చెను. ప్రస్తుత మాతఁడు సర్వసంగపరిత్యాగ మొనర్చి యీశ్వరధ్యానతత్పరుఁడై యున్నాఁడు.

ఈతని జ్యేష్ఠపుత్రిక గంగాబాయి. పాపమామె బాలవితంతువయి నందునఁ బితృగృహంబున గృహకృత్యనిర్వాహ మామెమీఁదఁ బడియెను. ఈగంగ తరువాత రామచంద్రపంతునకు నారాయణరావు, మాధవరావు ననునిద్దరుపుత్రులు జనించిరి. వీరిలోఁ బెద్దవాఁడు స్వర్గస్థుఁడై యాఱుసంవత్సరములే యయ్యెను. అతనిపత్ని హతభాగిని లక్ష్మి తన చిన్నకుమారునితోఁ గూడ తండ్రియింటనే నివసించుచుండెను. కనిష్ఠుఁడు చిరంజీవి మాధవరావు. ఈతఁడు ప్రథమపత్ని గతించి నందున రెండువత్సరములకుముందు ద్వితీయవివాహముఁ జేసికొనియెను. భార్యపేరు మనోరమ. రామచంద్రునిద్వితీయపుత్రిక పార్వతి. ఈమెయే సదాశివరావుగృహిణి. మనపెద్దకోడ లీపార్వతియే. పార్వతి తరువాత రామచంద్రునకు పుత్రసంతానము లేదు. రామచంద్రునిపత్ని యిహలోకయాత్ర ముగించుకొని యాతని మగబాధిఁ బడద్రోసి చని యిప్పటికి సుమారు పదివత్సరము లయ్యెను. వృద్ధుఁడగు రామచంద్రుఁడు మరల వివాహ మాడలేదు. ఇది ప్రస్తుత కాలమానస్థితులను బట్టిచూడ నాశ్చర్యమైన కన్పట్టుట నిక్కువమే.

రామచంద్రుని వయసు దాదాపు డెబ్బదివత్సరములు మీఱియుండియు శరీరపాటవమును బరికించిచూడ వయసంత యుండునా యని సందేహము కలిగింపక మానదు. ఆపురమున నాతనికి గౌరవాధికారములు మెండుగ నుండెను. గ్రామస్థులందఱు నాతనియెడల భయభక్తులు గలిగిమెలఁగుచుందురు. ఆతని మాట రామబాణమే! ఎందులకు కాదు? కాంచనము మహామహిమగలది. అది యెవనికడ నుండునో వాఁడెట్టివాఁడైనఁ గానిండు—వాఁడే పండితుఁడు. వాఁడే

కులీనుఁడు. వాఁడే గుణవంతుఁడు. అట్లగుటచే రామచంద్రునివా
క్కమోఘ మగుటయం దబ్బుర మేమి ?

ఇప్పు డాత డీమాయాప్రపంచమున నైహికచింతలఁ బరిత్య
జించి కేవల పరమాత్మచింతనమం దే కాలము గడుపుచుండెను. మంత్ర
తంత్రములయందుఁగూడ నతనికిఁ బూర్ణపాండిత్యము గలదనియు,
అష్టాంగయోగసిద్ధులుకూడ లభ్యమయినవనియు ప్రతీతి కలదు. ఈతఁ
డొకప్పుడు కంట్రాక్టుపనిమిత్తము నుత్తరహిందూస్థానమున కరిగియుం
డెను అచ్చట నీతనికిని, ఒకానొక గోసాయికిని పరిచయ మయ్యెను.
ఈతఁడు యోగదీక్ష బొందిన దాసన్యాసివద్దనే. గురువిషయ
మున నతనిమాత్ర మీతఁ డచంచలభక్తియుక్తుఁడు. తనకుఁ గలిగిన యోగసము
న్నైశ్వర్యమునకును గురుకృపయే కారణ మని రామచంద్రుని విశ్వా
సము ఈతఁ డిప్పటికి నప్పుడప్పుడు గురువస్యాలిదర్శనలాభమునఁ
కృతార్థుఁ డగుచునే యుండెను.

రామచంద్రవంతు సర్వసంగపరిత్యాగ మొనర్చి యీశ్వర
ధ్యానమునఁ దనయాయువు గడప కృతసంకల్పుఁడై యుండెను. కాని
శివిల్ క్రిమినల్ వ్యవహార పరిష్కరణమును, అధికారయోగమును
సతనియోగసమాధి కప్పుడప్పుడు విఘ్నములుగా నుండెను. రామ
చంద్రుని బాహ్యాచరణమును గనిన క్రొత్తవా రాతని మహాసాధు
పురుషునిగఁ దలంచుచుందురు. చిరపరిచితులుమాత్ర మాతనిని
పరోక్షమున నిందించుచునే యుందురు.

తత్పుర బాహ్యప్రదేశమున గలచండికాదేవి రామచంద్రునకుఁ
బ్రసన్నయయి, అప్పుడప్పు డర్ధరాత్రములందు దర్శన మొసఁగు
చుండు ననియు ప్రతీతికూడ గలదు.

రామచంద్రుని బాహ్యప్రకృతి యెట్టివారిమనస్సుల నైన భక్తి
భావసమన్వితముగఁ జేయఁగలిగి యుండెను. ఉన్నతము స్థూలము

నైన శరీరమును తప్తసువర్ణోజ్జ్వలదేహకాంతియు గళమునందలి స్వర్ణ ఖచితరుద్రాక్షమాలికలును మొదలగువానివలన గలిగిన సమాజభక్తికి దోడుగ విపులసంపత్తి కూడ నుండెను. మఱి కావలసిన దేమి ?

జనకుని యీయాచరణము నారాయణరావునకు మాత్ర మేమియు దృప్తికరముగ నుండెడిది కాదు. మిక్కిలి దీని మూలమునఁ దండ్రికొడుకుల కప్పుడప్పుడు కలహము సంభవించు చుండెడిది. నారాయణరావు కంట్రాక్టు సేయుచు దానివలన కొంత ద్రవ్య మార్జించుటవలన రామచంద్రునకు వానిపట్టున నించుక జంకుండెడిది. పాపము నారాయణరా వకాలమృత్యుముఖమునఁ బడి తండ్రిమార్గము నిష్కంటకము చేసెను. సంసారమునకుఁ గర్తయు, చేతికి నోటికి నక్కఱకు వచ్చినవాఁడును, వినయసంపన్నుఁడునైన నారాయణరావు కాలధర్మము నొందుటకు గ్రామవాసు లెల్లరు దుఃఖించిరి. రామచంద్రునకు మాత్ర మందులకు విశేషదుఃఖము గలిగి నట్టుల ప్రవర్తనమునుబట్టి చూడఁ గానిపించుట లేదు. రామచంద్రుని యీయమానుషరాక్షసవర్తన మెవరు కన్నులారఁ జూచియుండిరో వారికా విషయము మనస్సుల నాటియుంటచే వారు వానివెనుకనే తమలో నెన్నియో తెఱఁగుల నాతని శపించు చుందురు. ఎవ్వరు వానియథార్థప్రవర్తన మెఱుఁగరో వారతని మాయామోహములు లేనిసాధుపురుషుఁడని నిశ్చయించి యాతని మిగులఁ బ్రశంసించు చుందురు.

కనిష్ఠుఁడగు మాధవరావు బాల్యమునుండియుఁ దండ్రి కత్యంత ప్రేమాస్పదుఁడై యుండెను. సోదరుని పిమ్మట దేశపుకంట్రాక్టు పని యిప్పు డీతఁడే చేయుచుండెను. ఈతఁడు బొంబాయివిశ్వవిద్యాలయమున బి. ఏ. పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. ముందు ఎల్. ఎల్. బి. కి కూడ నేగ నమకట్టి యుండెను. దురదృష్టవశమున

సీసమయమున నే సోదరుఁడగు నారాయణరావు కాలగతి నొందుట వలన దండ్రి యనుమతి ప్రకారము వకీలుపని విడిచి అధికలాభము గల యీకంట్రాక్టుపనిలోఁ బ్రవేశించెను. నారాయణరావు మరణానంతరమున రామచంద్రునిమహాత్మ్యము ద్విగుణీకృత మయ్యెను. అతఁడు కంట్రాక్టుపని మాధవరావుపేరఁ బెట్టించెను. విగతభర్తృక యగు నారాయణరావుభార్యను లక్ష్మమ్మను, ఆమెపుట్టినింటికి పంపివై చెను. అప్పటినుండియు నాసమ పై భాగ్యమున మునిఁగియున్న యా సురదృష్టపు రాలియొక్క గాని యామె యనాథపుత్రుని యొక్క గాని క్షేమ సమాచార మైన నా పాషాణహృదయుఁడు రామచంద్రపంతు కనుఁగొనఁ డయ్యెను.

మాధవరావు తనబుద్ధి కేది తోఁచిన నది రహస్యముగ నాచరిం చుచునే యుండును. కాని పైకిమాత్రము జనకుని మతానుసారము ప్రవర్తించుచున్నట్లు నటించును. అతని కేశవర్గములయందును విశ్వాసము లేదు. దానివలన, నేదేని కీడు మూడునేమో యనుశంక యైన నాతనికి లేదు. తనవారియాచారవ్యవహారము లేమియు నాతనికి రుచింపవు. అట్లయ్యుఁ దండ్రిసముఖమున తన యసహన మేమియు బయలుపడనీక యెల్లప్పుడు జనకునిమతమే తన కామోదముగఁ బ్రకటించుచుండెను. అట్లగుటచే నీతఁడు రామచంద్రునకు ప్రేమాస్పదుఁ డయ్యెను.

గంగ బాలవితంతు వయినందున తండ్రి యీమెను మిగుల నాదరపూర్వకముగఁ బ్రేమించుచుండెను. దానిపరిణామమే యీమెవిలక్షణమున కొంతసహాయకారి యయ్యెను. గంగ దర్పము వలన భూమికూడ గడగడవడకు ననుటయం దేమియు నతిశయోక్తి లేదు. ఈమె స్వభావమున గలవిశేషవిషయమే మన నెవరైనను సుఖముగ నున్ననీమె కన్నులతోఁ జూడఁజాలదు. ఆవిషయ

మైఁ దనచెవులతో విన నోపదు. ఈమెకు వైధవ్యము సంప్రాప్త మైనప్పటినుండియు ననుదినము తనమనమున నిట్లని దైవ ప్రార్థన మొనర్చు చుండును. "దేవా! ప్రపంచమున గల స్త్రీజాతి నెల్ల నావలె ననాథ నొనర్పుము!" ఎవ్వతెకైన భర్త మరణించె నను వార్త యీమె చెవిఁ బడెనేని యెంతయు సంతసించును. మత్సరము ద్వేషము దర్పము అహంకారము అనుచితాభిమానము పిసుజీవవృత్తిమ వెవ్వరేని చూడఁదలఁచినచో వారు గంగ నొక్కసారి దర్శించిన వారిమనోభీష్టము తప్పక నెరవేఱఁ గలదు.

రామచంద్రుని కనిష్ఠకన్యకయు సదాశివుని పత్నియునగు పార్వతి విషయ మిట్లు చెప్పినఁ జాలును. గంగ కనిష్ఠభగిని యచ్చుముఁగ రూపమునందును గుణగణములందును నితర విషయములందును గంగకు కనిష్ఠయే.

౬

సదాశివరావు నాటినను సాయంతనమే శ్వశురగృహమునఁ జేరెను. మామ యగు రామచంద్రపంతు వీథియరుగు పై నిలుచుని యుండెను. ఆతఁ డల్లుని విశేషముగ నాదరింప లేదు. సదాశివుఁడు మామగారికి నమస్కార మొనర్పగానే "సుఖముగా నుంటివా?" అని మాత్రము విచారించి యాతఁడు తనపనిమీఁద నేగెను. సదాశివుఁడు చావడి లోనికిఁ జని యొంటరిగఁ గూర్చుండి యుండెను. అతనిం జూచి పరిచారకుఁడు తమలపాకులపళ్ళెము దెచ్చి యాతనిముందుఁ బెట్టెను. సదాశివుఁడు తాంబూలము నమలుచు గూర్చుండెను. ఇంతలో మాధవరావు సాయంకాలపు షికారునకై బయటికిఁ బోవుచు బూట్సు కిర్రుకిర్రుమని మ్రోగఁ జావడివైపునకు వచ్చెను. బావమఱఁదిని చూచినంతనే యాశ్చర్యచకితుఁడై యిట్లనియెను. "ఎవరు వారు! ఓహో! సదాశివరావా? ఎక్కడనుండి త్రోవ తప్పి—"

సదాశివుఁడు వినయముతో "ఓ గురూత్తమ మిమ్ముఁ జూచి పోవ" మని పలికెను.

"ఏమంటివి? ఇంతయనుగ్రహమా! హాహా! సరే కాని కేమి. కాని, నిజమే మొఁ చెప్పుము."

'మీచెల్లెలు కోపగించివచ్చినది. దానిఁ గొంపోవుటకు వచ్చితిని.'

"తీసికొనిపోయి చావఁగొట్టుట కాలోచించుట లేదుగదా?"

"చావగొట్టుటకా? అదెట్లు బావా!"

"గొంతుక కురిపెట్టి కాని, లేక అన్నము పెట్టక యుపవాసము లుంచి కాని!"

ఈపలుకు లాలించినంత సదాశివుని మోము కోపముచే నెఱ్ఱవారెను. కాని యాకోపమును లోలోపలనే మ్రింగి "మీరు దరిద్రులను గాన మావిషయమున మీ రిట్లు చులకనగ మాట్లాడ సాహసించితిరి." అని యతఁడు పలికెను.

"ఓహో! దరిద్రులైన నిట్లొనర్చుట లేదే! కడుపునిండ నన్నము లేనేలేదు సరిగదా, మీకునిక్కలి దుర్భాష లాడి దానిని హింసింతురా! ఇట్టి నీయింట నది యెట్లుండ నేర్చునో? అనరాని మాట లని, నొప్పించినచో నది నీయిల్లు విడచి వచ్చునా?"

"ఇదిగో చూడుఁడు; మీ రనుకొనునట్లు మీచెల్లెలిస్వభావము కూడ నంతమంచిది కాదు."

"అదియెట్లయిన నుండనిమ్ము. మీరు దానిని గొట్టి చంపినచే దరా? మంచిది. దానిని పోషించుసామర్థ్యము భగవంతుఁడు మాకింత కలుగఁ జేసి యున్నాఁడు. మీకు చెప్పినచొప్పున నడుచుకొనక పోవుట దానిలోపమా? అటులైన మతాంతరములకు నీవు దానిని మరల కొంపోవఁగా వచ్చితివి? సరే, నీవు వచ్చుటయే మేలాయెను. నీకుకూడ నిట నుండ నిష్టము కలదేని నిన్నుఁ బోషించు

టకు మా కేమియు నభ్యంతరములేదు."

"అట్టియూహతో నే నిటకు రాలేను."

"మంచిది. ఆసంగతి ముందు చూచుకొనవచ్చును. నే నిప్పు డొకింత బయటికిం బోవలసి యున్నది" అని మాధవరావు వాయ్యాలముగఁ జేతికఱ్ఱ గిరగిరఁ ద్రిప్పికొనుచు బయటికిఁ జనియెను. ఇచ్చట సదాశివుఁడు ఖిన్నవదనుఁడై కూర్చుండి యుండెను. కొంత తడవున కీతనిగాక వినఁగనే పుత్రద్వయము, జగన్నాథుఁడు రాముఁడు తండ్రిని జూచిరి. జగన్నాథుఁ డాతనితొడపైఁ గూర్చుండెను. రాముఁడు తనచిన్నిహస్తముల నంటిని తండ్రిమెడకుఁ బెనవేసి యాతని వీఁపుపై నెక్కెను. ఇరువురును సంతోషమున జనకుని మోమువంకఁ జూడఁ దొడఁగిరి. వారవ్యక్తమధురవాక్కులచే నెన్నియో ప్రశ్నలడుగుచు తండ్రిని ప్రముదితాత్ముని జేసిరి. పుత్రసంగమ్మంగ సుఖాబ్ధిలో మునిగి సదాశివుఁడు తన కట జరిగిన యవమాన మంతయు మఱచెను. ఆతనిమనసు ప్రఫుల్లమయ్యెను. ఇంతలో పరిచారిక సదాశివునితో "లోనికి రమ్మనుచున్నా" రని తెలిపెను. సదాశివరావు నటనుండి లేచెను. పుత్రులిరువురు నాతని కొంగు బట్టికొని కుప్పిగంతులు వైచుచు లోని కరిగిరి.

సదాశివరావు లోని కరిగి పీటపైఁ గూర్చుండుట తడవుగ గంగ యిట్లు ప్రారంభించెను. "ఏమినాయనా, పిలిచినను వచ్చువాఁడవు కావే! రెండురోజులైనను మనసు పట్టలేకపోతివి కాఁబోలు! వెనుకనే తఱుముకొని వచ్చితివి. అగునులే! ఇప్పు డాలాగే యుండును. రేపు నీకుఁగూడ నాఁడుబిడ్డ పుట్టి దాని నత్తింటికి పంపినచో నప్పుడు తెలిసి వచ్చును. సరే. ఇంతతొందరగ వచ్చితివి; ఇప్పు డంత యవసరమైనకార్య మేమి తలపెట్టితివి?"

"దానిని దీసికొని పోవుటకు వచ్చితిని."

గంగ యొరచూపుతో పార్వతిని జూచి "మాటలాడవేమే ? నీ వీపుపై దెబ్బలు మూసినవా ?" అనెను.

పార్వతి తలవంచి, ముక్కుపుటము లదర, గద్గదస్వరముతో "ఏమి మాటలాడమనెదవు ? తీసికొనిపోవుటకు వచ్చిరా ! అప్పుడు పిలుచుటకు నోరాడలేదు కాబోలు !" అని పలికెను.

పార్వతినోటినుండి వెలువడిన యీనిందయు ముష్టివాక్యము లాలించిన తోడనే సదాశివుఁ డధఃపాతాళమునఁ బడియెను. కొంతవడి యూరక డక్కెల్లె స్తబ్ధుఁడై యుండెను. తుదకాతఁడు "నీయట్టి సిగ్గుమాలినదాని నేమ తెచ్చుటకు గాన్పింపదు." అని పలికెను.

పార్వతి కింతమాత్రము చాలును. ఆమె మునుపటికంటె భేద స్వరమున నిట్లనెను, "ప్రతిష్ఠ మీయందును, మీయక్కయందును, మీవాంఛయందును మూర్తీభవించినది. జగమునఁ గలమర్యాద యంతయు మీయింటనే నిండి యున్నది నే సిగ్గుమాలినదానను, నాయక్క సిగ్గుమాలినది, నా వారందఱు సిగ్గుమాలినవారే ! మఱి యింతమర్యాద గలవారు మీ రీసిగ్గుమాలినదానిని మరల మీ యింటికిఁ దీసికొనిపోవుటకే మొగము పెట్టుకొని వచ్చితిరి ?"

భర్తపై నిట్లు కసిదీఱ వాగ్బాణములను ప్రయోగించి చేవురించిన తనమొగము గంగవైపునకుఁ ద్రిప్పి యామె గంభీరస్వరముతో నిట్లనియెను. "అక్కా ! నీమఱఁది నీకడకు వచ్చినాఁడు. నీ వేమి చేయుదువో నీయిష్టము. ఇదిగో నేను ఖండితముగాఁ జెప్పుచుంటిని. నాదగ్గఱకుమాత్ర మెవరును రావలసినయవసరము లేదు సుమా !"

పిమ్మట గంగ విచిత్రముగఁ జేతులు ద్రిప్పుచు, నుచ్చైస్స్వరమున నిట్లనెను. "అమ్మా ! ఇది యంతయు నా కేమో మిగుల చిత్రముగ నున్నదే ! భార్య కోపముచే వచ్చినది. దాని నేవియో రెండు తియ్యని మాటలు చెప్పి సమాధానపఱచుకొని బుజ్జగించినచో నదియే

పాదములవద్దఁ బడియుండును. అంతేకాని గడపలో కాలు పెట్టెనో లేదో అప్పుడే పోరాటము ప్రారంభమా! త్రోవలో నేమైన బ్రాంది గింది త్రాగిరా లేదుకదా !"

సదాశివుఁడు దీర్ఘనిశ్వాసము విడిచి "మంచిది, బ్రాంది త్రాగి వచ్చితినా! సరే యిప్పుడే వచ్చెదను." అని యటనుండి లేచి పోవు చుండెను. ఇది గాంచి పార్వతి తన మనస్సులో నిట్లనెను. "చూచి నావు గదా! నీ వేమో యనుచుందునే! నీపైఁ బ్రేమ మున్నది—ప్రేమ మున్నది. ఆ ప్రేమోత్కర్ష మిపుడైనఁ గానవచ్చినదా ?"

మఱఁదికి నిక్కముగఁ గోపము వచ్చె ననియు, నాతఁ డిప్పుడు నిజముగ వెడలి పోవుచుండె ననియు, గంగ గ్రహించి, యామె వాని కెదురై చేయి పట్టుకొని యిట్లనెను. "ఏమిది! దీపములు పెట్టి వచ్చిరి. ఈవేళ నిప్పు డెటకుఁ బోయెదవు? రాక రాక వచ్చినందుకీ రాత్రి యుండి, అంతగా వెళ్ళవలసి యుండినచో నీ యిష్టము, ప్రొద్దున వెళ్ళవచ్చును."

గంగ వచించిన యాకడపటిమాట మాత్రము పార్వతికి రుచించ దయ్యెను. మరల నట భర్త క్రిందఁ గూర్చుండుట గాంచి వానిముం దేమియు మాటాడ లేదు. గంగను లోలోన మిగులఁ దిట్టి, తనలో "సరే, ఈరాత్రి కిట నుండనిమ్ము. మఱి రేపుదయమున నెట్లేగు దువో చూచెదగాక !" యనుకొనెను.

సదాశివుని యొక్కయు నాతని భార్యయొక్కయు నాతని వదినె యొక్కయు సంభాషణ మంతమొందెను. ఇంతలో పదునాల్గువత్సరముల వయసు గల బాలిక తనమనోహరమందస్మితముచేతను, లోకోత్తర లావణ్యప్రభచేతను నలుగడలు నానందోత్సాహ మొనర్చుచు, మంద గమనమున సదాశివుని వెనుకకువచ్చి నిలిచి యిట్లనియెను. "అన్నా! మాయింట నందఱు సుఖముగ నున్నారా ?"

ఆ బాలిక నోటనుండి యీ వినయమంజులశబ్దములు వెలువడు చుండగనే గంగయొక్క భయానకగర్జన యిట్లు వినవచ్చెను. "ఎనతె యెంత సిగ్గుమాలినది! దీనికి నే నాడు బిడ్డ నను లక్ష్యము లేదే! తమ కూతురు చావలేదింకను బ్రతికియే యున్నదని సంతోషించుచు తల్లి దండ్రులు లేరు జన్మాల నైన దీని యోగక్షేమమే కనుగొనరు. ఈమెగారు మాత్రము, సుఖముగ నున్నారా, యని వచ్చి యెంతో ధీమాతో నడుగుచున్నది. ఏమైపోయెద రాతల్లిదండ్రులు? భూమిమీద లేకుండ బోయెదరా? నే నెప్పుడు వారింద నేనైన తలపెట్టను. దీనియధికారము చూడగ నత్తింటికోడలువలె లేదే!"

శరవిద్ధ యగుహరిణశాబకమువలె నా కన్యక భయవిహ్వలచిత్త యై యిటునటు జూడ దొడంగెను. పిమ్మట నామె మెల్లమెల్లగ నటనుండి జరిగి యొకమూలకుం జని నిశ్శబ్దముగ నేలం గూర్చుండెను. తన యాడబిడ్డరూపము వహించిన ధాకిని గంగ యాసనమునందున నచట నున్నదని పాప మామె యెఱుంగదు. ప్రజ్వలితాగ్నిపై జలసేచన మొనర్చినచో నదెట్లు నిస్తేజమగునో యట్లే యబ్బాలిక తేజోవిహీన యయ్యెను. నయనానందకర మగు నామె యపూర్వ లావణ్యప్రభ యస్తంగత మయ్యెను. ఆమె పృథులాధరములపై మధురమందహాసవికాసము లోపించెను. గ్రీష్మాతపమున వాడిన సుకుమార కుసుమమువలె నామె సౌందర్యము క్రమ క్రమముగ మలిన మగుచుండెను. సదాశివరావు నిర్విణ్ణుం డై పోయెను. ఇంత వఱ కాతని నోటమాటైన వెలువడదయ్యె. ఆకస్మికముగ విద్యు త్పాత మైనచో మనుజుం డెట్లు విస్మితుం డగునో యట్లే సదాశివుం డెంతయు విస్మితుం డయ్యెను. కొంతతడవున కాతఁడు "మనోరమా! మీయింట నెల్లరు సుఖులై యున్నవారు." అని చెప్పెను.

పాప మామనోరమ యీ మాట వినెనో లేదో యేమియుం బ్రత్యు

వినరాకుండ దీర్ఘనిశ్వాసము విడిచెను. పొరలివచ్చు దుఃఖాశ్రువు లాధాకినిదృష్టి బడునేమో యను భయమున మెల్లగ తుడిచికొనియెను.

సదాశివుని భోజనాదికము లైనపిమ్మట గంగకును వానికిని నిక్కే కొంతతడ వేదో సంభాషణ జరిగెను. నిద్రించుసమయ మగుటచే గంగయటనుండి లేచిపోవుచు తనచెల్లెలితో నిట్లనియెను. "నిష్కారణముగ నిట్లు రేయుంబవళ్లు పనులతో పోట్లాడెదవు? పద—నీవు నాయొద్దనే పండుకొందువుగాని, నాయనయు, సదాశివరావు నిచటనే పండుకొననిమ్ము."

పార్వతి మూతి ముక్కు విఱుచుకొనుచు వికృతస్వరమున "సరే సరే, నిన్నెవరు తీర్పు చెప్పమనలేదు." అని గంగను తలుపవతల కొక్కవిసరున త్రోసివైచి ద్వారము బంధించెను. గడియను జాగ్రత్తగ వైచి తిరిగివచ్చి చూచునప్పటికి భర్త చెక్కిటఁజెయి జేర్చి యేమియో యాలోచించుచుఁ గూర్చుండి యుండెను. చుబుకముక్రింది హస్తమును ప్రక్కకుదీసి పార్వతి ప్రియవాక్కుల నిట్లనియెను. "దేనిని గూర్చి యిట్లు యోచించుచుంటిరి? మీప్రియురాలికి కొంచెము చెప్ప కూడదా?"

"ఓహో! చెప్పకూడ కేమి? నీసోదరివంటి సోదరి నాకుఁగూడ నొక్కతె యున్నచో నే నెంత యదృష్టవంతుఁడ నై యుందును."

"ఏమి యదృష్టము గలుగును?"

"మఱి నీ యీ గడుసుతన మంతయు మటుమాయమై యుండును, గదా."

పార్వతికి దీనియర్థము సరిగాఁ దెలిసినదో లేదో యెవ్వ రెఱుఁగుదురు? అప్పు డాప్రసంగము మార్చి యెన్నియో యుక్తులచేతను వినయ భాషణములచేతను, వాని మనస్సును వశపఱచికొనఁ బ్రయ

త్నము నొనర్చు చుండెను. శీఘ్రముగనే దంపతు లిరువురకుఁ ప్రణయకలహము ప్రారంభ మయ్యెను.

౧౦

గంగ యింటనుండి వెడలి స్వయంపాకగృహమునకు వచ్చినది. ఇంక మాధవరావు భోజనము కావలసి యున్నది. గంగ భోజనపాత్రము దలుగున వన్నియు నాయత్తపఱచు చుండెను. మాధవరా వటునిటు జూచుచు వచ్చి పీటపైఁ గూర్చుండెను. భోజన మొనర్చుచు నాతఁడు గంగతో నిట్లనియె. "అక్కా! వడ్డించుటకుఁ గూడ నీవే రావలయునా? తక్కినవా రందరెట కేగిరి? ఇం కెవరు లేరా యేమి వడ్డించుటకు?"

తన భార్యయే తన కన్నము వడ్డించవలయు ననియు నెవ్వియో ముచ్చటలు చెప్పుచు దగ్గఱఁ గూర్చుండి భుజింపవలయు ననియు మాధవరా వెంతయో ముచ్చటపడు చుండును. కాని యేమి ప్రయోజనము?

గంగ వడివడి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "ఇం కెవ్వరు వచ్చెదరు నాయనా వడ్డించుటకు! వచ్చినను రాకపోయినను నింక నీభార్య యొక్కతెయే కదా! అది యడవిమృగము! నేను నడివార్చిపెట్టినచో భోజనపువేళకు హాజరవును."

మాధవరా వొక్క నిట్టూర్పు విడిచి ఖిన్నమనస్కుఁడై భోజన మొనర్చు చుండెను. భుజియించుచు తనమనసున నిట్లని తలపోయ దొడఁగెను. "నేను దీని శరీరసౌందర్యమునకు భ్రమసి యెంత మోసపోతిని! నిష్కారణముగ నాగొంతున నురి నేనే తెచ్చికొంటినే!"

భోజనానంతరము మాధవరావు శయనగృహమున కరిగెను. శయ్యపైఁ బరుండి మనోరమ యిదిగో వచ్చు నదిగో వచ్చు నను నాశచే భార్యాగమనమును నిరీక్షించుచు నొకప్రక్కనుండి మఱియొక

ప్రక్కకు మంచముపైఁ బొరలుచు పెద్దతడవు వేచి యుండెను.
మనోరమ రాత్రి కెంతవిలంబ మగుచుండెనో మాధవరావుమన సంత
విరక్తి నొందు చుండెను. కొంత కింటిలోనివారందఱు నిద్రించి
యెల్లెడల నిశ్శబ్దముగా నున్న తరువాత మనోరమ దొంగవలె దాగికొ
నుచు, మెల్ల మెల్లగ పడకటింటి కరుదెంచి, యెందేని యేచేని యలు
కుడు వినవచ్చునేమో యని చెవియొగ్గి యాలకించుచు, దీర్ఘాలోచన
మొనర్చుచు, నేమాత్రము సవ్వడియు గాకుండఁ దలుపువైచెను.
అనంతరము వెలుగుచున్న దీపమునకు సెల వొసంగి, యాపాదమస్త
కము దుప్పటి ముసుగిడి, యలుకు డింతయుఁ గాకుండ ప్రాణనాథుని
పార్శ్వమున మెల్లగఁ జేరి పరుండెను.

మాధవరా వింతదనుక మేలుకొనియే యుండెను. భార్య విపరీత
చర్యయంతయుఁ గాంచి యాతఁ డాశ్చర్యనిమగ్నుఁ డయ్యెను. ఆధుని
కసుశిక్షితస్త్రీలవలె తనయర్థాంగియు ప్రతివిషయమునందును దనకు
కుడిభుజమై యుండవలె ననియు, సంసారయాత్రయం దామెయే
తనకు నిజమైన సహకారిణి కావలెననియు, ఒండొరులు గాఢానురా
గమున మెలంగవలె ననియు మాధవరావభీష్టము కాని దౌర్భాగ్య
వశమున నాతని వాంఛ సఫలము కాదయ్యెను. మనోరమ చర్యవలన
నామెకు తనపై నిర్మలప్రేమ లేదని యాతనికి స్థిరముగాఁ దోఁచెను.
అట్టియెడ నట్టిభార్యవలన తన కెప్పటికిని సౌఖ్యమలబడుట
యసంభవ మని తలంచెను. ముగ్ధ యగునబ్బాలిక కోమలహృదయాం
తర్గత మగుప్రేమానుభవమును బొంద గలపాత్రత యేమాత్రము
నాతనిశరీరమునకు లేదయ్యెను. అంత గొంతవడి కాత డిట్లనియెను.
"మనోరమా! నీవు నాపట్ల నిట్లుండు టెందులకు? నేను నిన్నెంతో
ప్రేమించుచు సర్వదా నీసుఖమునకై ప్రయత్నించుచు నీవేనా—"
మనోరమ మృదుమందస్వరముతో "కొంచెము మెల్లగ మాట్లా

యందు డాబా పై నటునిటు నొక్కుటేసికొనుచు తిరుగుచుండెను. చింతాభరంబున నాతనిమనస్సంతయు వికలమై యుండెను. ఆతఁడు మిగుల నస్థిరుఁడై పోయెను. ఇంక నట నిలువ జాలఁ డయ్యెను. అంత మరల శయనగృహము సొచ్చి, ద్వారము బంధించి, దీపము వెలిగించెను. ఆదీపపుకాంతి నాతని కేమి గోచర మయ్యెనో గాని యాతఁ డట్లనే స్తంభితుఁడై పోయెను. మనోరమ మంచము పై బరుండి హాయిగ నిదురించుచున్నదే! ఇంతకుమున్ను మనోరమచే నొనర్పబడిన యవ్యక్తాచరణములన నాతఁడు వ్యథితుఁడై క్రోధపరవశంబున నటనుండి వెడలి పోయి యుండెను. తా నెంతయో యలజడి బొందెను కాని యామె కించుకంతయుఁ బరితాపము లేదయ్యెనే! ఇప్పు డీట్లీమె హాయిగ నిదురించుచున్నదే! ఇంతవరకు నాతనిమనసున నేవిషయిక మైనవిచారము గలిగెనో యావిషయ మిప్పు డాతని సుస్థిరుగ నొనర్చెను. ఆవిచార మే యాతనిహృదయమును కలంచివైచి, యాతనిమనసుయొక్క యస్థిరత్వమునుగూడ వేయిరెట్లధిక మొనర్చెను. తుదకు క్రోధావేశపరవశుండై యాతండు గాఢనిద్ర యందు మునింగి యున్న యానిర్దోష బాలిక కేశబంధమును బట్టి గుబాలున పైకి లేవనెత్తెను. పాప మబ్బాలిక యాసమయమున స్వప్నావస్థయుం దుండెను. తాను భర్తసన్నిధిని మాట్లాడినందున రాక్షసి యగు గంగ తనసిగబట్టి కొట్టుచున్నట్లును ఆచండాలురాలియెడ గల భీతిచే పాపమామె కేకవేయుటకుసైతము ధైర్యము లేకపోయినట్లును మనోరమ కల గాంచుచుండెను. ఇంతలో మెలఁకువ వచ్చెను. ఆమె కనులు దెఱచి చూచునప్పటికి తనసమక్షమున నాడుబిడ్డస్థానమున భర్త! కాంచినమాత్రమున బాలికను స్వప్నభయ మంతయు మాయమయ్యెను. బాలిక యధోవదన యయ్యెను.

మాధవరావు క్రుద్ధుఁడై యిట్లనియెను. " నీవు నాయెడ నిట్లు

పరివర్తించుటకు గలకారణ మేమో నా కిప్పుడు చెప్పి తీరవలయు. నీప్రేమకు నే నపాత్రుండ నైన దెంపలకో స్పష్టముగ వచింపుము."

పాప మల్పవయస్క యగుటచే నామనోరమ కాప్రశ్నయందలి యర్థమే స్ఫురించినది కాదు. అట్లగుట నాపె యేమని ప్రత్యుత్తర మీయ గలదు. లజ్జచే నధోవదన యై యూరకనే నిలిచి యుండెను. ఇచట మాధవరావు ప్రత్యుత్తరముకొఱకు నిరీక్షించుచు నుండెను. తున కెంత ప్రయత్నించినను తనకు ప్రత్యుత్తరము బొందజాలక దయ్యె. అప్పటియాత నియాగ్రహావేశమున కంతము గానరాకుండెను. క్రోధతీవ్రతచే మనో రమ నడుముపై నొక్క తన్ను తన్నె. యాతండును నట వెలువడి వచ్చెను. ఇదివఱకువలె నప్పు డాతఁడు డాబాపై కెక్కక, క్రిందికి వచ్చి ద్వారము దెఱచికొని, వడివడి నింటివెలుపలకు వచ్చి వారయువతీ మందిరములతో నలరారువీథి బ్రవేశించెను.

ముందు వెనుక లరయక యావేశభరమున నాతఁ డటకు వచ్చి చేరి నది నిశ్చయమే కాని యిప్పు డాతనిమతి కొంచెము తిరిగినది. వెను కటియావేశ మిప్పుడు లేదు. కొంతతడ వొక్కచో నిలుచబడి విచారింపఁ దొడఁగెను. మరల మెల్ల మెల్లగ ముందునకు నడువ దొడఁ గెను. మరల స్థిరచిత్తమున నొక్కెడ నిలిచెను. ఇట్టివిధంబున ముందు వెనుక లాలోచించుచు తుట్టతుద కాతఁ డొక సుందరమందిరంబు కడకు వచ్చి చేరి మరల నిటునటు దిరుగ మొదలిడెను. కడ కాతఁడు తనలో నేమియో స్థిరపఱచికొని యామందిరద్వారమును గట్టిగ తట్టెను. కాని లోపలినుండి ప్రత్యుత్తర మేమియు రాదయ్యెను. ఇచ్చట తలుపుతట్టనశబ్దము ప్రకృతిదేవిశాంతమును భంగ మొనర్చి యాతనిహృదయమునుగూడ కంపింపఁ జేసెను. ఆసమయమున మాధవరావు మనసునకుఁగూడ తనహృత్పేటికాకవాటము నెవరో తట్టి నట్లుగఁ దోఁచెను. పూర్వసంకల్ప ముజ్జగించి మాధవరా వింటి కరుగ

"లక్ష్యమునకుం దెచ్చికొనుము, నేను నీభర్తను!"

"మీరుకూడ లక్ష్యమునకుం దెచ్చికొనుఁడు. నేను మీభార్యను."

"అందువల్లనే నేను నిన్ను బలవంతముగనైన దీసికొని పోవగలను."

"నన్ను బలవంతముగ దీసికొని పోయినచో ప్రాణత్యాగము చేసెదను."

సదాశివునికీమాట రుచించదయ్యె. అతఁడు తనభార్యస్వభావము బాగుగ నెఱుఁగును. అట్లగుట నామెప్రత్యుత్తర మాలకించి మఱి మాఱుమాటాడక నుద్విగ్నుఁడై పెద్దతడవు స్తబ్ధుఁడై యుండి, కొంతవడికి మెల్లగా "అయితే మఱినీవు నాతో నింటికి రావా?" యనెను.

సదాశివునిస్వర మెప్పుడు మందమయ్యెనో యప్పుడు పార్వతి స్వరము గంభీర మయ్యెను. ఆమె రానని వక్కాణించెను.

అంతట సదాశివరావు దీర్ఘనిశ్వాసము విడిచి యిట్లనెను. 'సరే మంచిది నీవిట నిశ్చింతముగ నుండుము. నేఁ బోయెదను'

'అట్లిప్పటికిని సరిపడదు. మీరుకూడ నిచ్చటనే యుండవలెను.'

"అ దెందులకు ?"

"నాయిష్టము—నాహుకుం."

"నీయిష్టము నీదగ్గఱ, నీయాజ్ఞ పరిపాలించుటకు నే నేమియు కట్టుబడి యుండలేదు."

"అయితే మీరొక్కరే యింటికి వెళ్ళెదరా! సరే, సంతోషముగా పొండు. ఇక్కడనుండి మీరుకాలావల బెట్టినక్షణమున నేనురి బెట్టుకొని చచ్చెదను. ఇదిమాత్రము త్రికరణశుద్ధిగా చెప్పుచుంటిని.

పాపము సదాశివుఁడు స్తబ్ధుఁ డయ్యెను. అప్పటి నుండి యాతఁడామె యెదుట నావిషయ మెత్త డయ్యెను.

౧౩

సదాశివరావింటికి వచ్చుట కెంతవిలంబ మగుచుండెనో యిట రాధ యంత యుద్విగ్న యగుచుండెను. ఈదినము వచ్చును, రేపు వచ్చును, మాపు వచ్చు ననుకొనుచుండగనే పక్షముదినములు గడచి పోయెను. అప్పటికి కూడ నామెకు పుత్రునిసమాచార మేమియు దెలియరాదయ్యెను. పాప మాయువతి చింతాసముద్రమున బడియెను. ఆమెకేమియు దోచుటలేదు. మనసున నానావిధములగు నమంగళశంకలు గలుగుచుండెను. చివర కామె యన్నపానములను గూడ వర్జించెను. కొమరుడు రాడాయె ననుమహావేదనచే రాత్రులయందు జాగర మొనర్చుచుండెను. సంతతధారగ గారు నామెకన్నీటి కంతమే లేదు. సదాశివునియత్తవారింటి కేగి వాని గతి యేమైనదో కనుగొని రమ్మని రాధ యైదారుదినములు నుండి వినాయకరావు నెన్నియో తెన్నుల చెవి నిల్లు కట్టుకొని పోరుచుండెను కాని యింతవఱకు లాభ మేమియు లేదయ్యెను. నానాటికి వృద్ధి యగుచున్న తల్లి శోచనీయస్థితి గాంచి యింక మిన్నకున్నఁ గార్యము మించు నని తలంచి వినాయకరావు సదాశివునియత్తవారింటి కరిగెద నని తల్లితో ప్రతిజ్ఞ జేసెను. నిజముగ మఱునాటి తెల్లవారు జాముననే యాతఁడు సదాశివునత్తవారింటికిఁ బోవఁ బట్టెను.

వినాయకరా వింటనుండి హోటులో సాహసించి బయలువెడలెను. కాని యాతఁ డిప్పుడొక గొప్పవిచారమున బడియెను.

“ఏమిసేతును! నే నిప్పుడు గొప్పవారింటికి బోవలసి వచ్చెనే! అచ్చట పెద్దమనుష్యు లనేకు లుందురు. వారితో మాటలాడు టెట్లో, ఎట్లు నడచికొనవలెనో, తెలియని నా పుట్టిబీదవానిని జూచి వారందఱు దిరస్కరింతురు. ఇప్పుడు [illegible] [illegible]!

నన్ను పలుకరించువారైన నట నెవ్వరు లేరు. ఏమిచేతును? వారందఱు బాగుగ జూచుకొన్నారు, ఉద్యోగులు ఇట్టివారింటి కేగ నే బయనముగా నున్న బాగుగ నుండెడి కే!" యని యనేకవిధముల వితర్కించుకొనుచు దీనవదనుడై యుండ నాస్తికముగ నన్నియు వదినెయు నట నున్న సంగతి స్మరణకు వచ్చెను. తత్ప్రస్మరణమాత్రము వానిప్రాణము కుదుట బడినది. ఆతడు డెందములో ధైర్యము దెచ్చుకొని మెల్లగ సదాశివునిశ్వశురగృహము జేరెను. వానియదృష్టమువలన వాకిటనే సదాశివుని దర్శన మయ్యెను. తనవివాహమునకు తల్లిపొందు చున్నయలమట వినాయకునివలన విని సదాశివు డెంతయు జింతించెను. ఆతని లోలోన నన్నెంతయో నిందించుకొనియెను. ఇచట సదాశివుడు సతీసుతసహితుడై సుఖముగ నున్నందులకు వినాయకు డా వెంతయు సంతసించెను. ఆతడు తనశ్రమ సార్థక మైనదని తలంచెను. అంత సదాశివుడు తమ్ముని దోడ్కొని గృహము జొచ్చి వినాయకుని చావడియందు గూర్చుండుమని చెప్పి, వాని కన్నపానాదు లమర్చుటకై లోనికి జనియెను.

అలంకృత మగునా చావడియందు గూర్చుండుటకు వినాయకునకు ధైర్యము చాల దయ్యెను. అందు బఱచియున్న సుత్తివాసెలపై యడుగిడుట కాతనికి భయ మయ్యెను. వెఱ్ఱివానివలె నతడు నలువంకల జూడదొడగెను. ఇంతలో నతనికి పడమటివైపు నున్న యొకచిన్నగది వానిదృష్టి బడియెను. అంత నాతడావైపు కరిగి లోపలికి తొంగిచూడ కొలువుర నొకబల్ల యొకట వైచి యుండెను. ఒకయూలపొగాకు, చిలుము, గుడిగుడి మొదలగుధూమ్రపానోపయోగములు లచట బడియుండెను. వానిసమీపమ్మముననే నిప్పులకుంపటిగూడ బెట్టియుండెను. ఇవియన్నియు వానిదృష్టి

యాత్రికుడు సుశోభితమగు నాసనమునకు వెన్నుజూపి, రయమున నాగది ప్రవేశించి యాత్రాపాత్రపల్లపై నాసీనుండయ్యెను. ఊడిపోయిన యొటక రాతిసందున నున్న చిలుము దీసికొని దానిలో గంజాయి నిండించు ప్రయత్న మొనర్చుచుండెను. ఇంతలో నాగదిలో నుండువాడగు రామచంద్రపంతులనౌకరు రాముడు తొందరతొందరగ నట కరుదెంచెను. అచ్చట తనయాసనముపై నధిష్ఠితుండై యున్న యయ్యాపరిచితమూర్తింజూచి మిగుల విస్మితుండై, కొంచెము తిరస్కారముగ నిట్లని ప్రశ్నించెను:——

"ఓ రామాకుంది?"

"ఏనాయకరా వులికిపడి న-ఁ-నే-ను-ఁ నాయక"

"ఈడే చేస్తుండావు"

"చి-లు-ము-"

"అది నా కెరికే ను వ్వోరితో వచ్చావు?"

"నే నెవ్వరితో నూరాలేదు."

"మరీడ కెందుకొచ్చావు?"

"అమ్మ పంపిసంగున"

"అరే! వెర్రిమొగమా! నీ కేం మతిలేదా యేమిటి? మీయమ్మ పంపించినకే, ఓరిదగ్గరకో చెప్పక్కర్లేదా?"

"అన్న దగ్గరకు"

"అన్నదగ్గరకా! అరే అన్న కూరు పేరూ లేదూ యేంటి?"

"ఉంది ఉంది, మా అన్న పేరు సదాశివరావు."

"యేంటి! తమరు చదాశివబాబుగారి తమ్ముల్లా? ఆ?"

"అవును."

"అయితే బాబూ ఇంతపనికి తమ రామాట చెలవిచ్చారు కాదేం? యీలా య్యెయ్యండి సలు, నే తయారుచేస్తా."

గటానికి పార్వతమ్మగారు పిలుస్తూండారు.”

కాని వినాయకుని కిచ్చోటు విడిచి పోవుటమాత్ర మంత ప్రశస్తముగ దోచ లేదు. అందువలన కాఫీ యచ్చటికే తీసికొని రమ్మని యానవీనపరిచారకుని లోనికిబంపి, అన్నకొమరుని దగ్గఱజేరదీసి కౌఁగిలించి, ముద్దుగొని, కుశలవార్తల నరసి మహానందభరితుం డయ్యెను. అనంతరము రెండుగంటలకు భోజన మయ్యెను. భోజన మైనదితడవుగ వినాయకరావు మరల నాగదిఁ బ్రవేశించి యొకపాశిబల్లపై నాసీనుం డయ్యెను.

సాయంకాలము సదాశివుఁడు వినాయకుని చెంతకుఁ బిలిచి యిట్లనెను. “ఒరేవినూ! నీ విచట నిట్లూరకఁ గూర్చున్న నెట్లురా? నీవు వచ్చినపని కేమియుఁ బ్రయత్నము చేయునక్కఱ లేదా?”

సోదరుఁ డిట్లు లాలించినంత వినాయకరా వాలోచనాసముద్ర మున బడెను. అన్నను వదినెను దీసికొని పోవుటకై తా నిటకు వచ్చినసంగతి నాతఁడు మఱచి యుండ లేదు. కాని, అందులకై తానేమి చేయ వలయునో యాతనికి దోఁచ దయ్యెను. సదాశివరావు తనతమ్మునిసామర్థ్యముఁ జక్కఁగ నెఱిఁగి యుండెను. వినాయకుని వలన నేమియు సానుకూలము కాదని తలంచి, తానే యేదియో మార్గ మూహించుట మంచిదని నిశ్చయించెను. వినాయకుఁడు మిన్నకుండుట చూచి యాతఁ డిట్లనెను. “వినూ! నీ విప్పు డిట్లు చేయుము. మామామగారికడ కరిగి, మాయమ్మతో మావదినెను తీసికొని వచ్చుటకై మాయమ్మ నన్ను పంపినది. జగన్నాథుని రాముని వివాహమై యామాస మిక్కడనే గడపించు చున్నాఁడు, గనుక రేపటి దినము వీరిని బంపుటకుఁ దగినయేర్పాటు చేయుఁ”డని చెప్పుము.

వినాయకుఁ డేమియుఁ బలుకక కొంతవడి స్తబ్ధుఁడై యుండి, అనంతరము తల గోకికొనుచు “అన్నా! మామామగారియెదుట నే

గుట, యాయనతో మాట్లాడుటమాత్రము నావల్ల కాదు బాబూ"
అని నుడివెను.

తుదకు గత్యంతర మేమియుఁ గానక, తానే యావిషయమును మామగారి కెఱిఁగింప నిశ్చయించి, సదాశివుఁడు వినాయకుని వెంటఁ గొని రామచంద్రునిగది కరుదెంచెను. రామచంద్రపంతులు గారు తెల్లవారు లేచి యాగదియందు గూర్చుండెదరు. ఈసమయమున నాతఁడు శివసంహితా పారాయణానిమగ్నుఁడై యుండెను. అల్లుఁడు లోనికి వచ్చుటఁ గాంచి రామచంద్రపంతులు వానిని గూర్చుండ మనియెను. సదాశివుఁ డొకవైపున గూర్చుండెను. వినాయకరావు లోనకరిగి, వినయభక్తుల రామచంద్రునకు సాష్టాంగదండప్రణామ మాచరించి, కదలక మెదలక యొకవైపున నిలువఁబడెను. వాని గాంచి ఈతఁ డెవ్వఁ డని రామచంద్రుఁడు జామాత నడిగెను.

సదాశివుఁ డిట్లనెను. "ఇతఁడు నాతమ్ముఁడు. జగన్నాథము, రాముఁడు దగ్గఱ లేనందున మాతల్లి యెంతో పరితపించుచు వానిని దీసికొని వచ్చుటకై వీని నిటకుఁ బంపినది. మీయాజ్ఞ యయ్యెనేని రేపే ప్రయాణ మయ్యెదము."

'హుఁ' అని ధ్వని చేసి రామచంద్రుఁడు కొంతవడి యూరకుండి గంభీ స్వరమున నిట్లనెను. "ఈవిషయము నాతోఁ జెప్పఁ బ్రయోజన మేమి? మాధవరావును గనుగొనుము. నే నెప్పుడో సంసారభారము వానిపై నుంచి యుంటిని. సర్వసంగపరిత్యాగికి నాకీగొడవ యంతయు నెందులకు?"

సదాశివుఁ డింక మఱుమాటాడక వినాయకుని వెంటఁగొని మాధవరావుకొఱకై దివాన్‌ఖానాకుఁ జనియెను.

౧౩

సదాశివుఁడు దివాన్ ఖానా కరుదెంచెను. మాధవరావేదో పనిఁ జూచుకొనుచుండెను. సదాశివునివెంట వచ్చినవినాయకుని చూచి విస్మితుండై "ఏమి వినాయకరావా! వచ్చి యెంతసేపైనది?" అని ప్రశ్న చేసెను.

వినాయకుఁడు వినయము గదుర నిట్లనెను. "ఈదినము రెండు జాములకు."

"మంచిది! అయితే వినాయమ్మనుకూడ దీసికొని రాలే దేమి."

"రాలేదు. ఆమె యింటివద్దనే యున్నది."

"ఆమెకుమాత్ర మొంటరిగ నింటనుండు శ్రమ యేల కలుగఁజేసితిరి? వెంట తీసికొని వచ్చిన బాగుగ నుండెడిదే!"

మాధవరావు తనవిషయమున, జూపిన యింతటియాత్మీయభావమునకు వినాయకుఁడు లోలోన మిగుల సంతుష్టుఁ డయ్యెను. కాని సదాశివునిస్థితిమాత్ర మందులకు వ్యతిరిక్తముగ నుండెను. మాధవరావు ప్రతివాక్యమును వానికి వజ్రాఘాతమువలె హృదయమునఁ దగిలెను. ఇప్పట్టునమాత్ర మాతఁ డూరకుండఁజాలక యించుక కోపమున "మావినాయకుఁడు మీయింట నుండుటకు వచ్చినవాఁడు కాఁడు. మీచెల్లెలిని దీసికొని పోవుటకై వచ్చినాఁడు." అని నుడివెను.

తనమాటలవలన సదాశివునకుఁ గోపము వచ్చె నని మాధవరావు గ్రహించి నవ్వుచు "నే నేమియు నట్టియభిప్రాయముతో ననలే" దని పలికెను.

సదాశివు డిట్లనెను. "సరే పోనిమ్ము. నాకట్లు తోఁచినది. సరి యే కాని మీచెల్లెలి నంపువిషయమున నేమనెదవు?"

మాధవరావు గంభీరముగ నిట్లనెను. "నీభార్యను నీవు తీసికొని పోవుచుండ మే మడ్డుచెప్పెదమా? కాని యొకవిషయముమాత్ర

సదాశివునిపలుకులు వినాయకున కేమియు సంతోషదాయకములు కావయ్యెను. అతఁ డిట్లనెను "అన్నా! నీకుద్యోగము దొరకినదిగాన నీవిట సంతోషముగ నుండవచ్చును. కాని వదినె కిట నేమియు నుద్యోగము లేదు గదా! మఱియామె యింటికి వచ్చుట కేమి యభ్యంతరము?"

"ఇదిగో చూడు వినూ! సంసారము గడపుట మనకు మిక్కిలి కష్టముగ నున్నది. ఖర్చు జూడఁబోవ మిగులనధికముగ నున్నది. వినా వదినెకూడ నిచ్చట నుండినచో గొంతఖర్చు తగ్గును. ముఖ్యముగ నే నిందుకొఱకు చెప్పుచుంటిని. ఆమె యిచ్చట నుండుటయే మంచిది."

సోదరుని నుడువు లాలించి వినాయకుఁడు పరితృప్తుఁడై కొంతవడి కిట్లనెను. "అవునవును. ఇదియే బాగుగా నున్నది. తెల్లవారుజామున నేనింటి కేగి, అమ్మకీసమాచార మెల్ల నెఱిఁగించి సమాధానపరచెదను."

మఱునాఁ డరుణోదయమున లేచి వినాయకరావు తనయూరికిఁ బయనమై నడచెను. అచ్చట సదాశివరావు మాధవరావుతోఁగంట్రాక్టుపనిలోఁ బ్రవేశించెను.

## ౧౪

సంసారమున సుఖదుఃఖకాలముల నరయు టెంతయు దుర్లభము. సుఖోత్పత్తి దేనివలన నగునో, దుఃఖోత్పత్తి దేనివలన నగునో యూహించుట సాధారణమానవబుద్ధి కొక్కొకసమయమునం దసాధ్యము. మన మేవిషయము సుఖమునకు మూల మని తలంతుమో యా విషయమే మన యపారదుఃఖసముద్రమున మునుంగుటకుఁ గారణభూత మగును. అవ్విధముననే యెయ్యది మనము దుఃఖపర్యాప్త మని

తలంచి దారిద్ర్యమువలన దుఃఖజలధి మునిఁగియుండునో యదియే యొకానొకసమయమున మనల ననంతసుఖవారిధిని దేలించును.

సోదరుఁడు తెలియఁజేసిన సంతోషవార్తఁ గొని వినాయకుఁడు తన గృహాభిముఖుఁడై వచ్చుచుండెను. ఈవార్త విని తనతల్లి పరమానంద భరిత యగు నని సంతసించుచుండెను. కారణమేమనఁగ "ఇంత వఱకు తా ననుభవించుచున్న దరిద్రదశ తొలఁగి, సుయోగము సంప్రాప్తమగు" నని సోదరుఁడు వచించి యుండెనుగదా? సోదరుని యీవాక్యములు వినాయకుని హృదయకుహరంబునఁ బ్రతిధ్వనించుచుండెను.

వినాయకుఁడు నిశ్చింతుఁడై వడివడి నిల్లు చేరెను. వాకిట నరుగుమీఁదనే వానికి జననిదర్శనమయ్యెను. కొమరునిఁ జూడఁగనే రాధ "పార్వతి యెంతదూరమున నున్నది?" అని మిగుల నాత్రముతోఁ బ్రశ్నించెను.

"ప్రస్తుతము వదిన వచ్చుటలేదు." అని యతఁడు చెప్పఁగా రాధ రయమున నిట్లనెను. "ఏమిరా నాయనా! దానిపుట్టినింట నందరు సుఖముగ నున్నారుగదా?"

"అందఱు సుఖముగ నున్నారు. అందుకు నీవేమియు సంశయింప నక్కఱలేదు. అన్నయ్య కచట నుద్యోగము కుదిరినది. మాధవరావు తనకంట్రాక్టుపనియం దాతనికి భాగ మిచ్చెను. అందువలన నన్నయ్య ప్రస్తుతము వదినను బంపలేదు."

"ఇప్పుడు నీయన్న యత్తవారింటమనుగుడుచుచుఁ గూర్చుండెనా?"

"లేదమ్మా వానికి నిజముగనే యుద్యోగము దొరికినది."

"మనసదాశివునకు నౌకరీ దొరకినదా! దేవుఁడు నీనోట పంచదారఁ బోయుఁగాక. కాని, ఓరీ పార్వతియిచట కెందుకు రాఁగూడదు?"

"అన్న యిట్లుచెప్పెను. ఇప్పటికే మనకు కర్చెక్కువగ నున్నది.

పైగా నామనుమరాలి కక్కడనుండి యంపినట్టియున పత్రికను నెక్కడ వేసెను.''

వినాయకుని నోటినుండి యీమాటలు వెలువడిన బాధ యత్యంత సంపత్తయ్యెను. కొనుమని నోటనుండి కర్చెక్కడ యను మాట రా నామె కెంతయో తప్పుగాఁ దోఁచెను. సంతాపభరమున నామె యిట్లనెను. ''చచ్చినవాఁడా! నీ తెలివి మండ! నీ కెక్కడ తెలివి తేట లెక్కడనుండివచ్చెను! నీయున్నది నౌకరీ దొరికినది గదా! కర్చెక్కడ వనేమేదు పెండుకొను? నే నేమి చాలు బంగరు బోసికొని జుట్టుచుంటినా? ఏదైన మంచివస్తువు చేసినచో నీమామొగమునే పెట్టుచుంటిని గదా! పిసుగు వంటి యిట్టి సమాచారము దీసికొని వచ్చి నన్నుసమాధాన పెట్ట దలఁచితివా! మంచిది, పోనీ. మిాసా త్తులో నింతటినుండి సజముగా నే నొక ప్రాచికపుల్లయైన ముట్టను. ఇప్పుడే నేను కాశికి లేచిపోయెదను. ఇచ్చటనుండి మెతుకులు విరుగునట్లు యీ పాడుచాకిరీ చేసి చచ్చుటెందుకులకు? పుణ్యమా పురుషార్థమా!''

ముసలి యిట్లను చుండగనే నామె దుఃఖమున కంత్యస్వరూపిణి యగుకన్నీరు కాల్వలై పారసాగెను. చీరచెఱఁగుతో కనులు దుడిచికొనుచు నామె లోని కరిగెను. వినాయకుఁడు నిర్ఘాంతుఁడై పోయెను. "ఇప్పుడు మాయమ్మ నుడివిన యీయాలోచన నా కప్పు డేల తోఁచదయ్యెను. ఈపశ్చాత్తాపభావ మాతనిని మగతను నన్నును నాతనికి మరపు రాదయ్యెను.'' ఇదిగాక, ఈయాకస్మిక సుఖదుఃఖ పరివర్తన మెట్లుకలిగెనో యాతని కిసుమంతయుఁ దెలియరాదయ్యెను. పాప మాతఁ డఘాతమునఁ బడియెను.

---

ఈజగమున సన్మానము, జ్ఞానము, బుద్ధి యనునవి లక్ష్మీదేవికి భృత్యసముదాయమై యామెనువెంటనే వర్తించుచుండును. ఎట్లనుట లక్ష్మి యవకృపయు, నామహాపక్కియగు పెద్దమ్మదర్శనమును నాపుటతోడనే నివి యన్నియు నొక్కపరి పారిపోవును. ఎచ్చోట ధనము ముండునో యచ్చటనే సన్మానము, అచ్చటనే విద్వత్తు, అచ్చటనే గౌరవము.

దీక్షితుని గృహముపై పెద్దమ్మకృపాదృష్టి యుత్తరోత్తరముగా నధికమగుచుండెను. అవ్విధముననే వారి కాగ్రామమున గలసన్మానములు కూడ క్రమక్రమముగ నష్టమగుచుండెను. ఇంటియందు వేళకు దీపము వెలిగింపబడుట లేదు. వాకిట చీపు రాడుటలేదు. గృహమున నలుకుగుడ్డ పడుట లేదు. కలాపియు జల్లబడుటలేదు. శుభకార్యములు, హోమహవనములు నాయింటికి దూరములయ్యెను. ఎక్కడ జూచిన నక్కడ నమంగళచిహ్నములే యగపడుచుండెను. ఆగృహము దరిద్రదేవత కాటపట్టై చూచువారలకు మిగులజాలి గొలుపుచుండెను. ఇప్పు డాదీక్షితునిగృహము శ్మశానమువలె భయదాయకమై గన్పట్టుచుండెను. రాధకోప మెంతవృద్ధియగుచుండెనో యామెపుత్రస్నేహ మంత నష్టమగు చుండెను. ఇదివరకు రాధ కోపవివశయై యుద్రేకమున నొక్కొకప్పుడు పుత్రులను మిగులదిట్టు చుండినను వినాయకునకు మాతృస్నేహానుభవమువలన తద్బాలమత్యంతసుఖదాయకమై గన్పట్టుచుండెడిది. అయ్యది యిప్పు డదృశ్యమైపోయెను తుదలేని దుస్సహదరిద్రయాతనయు, తల్లికఠోరవాక్యములును వినాయకుని వంటిజడుని సైతము నస్థిరుని చేసి వైచెను.

ఒక్కదినంబున తల్లి నానావిధము లగుతిరస్కారవాక్యములు పలుకుట వలన వినాయకుడు ఏడ్చుచు గూర్చుండి యుండెను. ఇంతకు బూర్వము తల్లి యెన్ని తిరస్కారవాక్యము లాడి, యెంతకోప పడి

నను వినాయకుఁ డిట్లు రోదన మొనర్చుచు గూర్చుండ లేదు. వినా యకుని యారోదనము వలన రాధకునను నిరమ్మెను. ఆమెహృద యమున మరల బుత్రస్నేహము పొంగి పొరలి వచ్చెను. ఆమె యిప్పట్టున స్వస్థముగ నూరకుండజాలక పోయెను. అమాయకుఁడును మందబుద్ధియు నగుతనకొమరుని నగడవడి స్మరణకు రాఁగా నామెయు వా నితో పాటు ఏడువ సాగెను. ఆదినమునఁ దామాతాపుత్రులు మిక్కు టముగ రోదన మొనర్చిరి. ఆరోదనము వలన నాయుభయులకు న త్యంతసుఖము కలిగెను. చాలసేపటికి వారిరోదనము సమాప్తినొం దెను. ఒకరి యశ్రుజలంబుల నొకరు తుడిచికొనిరి. ఆరోదనానంతర మిరువురి వదనములు ప్రఫుల్లము లయ్యెను. కొమరునివలె తల్లియు మిగుల విస్మితయయ్యెను. కారణ మేమన ఆమె యాయుస్సంతయు రోదనము నొడనే గడచిపోయెను. అట్లయ్యును నేడు వలన నింతటి సుఖ మామెకు కొంతవఱకు కెప్పుడును కలుగలేదు. వినాయకునిసంగతి చెప్ప నక్కఱయే లేదు. అతఁడు ప్రఫుల్లవదనుఁడై "అమ్మా!" యనెను.

ఆహాహా! "అమ్మా" అనుశబ్ద మెంతమధురము, స్వర్గవాణియే రాధ కావినంబడు శబ్దించిన ట్లయ్యెను. ప్రేమాతిరేకమున కొమరుని చుబుకము పట్టుకొని యామె "నాయనా యేమనియెదవు?" అని యడిగెను.

"అమ్మా! ఏమిచేసిన నీకు సౌఖ్యము కల్గును? చెప్పవా?"

రాధహృదయ మిప్పు డానందమున గంతులు వైచుచుండెను. వినాయకునినోటినుండి యిట్టిమాట వెలువడునని నాకె యామె తలప లేదు. ఆనందమున నామె యధీర యై పుత్రునిప్రశ్నకుఁ బ్రత్యు త్తరము కూడ నీయజాల దయ్యెను. ఆమె తనలో దాని ట్లనుకొని యెను. "న సౌఖ్యమున కిప్పు డింకేమి కొదువరా తండ్రీ!"

వినాయకుఁడు మరల నిట్లనియెను "అమ్మా! ఎట్లొనర్చిన నీకు సుఖమో నా కెఱిఁగింపవా?"

తల్లినేత్రము లానందాశ్రువులచే నిండిపోయెను. ఆమె కన్నులు తుడిచికొని "బాబా! నాకొక్కని దీసికొనిరా! అది యింటికి వచ్చినచో నాకెంతో సౌఖ్యము కలుగును." అని చెప్పెను.

కొంతతడవు వినాయకరావు స్తబ్ధుఁడై యుండెను. అనంతర మేమియో యోజించుచు గదిలోని కరిగెను. కొంతసేపటికి తలపాగా ధరించి, భుజముపై ప్రాతయుత్తరీయము వైచికొని గది వెడలివచ్చి తల్లిపాదములకు నమస్కరించెను. రాధ విస్మితయై తనయుని మోము వంక దృష్టి నిగుడించి "వినూ! నాకిప్డీ యెక్కడికిరా ప్రయాణము!" అని ప్రశ్న చేసెను.

వినాయకుఁడు ప్రఫుల్లహృదయుఁడై "వెళ్ళి నీకోడలిని దీసికొని వచ్చెదను." అని బదులు చెప్పెను.

రాధ నివ్వెఱపడి "ఏమి! వీఁడు నా మునుపటి వినాయకుఁడేనా? ఇది స్వప్నము కాదుగదా!" యనుకొనెను.

## ౧౮

శ్రావణమాసము: మార్గమున కిరుప్రక్కల నున్న పచ్చనిపైరుల యపూర్వశోభ వర్ణనాతీతమై యుండెను. సృష్టిదేవత తన పృష్ఠభాగమున నాకుపచ్చనిరంగు శాలువ ధరించినదా యనునటు లెందుఁ జూచినను పచ్చనిపైరులే దృగ్గోచర మగుచుండెను. అతిదూరము వ్యాపించి యున్న నానావిధ మహోన్నతవృక్షములు ఆ శాలువ కంచు వలె భాసిల్లుచుండెను. అహాహా! సువర్ణమయ మగు నీభరతభూమి యందుగాక యిట్టి నయనతోషకమును, చిత్తాపహారకమును, ప్రీతిప్రదమును నగు మనోహరసృష్టిసౌందర్యము మఱెచ్చటనైన గానవచ్చునా! ఈసౌందర్యము మనకు కేవలనేత్రానంద మొనర్చుటయే

కాదు; హృదయాంతరమున మహోన్నత భావములయొక్కయు, మహాత్మాకాంక్షితములయొక్కయు బీజారోప మొనర్చి, మనజీవనశక్తిని గూడ వృద్ధిపఱచు చున్నది.

ఇట్టిసుందరప్రదేశమున నడచుచు శ్వశురగృహమునకు బయన మొనర్చు చున్న వినాయకరావు సాయంత్రము సుమారు నాలుగుగంటల కాయూరు చేరెను. ప్రప్రథమమున సత్తవారింటి కేగక యాతఁడు బాజారున నొక్కదుకాణముఁ జొచ్చి, నిశ్శబ్దముగ నొకవంక నిలువఁబడియెను. దుకాణదారు సరుకు లమ్ముకొనుసందడినిబడి యున్నందున చాలసేపటివఱ కాతనిదృష్టి వినాయకునివంక కరుగ దయ్యెను. వినాయకుఁడును వాని నేమియుఁ బలుకరింప లేదు. ఇంచుక సేపటికి కొనువారిసందడి తగ్గినందున దుకాణదారునిదృష్టి వినాయకునివంకకు దిరిగెను. అంత నాతఁడు చకితుఁడై "ఓహో ఎవరు వినాయకరావుగారా! ఎప్పుడు వచ్చితిరి! అని కుశలప్రశ్నము చేసెను.

వినాయకుఁడు మెల్లగ "ఇప్పుడే వచ్చితి" ననెను.

"కూర్చుండుఁడు. వచ్చినందుకు కొంచెము కూర్చుని చిలుముద మ్మైనఁ బీల్చ వలదా?'' అని చెప్పి దుకాణదారు తనదాపున నున్న కుఱ్ఱవానివంక జూచెను.

కుఱ్ఱవానిపేరు బాలకృష్ణుఁడు. బాలకృష్ణునివయసు షుమారుపది పండ్రెండువత్సరములుండును. ఈతఁడు మిగులను త్సాహశాలి. చెప్పిన పని చేయుటయందు మిగులచురుకైనవాఁడు. ఎట్టిప్రశ్నమునకైన తడవుకొనక వెంటనే ప్రత్యుత్తర మీయ గలఁడు. తలిదండ్రులు మిగులబీదవారగుటచే నితఁడు మేనమామదుకాణము పై నుండెను. మేనమామపలుకు లాలించినంత బాలకృష్ణుఁడు చప్పున లేచి, చిలుము తయారు చేసెను. దుకాణదారు

"అయితే నేమండీ! మీరింతవఱకు మీయత్తవారింటికి వెళ్ళలే
దనుకొందును!" అని పలికెను.

"లేదు నేనిదే వచ్చుట."

దుకాణదారు వినాయకుని యెఱిఁగినవాఁడే. అక్కడ జరుగుబాటు
లేనందున నేటి కేనిమిదిసంవత్సరములకిందట ఇటకు వచ్చి దుకా
ణము బెట్టియుండెను. చాలకాలముక్రిందట వినాయకుని జూచియుం
డుటచే నాతఁడు మిగులనుత్కంఠతోఁ బసగ్రామవార్తల విచారింపఁ
దొడఁగెను. ఇంతలో వినాయకునియత్తవారింట నుండు నొకపరిచా
రకుఁడు మిఠాయికై యాదుకాణమునకు వచ్చెను. ఆపరిచారకుఁడు
వినాయకుని జూచి గుర్తింపఁజాలఁ డయ్యెను. నిజమే, ఎట్లుగుర్తింపఁ
గలఁడు! మిగులమాసి చినిఁగిపోయిన యంగవస్త్రమును శిథిలమైన
కాలిజోడు నచ్చటచ్చట చుసఁగిలోపలిచొక్కాయయు, దుమ్ముతో
నిండినకాలుసేతులును మొగమును విచారింపవలెనా! ఇట్టిశోచ
నీయస్థితియం దున్నవినాయకుని జూచి తిరుమలసమానుఁడైన శ్రీమంతు
నానాసాహెబు దేశముఖుగారి యల్లుఁ డని యాపరిచారకుఁ డెట్లు
గుర్తింపఁ గలఁడు! దుకాణదారు పరిచారకుని యీస్థితి గాంచి,
వెడలి పోవుచున్నవానిని కేకవైచి నవ్వుచు "ఏమిరా భీమా! వీరిని
గుర్తించితివా! ఈతఁ డెవరు!" అని యడిగెను.

భీముఁడు చాలసేపు వినాయకునివంక దృష్టి సారించి జూచెను.
అనంతర మించుకవిస్మితుఁడై "ఏమి! మాబాబుగారి అల్లుఁడయ్యా—
కాదూ!" అనెను.

"ఇప్పటికైన సరిగాఁ దెలిసికొనలేక పోతివా!" అని దుకాణ
దారు నవ్వుచు ననియెను.

భీముఁడు క్రిందికి వంగి మిగులవినయమున వినాయకునకు "రాం
రాంజీ!" చేసి "చిన్నబాబుగారూ! ఎప్పుడు వచ్చారు! ఈడ కూకుండా
రెందుకు!" అని యడిగెను.

వినాయకుఁడు [illegible] బాబుగారికి [illegible] దుంగడివాఁ డిట్లనెను. "అరే! తెలియ చెప్పడు సమయ. దేకరా [illegible] వచ్చినది. నీవునడు. ఇప్పుడే మీ యింటికి వస్తున్నాను."

ఆపటికు లేచియు జెవి బెట్టక దయాపరిచారకుఁడు [illegible] వినాయకునితో నిట్లనెను "వినాయక బాబూ! నడవండి. మాలక్ష్మమ్మగారికి [illegible] రొచ్చిన సమాచారం యింటే సత్రేంగా చెప్తాను [illegible]తో చెత్తుంది. మీరింకా జాగుచెయ్యటం ఎందుకు? వేగిరం నడవండి——"

ఇంతలో బాలకృష్ణుఁడు చలిమిలో యెత్తుగఁ గలిన కొబ్బరిత్రాడు నైచి యూపుచు మిగులఁగడబిడఁగా నటకు వచ్చెను. అతఁడు భీముని తొందరపాటుంజూచి గ్రహించెను. తా నంత్రశ్రమపడి సిద్ధపఱచి తెచ్చిన బలము పిల్చుకుంపఁగనే వినాయకుఁడు పోవ నుంకించుట గాంచి వానిమనసులో మిగుల తొట్రుపాటును బొందెను. వాఁడెంత మాత్రము సహింపక భీమునివాఁడికి జవి యిట్లనెను. "ఏమిరా! ఊరక యేమో గందరగోళము సేయుచుంటివి! ఈతఁడు మీ యజమానునియల్లుఁడని మే మందరము నెఱుఁగుదుము లే. మీయమ్మగారు డిక్కడ గూరుచున్న యెడల నెవ్వరైన కొంటికొని తినిమెద రవియా యొక్కటే విధముగ నడుగునదు అంతతొందర పెట్టెదవు? నీవుపోయి నీపనిచూచుకో, ఈతఁడు సావకాశముగా వచ్చును. వచ్చినందు కిచ్చట కొంచెము సేపు కూర్చుని గంజాయిదమ్ము పీల్చి కొంచెము విశ్రాంతిదీసికొని తరువాత నిష్టమైనచో వచ్చును, లేనిచో లేదు. తెలిసినదా? నీ వెందు కిట్లీతని రాంమ్మని యూరక వేధించెదవు?"

"నీవు. బలే అసాధ్యుడివి! కూస్తే తాళ్ళు, నేనెల్లి బాబుగారితో యీ చమాచార మంతా ఉండదుండట్టు మనివిచేస్తా" అని భీముఁడు రయమున వెడలిపోయెను.

ఇచట వినాయకరావు తృప్తిగా నమ్ము పీల్చి పిదప కాలునేతులు కడిగికొని కొంచెము సేద దీర్చుకొనియెను. మరల నంగడివానికిని వినాయకునకును లోకాభిరామాయణము ప్రారంభ మయ్యెను. ఇంతలో వినాయకుని మామ నానాసాహెబుగా రాయంగడి కరుదెంచిరి. అతనివెంట వెనుకటి నౌకరును మఱిపదిపండ్రెండుగురు మనుష్యులు నుండిరి. నానాగారిని గాంచినంత నాయంగణమున కలవా రందరు వినయముతో లేచి నిలువబడిరి. వినాయకుఁడు మామగారికి సాష్టాంగ నమస్కార మొనర్చెను. మామగారు సంతోషముతో నల్లుని దీవ నెత్తి యాశీర్వాద మొనర్చి నానావిధకుశలవార్త లరయుచు వినాయకుని వెంటగొని నిజమందిరమునకు జనుచుండెను. అట్లు చనుచుండ నాగ్రామస్థులు మఱికొందఱు త్రోవలో నానాగారిని గలిసి కొనిరి. ఆసమయమున వారిముఖకమలము లానందమున వికసించి యుండెను. దేశాంతరమున కేగినయొకానొక సమీపబంధువును చాల కాలమునకు గాంచినచో మనసున కెట్టి యానందము కలుగునో యంతకు మించిన యానందము వినాయకుని యాగమనమువలన కేవల మొక్క దేశముఖుగారికే గాక యాతనివెంట నున్న వా రందరికిని గూడ కలిగెను. వినాయకుని మోముదమ్మి మాత్ర మేకారణముననో మ్లానమై యుండెను. పోలీసుభటులచే కట్టుబడి దీసుకొనిపోవు ఖైదీ యేవిధమున భయవిహ్వలచిత్తుఁడై కారాగృహప్రవేశ మొనర్చునో యంతకుమించినభయముతో వినాయకుఁడు శ్వశురగృహమునఁ బ్రవేశించెను.

## ౧౭

వినాయకుని యాగమనమువలన గ్రామ మంతయు మిగుల గడబిడగ నుండెను. అందు విశేషముగ యువతీయువకుల విషయమున నడుగ నక్కఱయే లేదు. దేశముఖుఁడగు నానాసాహెబు గ్రామమున

ప్రముఖగృహస్థుఁడై యుండినను నందఱితోడను కలసి మెలసి యుండి
గౌరవ మందుచుండెను. అతని మాట సాధుస్వభావము, ద
యాళుత్వకరుణలు బీదసాదలకు జేతనైనసాయము చేయుమనసును.
పరమేశ్వరునిదయవలన నాతఁడు సంపన్నుఁడై యుండెను. ఇట్టిసు
స్వభావుఁడును సంపన్నుఁడును నైనగృహస్థుని యింటికి నన్మాన
ముండుటయు నాశ్చర్యమేమి? నాఁటి నా బాలవృక్షముగా
నంకటమొనస్టెను. అందఱు నాతనియింటి దేవత యోయనుభిమానము. అటు
లనే యాతనిపుత్రి లక్ష్మి గూడ తనశరీరలావణ్యముచేతను గుణసం
పదవలనను, అలౌకికవినయసంపత్తిచేతను, చాతుర్యముచేతను నెల్ల
రకు నతిప్రీతిపాత్రమై యుండెను. వినాయకుని యాగమనమువలన
నెల్లరు సంతుష్టాంతరంగులైరి. లక్ష్మిచెలికత్తెల సంతోషమున కం
తమే లేదు. ఇం దాశ్చర్యమేమి? తరుణస్త్రీలవలన నానాగారి లోపలి
గృహ మంతయు మిగులసందడిగ నుండెను. అటులనే వెలుపలి కచేరి
చావడి యంతయు తరుణపురుషులతో నిండియుండెను. ఆసమయ
మున నానాగారియిల్లంతయు సంతోషసాగరమున మునిఁగి యుండెను.
సర్వత్ర సంతోషాధిదేవత నాట్యము సేయుచుండెను. గృహమంతయు
పరిహాసప్రసంగములతోఁ బ్రతిధ్వనించుచుండెను.

ఈహాస్యప్రసంగములవలన వినాయకునిప్రాణములు క్రిందుమీఁ
దగుచుండెను. ఈయువకు లందఱు దనచుట్టు నెందులకు మూఁగిరో
యెంతయోచించిన నాతనికి దోఁచదయ్యెను. వారంగ రట్లుతన్ను
పరిహసించుచుండఁ బ్రతిహాస్య మొనర్చుటకు గాని కుశల
ప్రశ్నములను విచారించుటకు గాని వినాయకునికి ధైర్యము చాల ద
య్యెను. అతఁడు మహామునివలె స్తంభితుఁడై యుండెను. "ఓహో!
గొప్పగొప్పవారితో ప్రసంగము. అందును వీ రందఱు పట్టణవాసు
లు. వీరలతో బాగుగ మాటలాడనేర్చిన సరి గాని లేనిపక్షమున

పరువు దక్కును. నే నిప్పుడు మాటాడకుండిన చెడు పేమి?" ఇ
ట్లాలోచించి వినాయకుఁడు రావు మానప్రశస్తి కొరకు మౌన మొనర్చెను. అట్లు
యుండి నాతఁ డొకటిరెండుమాఱులు మాటలాడఁ బ్రయత్నించెను.
కాని నోటనుండి శబ్దము వెలువడకూడ దను శపథమునకు గదా! ఈశప
థము వానికంఠముపైని కత్తివలె నున్నదే! వినాయకుని మౌనము
వలన వారందఱు నిరుత్సాహులై మెల్ల మెల్లన వారి వారి గృహములకు
కరిగిరి. పోవునప్పుడు కొందఱాతని గర్విష్ఠి యనియును, మఱికొం
దఱు మూర్ఖుఁ డనియును, నెవరికిఁదోఁచినట్లు వా రనుకొన సాగిరి.

జనులకోలాహల మంతయును తగ్గఁగనే క్రిందపడియుండఁ గనుచున్న
వినాయకుని ప్రాణములకు కొంచెముస్వస్థత కలిగి తా నిప్పుడు స్వతం
త్రుఁడైనట్లు తలఁచెను. కాని యాతని కీయవాంతరము గడిచినదో
లేదో యింతలో లోపలికి రమ్మని పిలుపు వచ్చినది. ఇప్పుడు చేయ
వలసిన దేమి? అతఁడు దీర్ఘాలోచనమున మునిఁగెను. వాని కే
మియుఁ దోఁచుట లేదు. లోపలకుఁ బోవుట తప్ప గత్యంతరముగా
న్పించుట లేదు. కొంతతడవు తనలోఁ దా నేమా మాలోచించి,
వినాయకుఁడు చప్పునలేచి నొకటి దుకాణదారుని కడకుఁ బచ్చెను.
వినాయకుఁ డంగడి వానికి రహస్యముగ నత్తవారింటఁ జరిగినసంగతి
నాద్యోపాంతముగ వివరించెను. మఱియు తానేయుద్దేశ్యమునవచ్చి
యుండెనో యెఱింగించి యాప్రజాసమూహామునుండి తప్పించుకొన
నిప్పు డేదేని యుక్తిఁ దెల్పుమని వానిని బ్రార్థించెను.

వినాయకుని సమస్తవృత్తాంతమును బాలకృష్ణుఁడు మిగులకౌతుక
ముతో విను చుండెను. నడుమనే యాతఁ డి ట్లనియెను. "అన్నా!
నన్ను నీతోఁ దీసికొని పోయెదవా? అల్లుని పంక్తిలాభము నేను
కూడ రెండుదినము లనాయాసముగా ననుభవించెదను. నేను నీవెంట
నున్నచో మఱి నీ వొక్కయక్షరముకూడ బలుక నవసరము లేదు.

అన్నిటికి నే నొప్పు నడివడి ప్రత్యుత్తర మిత్తునో నీవేనా చెప్పవుగాక చెప్పితివా, నన్ను వెంట, దోడుకొని పోయెదవా? నాగా! ఇది నీకుమంచిదికాదు సుమా చెప్పు చుంటిని.”

వినాయకునకు స్వర్గము వచ్చి యఱచేతఁ బడిన ట్లుండెను అతఁడు బాలకృష్ణుని తనతోఁ బంపు మని దూకాణదారుని బిగుల వేఁడుకొని, తుద కాతని సమ్మతి పొందెను. బాలకృష్ణుఁడును పర మానంద భరితుఁడై మాసిన యంగవస్త్రమును విడిచి, పండుగదినముల యందు గట్టుకొనుటకై ప్రాణపదముగ దాచి యుంచిన జరీధోవతి యు అంగరఖా. టోపి, మొదలగునవియు ధరించినీటుగా వినాయ కునితోఁ బయలుదేఱెను. ఇరువురును వచ్చి కచేరిచావడి యందు గూర్చుండుట తడవుగా “ఫలహారమునకు లెండు ఇంకను నాలస్య మెందులకు?” అని పరిచారకులు పిలిచిరి. వెంటనే వినాయకరావు లోపలి కేగుచుండెను. బాలకృష్ణుఁడు గూడ వాని వెనుకనే జను చుం డెను. లోపలఁ బ్రవేశింపఁ బోవుచుండ లక్ష్మి చెలికత్తె లొనర్చు చున్న మందహాసధ్వనులు వానిచెవులఁ బడియెను. తోడనే వినాయ కుని నోటఁ దడి యెండి పోయెను. ఇప్పు డేమి చేయవలయును! ఆధ్వని వినవచ్చిన యంతఃపురము వైపునకు బోక చప్పున తిరిగి పోవుటయే యుత్తమమార్గ మనిదలంచి వినాయకరావు మఱియొక ప్రక్కకుఁ బోవఁ జూచెను కాని. వాని ప్రయత్నము నిష్ఫల మయ్యెను. ఒకపరిచారిక ముందునకు వచ్చి, అతఁడు తప్పించుకొనిపో వుటను చూచి, “అటు గాదు ఇటు యిటు దయచేయుఁడు” అని వినా యకుని సవినయముగ విన్నవించి యాధ్వని వినవచ్చిన గదిలోనికే యాతని దోడుకొని పోయెను. బలియిచ్చుటకై గొనిపోవు గొఱ్ఱెపోతు వలె కంపితగాత్రుఁడై వినాయకరావు వేఱు తెఱవుఁ గానక యాగదిలోఁ బ్రవేశించెను. ఆగది యందున్న యువతీమణుల కటాక్ష

మాలిక లాతని నొక్కుమ్మడి జుట్టుకొనెను. ఆ యపూర్వప్ర
దర్శనమున లంతయు నొక్కక్షణము నేత్రసంకేతముల పరస్పర మనో
భావముల వెల్లడించుకొనిరి. వినాయకుడు తలయెత్తి చూచు నప్పటికి
విశాలమగు నాయంతర్గృహమున ననేక యువతీమణు లొక్కటిగ
జేరియుండిరి. వారి ముఖము నొక వింతస్వైరమున నానావిధభావానను
లునిచియుండెను. తలవంచుకొని వినాయకరావు పీఠముపై గూ
ర్చుండెను. సహాయజామాత యగు బాలకృష్ణుడు కూడ నాతని
ప్రక్కనున్న మఱియొక పీఠముపై విరాజమానుడయ్యెను. వినాయకుని
యీయజ్ఞావ్యవహార మంతయుఁ జూచి యాయువతులెల్ల రొక్క
పరి మధురమందహాస మొనర్చిరి. కొంతసేపా యంతర్గృహము
నిశ్శబ్దముగ నుండెను. ఆనారీమణుల వికసితముఖకమలములు నిస్తే
జము లయ్యెను. ఇందఱు యువతీమణు లొక్కటిగఁ జేరి యింతతడవు
స్తబ్ధముగనుండి రెందులకో! తుదకొక్కతె యాశాంతికి భంగము
నర్చెను. ఆమె మందహాస మొనర్చుచు నిట్లనెను. "మాబావగారీది
నము ద్రోవతప్పి వచ్చినారని తోచుచున్నది."

బావగారు నోరు తెఱచు టెట్లు! తల పైకెత్తనని శపథము
గదా! వాస్తవముగ నాతడిప్పుడు నోరు తెఱువవలసిన యావశ్యకత
లేదు. తనకు బదులుగ బాలకృష్ణునకు సర్వాధికారములును ముఖప
త్రముద్వారా యొసంగి యుండెను. బాలకృష్ణు డిట్లని వెంటనే ప్ర
త్యుత్తర మిచ్చెను. "ఓహో మేము త్రోవతప్పినచో నిచటి కెట్లు
వచ్చియుందుము? మార్గముసరిగా నెఱిగియుండుటచేతనే యిచటికి
రా గలిగితిమి."

ఈప్రత్యుత్తరము వినినంత నాయువతు లెల్లరు నాబాలమూర్తి
వంక జూడ సాగిరి. వినాయకునితో గూడ వచ్చిన యీబాలకు డెవ్వ
డో యెంత యోజించినను వారికిఁ దెలియరా దయ్యెను. తుదకు తొలు

వొత్తి ప్రశ్నించినతనతనుని యితరనారీమణులను తృప్తిపఱచుటకై యుంచుకొ ధైర్యము చిక్కబట్టి "మూఁడావగారికి నీ వెక్కడ చాపరిం చితివి నాయనా!" అనెను.

బాలకృష్ణుఁడు సామాన్యుఁడా! అతఁడు సరళముగా, కొంచెము ప్రత్యుత్తర మీయఁ దలఁచి, వినాయకునివైపు వ్రేలుజూపి "ఈతఁడు మాయన్న" అని వచించి పళ్ళెమున మిగిలనుండునముక్క నెత్తి మిక్కిలియాతురతతో నోట వైచుకొనియెను. వానిపలుకులచే నా స్త్రీలకు మిగుల కౌతుకము జనియించెను. సిగ్గైజమై యున్నవారి మొగములు మరల మధురమందహాసచంద్రికలతో వికసించెను.

బాలకృష్ణుఁ డొసఁగినప్రత్యుత్తరము వినినంత వినాయకునియా నందమునకు పారమే లేదు- అతఁడు తనమనమున నబ్బాలకు నొక్కటే విధముగా మెచ్చుకొనుచుండెను. అతఁడు తనవెంట నుండుటచేతనే యీదినమున తనపరువు దక్కునని తలంచెను. ఇందరుపరభామి నులు తనచుట్టు నుండుట చూచి యాతఁడు ఫలహార మొనర్చుటకు సిగ్గుపడియెను. ఆస్త్రీలెల్ల వానిని మిక్కిలి పరిహాస మొనర్పసాగిరి. వినాయకునిహస్తము పైకి లేచుటలేదు. వానికి ఫలహారము గిలహా రము నేమియు దోఁచుటలేదు. ఎప్పుఁ డీబాధనుండి విముక్తి గల్గునా యని యాతఁడు యోజించుచుండెను. ఇదియంతయు గనిపెట్టి బా లకృష్ణుఁ డాస్త్రీల నుద్దేశించి యిట్లనెను. "ఇంతదూరము నడచివచ్చి నందున మాయన్న మిగుల నలసి యుండెను. కావున ముందు యథేచ్ఛముగ మమ్ము ఫలహార మొనర్ప నిచ్చి కొంచెము సేదఁ దీర్చుకొనినపిమ్మట మీ యిష్టము వచ్చినట్లు హాస్యము చేయుఁడు." ఏమండీ "వదినే! ఇంకను కొంచెము ఉప్మావు తీసుకొనివచ్చినారు కా కేమి! మాయన్నకు ఉప్మావన మిగుల నిష్టము"—

ఆవదుచులనోళ్ళు కట్టబడియెను. బాలకృష్ణునివర్తనము వలనను

వేడికోలు వలసను ఆస్త్రీలెల్లరకు సహాసము గల్గెను. ఈస్వల్పసమయములో వినాయకుం డతిత్వరితముగ ఫలాహార మొనర్చెను. బాలకృష్ణునకైన మున మాత్ర మేమియు మిగులలేదు. ఇంకే మైనను సమయ మట కన్న చోఁ బాగుగనుండు ననివాఁడు యోజించుచుండెను. కాని యింతలో వినాయకుఁడు లేచినందున విధి లేక పళ్ళెము నుండి యతఁడుఁ గూడ లేవవలసి వచ్చెను. చేతులు గడిగికొనినపిదప తాంబూల చర్వణము సేయుచు వినాయకుఁడు ప్రక్కనున్న గదిలోఁ బ్రవేశించెను. బాలకృష్ణుఁడును వాని వెనువెంటనే జనియెను.

అదిగాంచి యా యువతులెల్లరు లోలో నవ్వుకొనదొడఁగిరి. వారల కబ్బాలకుని ప్రతివాక్యము ప్రతిచర్యయు మిగుల సంతోషకరముగ నుండెను.

తాంబూల చర్వణానంతరము మృదుశయ్యపై దిండును నానుకొని వినాయకరావు కూర్చుండెను. ఇంతలో హాస్యవినోదోత్సుకలైన యువతులుకూడ మరల నచ్చటికి వచ్చి ప్రత్యక్షమయిరి. ఆయువతులపరిహాసోక్తులనుండి తప్పించుకొంటినిగదా యని సంతసించుచున్న వినాయకునకు వారిని గాంచి నంతనే మరల ప్రాణములు క్రిందుమీఁదు కా సాగెను. గుండె దడదడ గొట్టుకొన సాగెను. మోము వెలవెల బారెను. ఇంతలో నసువమరూపవతి యగునొక బాలిక మంజులస్వరమున వినయపూర్వకముగ వినాయకునితోఁ "బావ గారికి మేము జ్ఞాపక ముంటిమా?" యనెను.

బావగారికినోటికి తాళమే! బాలకృష్ణుఁడు కన్ను దెప్పలల్లార్చుచు వెంటనే ప్రత్యుత్తర మొసఁగెను "వా! జ్ఞాపక మే లేనిచో మీ మిం చటికెట్లువచ్చితిమి? మాయాగమనమే మాజ్ఞాపకమును స్థిరపఱచు చున్నది కాదా? అయినను మీవంటివారి సౌక్యసార మాదిసతరు

నాతో మీకున్న సంబంధము శక్యముగునా! నేనే నా అవజాలనైతిని. ఇంక మాయన్న మాటం జెప్పఁ గలుగుదునా!"

పాపము బాలిక యీప్రత్యుత్తరము వలన మిగుల సిగ్గుపడి, తక్కిన యువతీజనము వెనుక కరిగి దాఁగికొనియెను. అంత మఱియొక యువతి యీబాలిక ధైర్యమువలంబించి "నీ కింత శోషణ మెందులకు నీవూరక కూర్చుండలేవా? నీతో నెవరును మాటలాడలేదు. తెలిసినదా?" యనెను.

బాలకృష్ణుఁడీ యీపలుకులకు మిన్నకుండువాఁడు కాఁడు! అతఁడు గంభీరముగా "వదినే! మీ రేమనియెదరు? నేను మాయన్న పంక్తి భోజనమునకు వచ్చితి ననుకొంటిరా? నన్నూరక కూర్చుండు మనుటకు?"

"మీయన్నగారు మూఁగవా రనుకొంటిదను. ఆయన నేమి యడిగినను ప్రతిప్రశ్నకు నీవే ప్రత్యుత్తర మొసఁగెద వేమి?"

"ఎందుకు మూఁగవాఁడైనాఁడు? నేను వెంటలేనా! నే నేప్రశ్నమునకుత్తర మొసఁగఁ జాలనో యాప్రశ్నమున కాతఁ డుత్తర మొసఁగును. తెలిసినదా? ఈకుంటిప్రశ్నములకు ప్రత్యుత్తర మొసఁగుట కాతఁడు కూడ కావలయునా?"

బాలకృష్ణుని యీమాటల కంతయు పకపక నవ్వసాగిరి. కొంత తడవున కాస్త్రీ మరల నట్లనెను. "వారేవా! నీవు మిగుల హుషారైన పిల్లవాఁడవు. ఏమండీ బావగారూ! ఈహుషార్ సోబత్ మీ కెక్కడ దొరికినది?"

దీనిపైన బాలకృష్ణుఁడు హేళనగా "వదినే! రాజులకు గజాశ్వము లెచ్చట దొరుకుచున్నవి?" అనెను.

ఆస్త్రీ లెల్లరు పకపకనగి మోము లావైపునకుఁ ద్రిప్పుకొనిరి. బాలకృష్ణుని యీ యపూర్వ చాతుర్యమును గాంచి వినాయకరావు

గూడ నిప్పుడు మాటలాడుటకు ధైర్యమువహించెను. కాని యెవరితో నేమని మాటలాడవలయునో వానికి దోఁచలేదు. తుదకు కొంతడు బాలకృష్ణుని వైపునకుఁ దిరిగి "బాలకృష్ణా! చిలుము తయారుచేసి తీసుకొని రమ్ము." అనిపలికెను.

వినాయకుని నోటనుండి శబ్దము వెలువడుటయే తడవుగ బాలకృష్ణుఁ డొక్క యురు కురికి పరుగెత్తెను, ఇంతలో మెల్లమెల్లగ వైధవ్యదుఃఖాగ్నిచే మ్లానవదన యగునొకమూర్తి ద్వారముదగ్గఱకు వచ్చి నిలువఁబడియెను ఆసమయమున నటనున్న వారందఱి దృష్టులు నాదెస కరిగెను. సదాశివునిమామ యగు రామచంద్రుని పెద్ద కోడలే యామె. మఱియు నీమె మాధవరావుని సోదరుఁడును స్వర్గవాసియు నగునారాయణరావుభార్య నానాసాహెబునకు మేనగోడలు. ఆమె క్షణమాత్రము లోనికి తొంగిచూచి మనసున నేమితోఁచెనో కాని దౌర్భాగ్యురాలగులక్ష్మి వెంటనే యదృశ్యయయ్యెను. వినాయకుఁ డాశ్చర్య చకితుఁడై యాయువతీ సమూహమువంక జూడఁ దొడగెను. ఇదిగాంచి వారలలో నొక్క తరుణి నిట్టూర్పు విడిచి కరుణాజనకస్వరమున నిట్లనెను. "పాపము దానిపై నాకసమునుండి గొడ్డలి జారిపడినది. ఎంతోయుత్సాహమున మిమ్ము జూడరా నామెకు దుఃఖము పొరలివచ్చినది. మీతో మేము హాస్యము లాడుచుండుట గాంచి లోని కేగినది. ఏమిచేయుదు, దానిప్రారబ్ధము!"

కొంతవఱ కెల్లెడ నిశ్శబ్దముగా నుండెను. ఒక్కరినోటగూడ శబ్దము వెలువడుట లేదు. కొంతసేపటికి వెనుక దాగిన బాలిక మరల ధైర్యముఁ దెచ్చుకొని ముందునకు వచ్చి మృదుస్వరమున "బావా! ఇంకకుముందెన్నిమాఱులో మిమ్ము రమ్మని యుత్తరములు వ్రాసితిమి. ఒకటి రెండు పర్యాయములు ప్రత్యేక మిందుకొఱకై మనుష్యులను గూడ బంపి యుంటిమి. కాని మీరు రారైతిరి. ఇపుడుమీరయింత

మీ తో వచ్చితిమి. నాపై నింతటి యనుగ్రహ మెట్లు కలిగినది? మీకు నాపైన గోపము వచ్చిన దేమో యని తలంచితిమి."

తనచిన్న మాటవలన నుద్రేకము గలిగించి యీనాయకునకు ప్రత్యుత్తర మొసగుటకు సాహసించెను. బాలకృష్ణుడు వెంటను తిరిగి రాం డయ్యెను. కాని యీబాలిక మాత్ర మిట్లనెను. "అమ్మ పంపినందున వచ్చితిని—"

"అట్లాగా!"

ఆ బాలిక కింకను మాటలాడ వలయు నని యున్నది. ఇంతలో చిలుము చేత బట్టుకొని బాలకృష్ణుడు దగ్గఱ కరుదెంచెను. అతడు తనుపక్షమున బూర్ణాపజయము వాటిల్లినట్లు తలంచెను. చిలుము ని నాయకున కొసంగి తక్షణ మాతడిట్లనెను. మావదినెను దీసుకొని వచ్చుటకై మాయమ్మ పంపినది. తెలిసినదా? అమ్మ పంపనిచో మే మెందుకు కామెను దీసుకొని పోవుటకు వత్తుము? ఆహా! మీ కీ మాత్రము తోచ దేగా!"

ఆ బాలికకు మిక్కిలి యీసు జనించెను. "నాయనా, నీ విక్కడనే యుంటివా?" యని తనలో ననుకొనుచు నచటనుండి యామె వెడలి పోయెను. తరువాత నామె యింటకు రాలేదు.

యువతీవర్గమునకు బాలకృష్ణుడొసగిన ప్రత్యుత్తరము లెంతయు సమయోచితముగ నున్నందున వాని మాటయన్న వారికందఱకును మిగుల కౌతూహలజనకముగ నుండెను. తుదకొక సుందరి వానినామము చేతనే వానిని పరాభవింపం దలంచి మిగుల గాంభీర్యముతో "ఏమిరా! నీపేరు బాలకృష్ణుడుగదా? అవును! కృష్ణుడు బాల్యప్రాయమున పశువుల గాచెను. నీవును నట్లు జేయుదువని తలంచెద" ననెను.

కాని బాలకృష్ణుం డెట్టిగట్టివాడు. అతడు మందహాస మొనర్చి వెంటనే యిట్లనియెను. "అవునవును. నేనుపశువుల గాచితిని. ఇంతి

దే కాదు. వనమున కేగినప్పుడు కదంబవృక్షచ్ఛాయను కూరుచుండి మురళిగూడా వాయించితిని. తెలిసినదా?"

అంతనా స్త్రీ లెల్ల పకపక నగిరి. అం దొక బాలిక యిట్లనియెను. "అహాహా. ఇది మురళి వాయించు పాటి కాదుగదా! నీవు సంగీతపాఠకుడవు కూడనా! అందును నీవు మురళిగానము కూడ నేర్చితివా? అట్లయిన నప్పు డేమేమి పాడితివో యిప్పుడు పాడి చూపించెదవా?"

బాలకృష్ణుడు మధురస్వరమున బాడుటకు బ్రారంభించెను.

ఆయువతీవర్గ మెల్ల తటస్థముగ నుండి వినుచుండిరి. వినాయకుడును గానమున లీనుడై పోయెను. బాలకృష్ణుడు ద్వితీయకుమారి యని వానికి సైతము దోచెను. అల్ప వయస్కుడగు నా బాలకుని మధురకంఠము నుండి వెలువడిన యాగానామృతము నాలకించి యా యువతులెల్లరు నచేతనలైరి. వారు పరస్పరము మిగుల బ్రశంసించిరి.

౧౨

రాత్రి పదిగంట లగునప్పటికి భోజనాదికముల నిర్వర్తించి వినాయకరావు శయన గృహమును బ్రవేశించెను. కాని లక్ష్మీనరసాంబ యింకను రాలేదు. పగలంతయు వినాయకరావు రమణీబృందమును చూచు యుండెను. కాని యాసమయమున బాలకృష్ణుడు దగ్గరనుండుటచే నాతడు ధీరుడై యుండెను. బాలకృష్ణుని వాక్చాతుర్యము గలసి నాతని సంకోచవృత్తి యంతయు దొలగి పోయినది. ఇప్పు డెవ్వరో బాలకృష్ణుడు తనతో నుండుటకు వలనుపడదు గదా! ఇప్పు డాతడొంటరి యయ్యెను. ఈవిచారమున మరల భయదేవత ప్రత్యక్ష మయ్యెను. అతని మోము కళావిహీన మయ్యెను. సుశిక్షితయు, విదుషీమణియునగు భార్యతో రాత్రియంతయు గడుపవలెనే! ఆమె తన్నేమైన బ్రశ్నించినచో నేమని ప్రత్యుత్తర మొసగవలెను? సరియైన ప్రత్యుత్తరమొసంగనిచో నామెకడ పరాభవము సంభవించు నే

ఈయోజనలవలన నాతఁడు చింతాసముద్రమునఁ బడియెను. ఇంతలో మందగమనమున లక్ష్మీబాయి శయనగృహమున కరుదెంచెను. వినాయకుని హృదయము తటతట కొట్టుకొనసాగెను. అతఁడు గాఢసుషుప్తి నటించుచు, దుప్పటిగలవలువను ముసుఁగిడి మంచముపై నొకవైపునఁ బరుండెను. లక్ష్మి మెల్లమెల్లగ పతిసన్నిధి కరిగి యాతని పజ్జ పవ్వళించెను. చాలసేపటివఱకు నిరువురు స్తబ్ధులై యుండిరి. ఎవరినోటివెంటను మాట లేదు. ఇట్లుండుట వినాయకున కిష్టముగ నుండెను. కాని లక్ష్మి కీమౌనము మిక్కిలి యసహ్యముగ నుండెను. ఆమె యింక నూరకుండ లేక వినయము దొలుక మగనితో "మనయింట నందఱు సుఖముగ నున్నారా?" యనెను.

వినాయకున కీప్రశ్నమున కేవిధముగను ప్రత్యుత్తర మొసంగ శక్యముగాకుండెను. అంతహఠాత్తుగ నాతనిమనమున నొక్కయూహ తోఁచెను. "ఈప్రశ్నకు 'ఆ, యనిన చాలు' నంతకంటె నతిశయ మేమియునక్కఱలే" దని యాతఁడనుకొనెను. కాని దీనికుత్తర మొసగినచో తోడనే యామె మఱియొకమాట ప్రశ్నించును, దానికి సమాధాన మొసఁగినచో మఱియొకటి యడుగును. దానికొసఁగినచో మఱియొకటి. ఇట్లొకదానిపై నొకటివచ్చి పడినచో నేనట్లుత్తర మొసఁగుదును, మొదలే యొసగనిచో మఱి ప్రశ్నయే యుండదు. "మౌనం సర్వార్థసాధకం" మ్మని యామంత్రము జపించుచు నాతఁడు నోటికి తాళము వైచికొని స్తబ్ధుఁడై యుండెను. ఇట్లు చాలసేపు గడచెను తన ప్రశ్న కేమియుఁ బ్రత్యుత్తరము రానందున లక్ష్మి మఱి ప్రశ్నింపక, మెల్లగ లేచి, పతిపాదసేవ యొనర్చుట కారంభించెను. ఆమె కాలిపై జేయివేయుట తడవుగ వినాయకుడు ఊఁ ని యొడలు విఱిచికొనుచు నేమో బాధ నభినయించి కాలు లాగికొనెను.

భర్తవేదనఁ గాంచి లక్ష్మి కళవళ మొందసాగెను. ఆమె తనచేయి

దీసికొని కరుణాస్వరమున "మీకాశరీరమునం గలబాధ యేమి?" యని వినాయకు నడిగెను.

వినాయకరావు శపథమును బట్టి యీప్రశ్నకుత్తర మొసంగుట తప్ప గత్యంతర మేమియు లేదని తలంచి, మిగుల ధైర్యశాలియై మెల్లగా "ఇంతదూరము త్రోవపొడుగున గులకరాలమీద నడచుటచే పాదములు మిగుల నొప్పులెత్తుచున్నవి." అని చెప్పెను.

లక్ష్మీబాయి యింకేమియు మాటలాడలేదు. తత్క్షణము మంచముమునుండి లేచి, లోనికరిగి గిన్నెతో నాముదము దెచ్చి దీపముపై వెచ్చజేసి, కోమలహస్తములతో నాతనిపాదద్వయమును మర్దించుచు గూర్చుండెను. వినాయకుని పాదములు నిజముగ బొక్కియుండెను. వెచ్చనిచమురు రాయుటచే నాతని కెంతయు, సుఖముగ నుండెను. తైలము రాయుచు నామె "మనయింట నందరు సుఖముగనుండిరా?" యని యడిగెను.

వినాయకుడు "ఆ" అనెను.

"మాయక్క పార్వతి కోపమున బుట్టినింట కేగినదట నిజమేనా?"

"ఆ"

"మనవా రామెను దీసికొనివచ్చుట కెవ్వరైన వెళ్ళినారా?"

"ఆ"

"మఱి వా రామె నెందులకు బంపలేదు?"

ఇప్పుడేమి చేయవలయును? చిక్కు వచ్చినది. ఇంతవఱ కొక్క 'ఆ' అను నక్షరముతో నిర్వహించుకొని వచ్చుచుండెను. కాని యీ ప్రశ్నకు 'ఆ' అని గాని, ఈ, అని గాని 'ఊ' అని గాని యుత్తర మొసంగుట శక్యము కాదే! పాపము, వినాయకుని పిఱికిగుండె దడదడ కొట్టుకొన సాగెను. గత్యంతర మేమియు లేదు. ఉత్తర మొసంగి

తీరవలెను. తుదకు చాలసేపు యోచించి! యాతఁడు "అన్నయ్య కక్కడ నుద్యోగము దొరకినందుననల్లే" యనెను.

"నిజముగ నన్ను దీసికొని వచ్చుటకే మా యత్తయ్య యిచటకు బంపినారా?"

మరల వినాయకుడు పూర్వవిషయమునే స్మరణకు దెచ్చుకొని 'ఆ' యనెను.

"ఎన్ని దినములకు మా యత్తగారికి నేను జ్ఞప్తికి వచ్చితిని! వార్ధకమందామెకు శుశ్రూష లొనర్చి మెప్పొంది ధన్యనగుదునాయని యువ్విళ్ళూరు చుంటిని. ఇంతవఱకు నా మనోభీష్టము సిద్ధింపదయ్యెను. తెలియక నే నేదేని యీమె మెప్పునట్టి మహాపరాధ మొనర్చియుందును. అందువలన నాకీ దుర్భరశిక్ష సంభవించినది. కాని నేఁ జేసిన యపరాధ మేమో యెంత యోజించినను నాకు స్మరణకు రాదయ్యెను. అది యెట్లయిన నుండనిండు. ఈదినమున నాచింత లెల్ల దూరమయ్యెను. సరిసే కాని యింతవఱకు నత్తయ్య నన్నెందులకు బిలిపించినారు కారో, నాకు తెలుపరా?

వినాయకున కిప్పు డెక్కడలేని ధైర్యమును వచ్చినది. ఆతఁడిట్లనెను. "నీనగలు మరల చేయించిపంపుటకు తగినవీలు కానరానందున నిన్నక్కడకు బిలిపించుటకు మాయమ్మకు మొగము చెల్లినది కాదు."

నా కేమి యుపకార మొనర్చ రని మాయత్తయ్యకు మొగము చెల్లక పోవుటకు! ఆనగలు నాకిప్పు డవసర మేలేదే! మానాయన గారప్పుడే నాకు వేఱు నగలు చేయించి యిచ్చిరి. నగలు నాకంత ప్రాణపదము లని భావించితిరా?"

"అయితే నీవు బయలుదేఱునపు డీనగలు కూడ వెంటదీసికొని వచ్చెదవా యేమి?"

"ఇదియేమి! మీప్రశ్న బహువిచిత్రముగ నున్నదే! తనను కొనిపోవుట కెవరియాటంక మున్నది? ఈ మనుష్యశరీరమునకు ననుభవ మే కదా! అవసరము వచ్చిన వీనిని కూడ నుపయోగించుకొనుట కెవరియాటంకమును లేదే!"

పత్ని భాషణము లాలకించి వినాయకుడు విస్మితుండయ్యెను. చాల సేపటివఱ కాతఁడేమేమో చింతించుచుండెను. అనంతర మావిచారముల నుండి విముక్తి గలుగఁజేసి సంపూర్ణవిశ్రాంతి నొసఁగుశక్తి యే దేవతకు గలదో యాదేవతను- చిలుమును- నొక్కసారి యనన్యభావమున శరణుజొచ్చు నుద్దేశ్యమున వినాయకరావు-శయ్యపై నుండి లేచెను. అంతవఱకును లక్ష్మి యాతనిపాదము లొత్తుచు గూర్చుండి యుండెను. పతిలేచునుద్దేశ మామె లక్ష్యమునకు రాఁగనే వినాయకునకు ముందు శ్రమ యేమియు గలుగనీయలేదు. భర్తయభిప్రాయ మామె యెఱిఁగిన దగుటచే, ముందే సర్వము సిద్ధపఱచి యుంచెను. ఆమె తత్క్షణము లేచి, స్వహస్తమున చిలుము సిద్ధపఱచి నాథునిచేతి కందిచ్చెను. వినాయకున కెంతటివిస్మయానందములు కలిగినవి! అతని జన్మమున నింతవఱ కిట్టిశుశ్రూష యెవ్వరైన జేసియుండిరా?"

## ౧౮

రాత్రికప్పుకొన్న కృష్ణవర్ణపుశాలువను దూరముగఁ బాఱవైచి పూర్వదిశాలలన శుభ్రపత్రపరిధాన మొనర్చెను. నిబిడవృక్షసంతతుల నడుమ నొకటిరెండు పక్షుల మంజులరవము వినఁబడు చుండెను. ఇంతవఱకును పికసంతతులు కులాయములనుండి వెలువడలేదు. చల్లని శీతవాయువు లల్లనల్లన వీతెంచుచుండెను. వీనిస్పర్శమున సర్వాంగములును నమృతాభిషిక్త మగుచున్నవి. అంతఃకరణము ప్రసన్నోల్లసిత మగుచున్నది.

నిత్యమును నియమకాలమున నానాలోకముఖ శయ్యపైనుండి లేచి శుచియై శాస్త్రానుసారముగఁ బ్రాతఃస్మరణ మొనర్చుచు, హస్తములఁ బూలబుట్ట బట్టుకొని బయటకు వెడలును.

అందమైన గనుపట్టె వెన్నెల మందపవనుఁడు వీచె సుమములు
వందిమాగధు లట్లు పక్షిద్విజ బృందములుఁ గూడి
సుందరాంగా! రఘుకుమారా! శుభవిధాయక యనుచు, బిలచెడి
ఇందిరేశా, ఇనకులేంద్రా! ఇంక మేల్కొనవే.
తరుణభానుని యుదయమున నా రజనితిమిరము గుహల డాగెను
భృంగములు ఝంకారమొనరుచు పాడెను వరద మేల్కొనవే
కమలములు వికసింపసాగెను కలువపూవులు మొగుడఁదొడఁగెను
కమలనయనా కనకచేలా! కరుణ మేల్కొనవే
పంకజభవసురమునివరాదులు భవ్యతరమగు నీదు నామము
వినుతి సేయుచు నున్నవారలు వేగ మేల్కొనవే
అరుణుఁ డంతట నుదిత మగుటను కిరణహీనుం డయ్యె చంద్రుఁడు
మరలె తారల కాంతిపుంజము వరద మేల్కొనవే.

పై విధముగ భూపాలరాగమునఁ బాడుచుఁ బూవులు గోయుచు నానా యమునోదయమునఁ దోఁటలో నిత్యము దిరుగు చుండును. పరమేశ్వరునికృపవలన నాతనికడ ననేకపరిచారకు లుండినను నీపని నాతఁడే యొనర్చు చుండును. గృహమున కానుకొనియే రమణీయ మగుపుష్పోద్యాన మొకటి గలదు. ఈకాలమునాటి కొందఱు శ్రీమంతుల పెరటి ద్యానములవలె నానాగారియుద్యానవనమధ్యమున విదేశీయ గంధవిహీన పుష్పవృక్షములును కేవలరమ్యపర్ణవంతములగు వృక్షవల్లరులు నేమాత్రము లేవు. కేవలదేవసేవోపయుక్తము లగు నానావిధసుగంధకుసుమవృక్షసంతతు లీయుద్యానమున నెల్లప్పుడు పరిపూర్ణముగ నుండును. నానా విరులు గోయుచు నలువంకల మంద గమనమున సంచరించు చుండఁ బ్రత్యూషశీతలపవనుఁడు తనసుఖ స్పర్శచే నాతనికి సేవ యొనర్చు చుండెను. నత్సాంగత్యమహిమ

యున్నది యుండును గదా! ప్రాతఃకాలానిలపోతములు దేహము శీత
లముచేఁ గాక, నానావిధసుగంధపుష్పపరాగసంసర్గంబున నీ వేళ మనో
హరపరిమళము వహించి, హృదయమునకు అనిర్వచనీయమగు దేహము
నకును తుష్టియు బుష్టియు నొసఁగు చుండును. అట్లగుట నానా యరు
ణోదయమునఁ బూలకై తానే వాడుకచొప్పున తోఁటలోని కరుదెం
చెను. దేవసేవయం దాతని కపారభక్తి కావున నిట్టిపవిత్రకార్య
భారమును నాతఁడు భృత్యులపై బెట్టునా?

జాజి, విరజాజి, మల్లె, మొల్ల, గులాబి, కాంచన, పారిజాత,
ప్రభృతి మనోహరపుష్పములను, కోమలబిల్వపత్రములను, తులసీ
దళములను కోసి బుట్ట నింపుకొని నానా యింటిలోని కరుదెం
చెను. తదనంతరము సాంసారిక కార్యముల జక్కపెట్టుకొని నాకిట
నరుగుపైని బఱచినచాపమీఁద కూర్చుండెను. ఇంకను గ్రామము
నఁ గలకొందఱుకులీనులును, మాన్యగృహస్థులును మెల్ల మెల్లగ
నచ్చోట జేరిరి. ప్రతిదినమును సాధారణముగ నీవేళకే వీ రందఱును
గలసికొను చుందురు. వీ రందఱచ్చోట నిరర్థకసమాచారముల
తోను ధూమపానతాంబూలచర్వణములతోను కాలము వ్యర్థపుచ్చక
నానాగారు గ్రామవాసుల చిల్లరతగాయిదాలు విచారణము సల్పి
న్యాయము చెప్పుచుందురు. గ్రామమునందలి సంఘశాసనభారము
గూడ నాతనిశిరముపైఁ బడి యుండెను. గ్రామస్థులకు నానాగా
రనిన భయభక్తులు మెండు. వీనికిఁ గారణ మాతని పాండిత్యము,
ఆదరము, దైవభక్తి, నిస్తులన్యాయపరాయణత్వము, దేవదుర్లభచరిత్ర
ము. కేవలైశ్వర్యసామర్థ్యము వలన మానవున కింతటియౌన్నత్యము
సంభవింప నేరదుగదా!

నానాగారియీపంచాయతీసభావిచారణము నెవ్వరును నిరసించుట
లేదు. కారణమే మన నందఱకి సభపై సంపూర్ణభక్తివిశ్వాసములు

గలవు. అనర్థదాయకము లగుకోర్టుగడప లెక్కి సర్వనాశన మొనర్చు కొనునట్టి మహాపురుషు లెవ్వరు నెన్నఁటికిని ప్రాసియుం డలేదు. ఈ పంచాయతీసభ తీర్పు వలన వాది ప్రతివాదుల కిరువురకును సంతుష్టి కలుగుచుండెను. ఏ దావా పంచాయతీకి వచ్చినయెడ, కొన్ని సాంఘిక అపరాధములు గూడ నిచట చక్కఁగ విచారింపఁబడు చుండును. కొందఱు తాము కొన్ని సామాజిక, ధర్మసంబంధనియమో ల్లంఘన మొనర్చినచో వారివారి యపరాధమునకు దగినట్లు వారి యిండ్లకు చాకలి బట్టలు ఉతుకకుండునట్లును, మంగళి క్షౌరమునకుఁ బోకుండునట్లును, ధూమపానము మొదలగునవి వర్జింపఁజేసియు యథాయోగ్య మగుశాసనము చేయుబడుచుండెను. తిట్లు, దెబ్బలాట మొదలగు కేసులవలన వచ్చుదండనాద్రవ్య మాయూర గల గ్రుడ్డి కుంటి మూగ అనాథ దరిద్రుల సహాయమునకై వినియోగింపఁబడు చుండెను. ఆగ్రామమందున నానావంటియోగ్యుఁడు మఱియొకఁడు లేఁడు. అట్లు గానిచో గ్రామమునఁ గల వారెల్లరు తనపైనింతగ భక్తిశ్రద్ధలు గలిగి యుండరని యెఱిఁగియు గ్రామములోని మఱి కొందఱుశిష్టజనులసహాయము లేకుండగ తా నొంటరిగనే కార్యముల నిర్వహింపఁ గలిగి యుండియు, అతనివలన నెప్పుడు నట్టిపొరపాటు జరిగి జనాపవాదమునకు లోను గా లేదు. అతఁ డేవిషయము నైనను నలుగురెదుగురుబుద్ధిమంతుల సలహాను దీసికొనకుండ విచా రించు వాఁడు కాఁడు. ఈపంచాయితీసభకు వచ్చినవ్యాజ్యములు పరి ష్కరించుట కుదయము సుమారు పదిగంటలవఱకు నానా కూర్చుండి యుండును. తదనంతరము స్నానసంధ్యాది దేవపూజాద్యాహ్నిక కర్మలయందు దాతఁ డభియుక్తుఁ డగును. దేవపూజ సాంత మగునప్ప టికి రెండుజాములు దిరిగిపోవును. పూజ యగుటతోడనే యతఁడు మరల బయట కరుదెంచును. అచ్చోట నిద్దఱుముగ్గు రతిథులు

గూర్చుండి యుందురు. మహానందమున ముందు వారిని భుజింపఁజేసి యనంతరమున నానాఅన్నగ్రహణ మొనర్చును. భోజన మగునరికి సరిగ మూఁడుజాములగును. అతని భోజనమునకు సాధారణముగా ప్రతిదిన మిన్నిధనమున నే యాలస్యమగు చుండును. కారణ మేమన అతిథ్యభ్యాగతుల కై పరీక్షించి గాని యాతఁడన్న స్పర్శ మొనర్పఁడు.

భోజనానంతము రెండు గడియలు విశ్రమించి నాలుగు గంటలునుమూరున కాతఁడు బయటయరుగుమీఁదకు వచ్చి శ్రీమద్భాగవతపఠన మొనర్చుచుండును, నానా వెలుపలకు వచ్చుటకు పూర్వమే చాలమంది శ్రోత లరుగుపై కూడి యుందురు. కారణ మే మన ప్రతి దినము నాసమయమున నట పురాణకాలక్షేపము జరుగు చుండును. ప్రతిశ్లోకార్థమును మిగులస్పష్ట మొనర్చి యాతఁడు వారలకు దెలియ బలుకు చుండును. శ్రోతలధారణశక్తిని బట్టి శ్లోకములవ్యాఖ్యానమును నానాప్రకారము లగు చుండును. ఆయన స్పష్టీకరణమువలన శ్రోతలు మాయామయమును క్షణభంగురమును నగుసీసంసారము నుండి విముక్తులై చిత్తవృత్తులు పరమేశ్వరునియందు మగ్నము చేయుచుందురు. వార లాక్షణమున బ్రహ్మానందమున నోలలాడు చుందురు.

తరువాత కొంతమంది పండితులతో నానావిధశాస్త్రచర్చలు జరుగు చుండును. అట్టియెడ శాస్త్రరహస్యములు శ్రోతలెల్లరకు తేట తెల్లముగఁ దెలియవచ్చు చుండును. నానా అప్పుడప్పుడు తనద్రవ్యము వెచ్చించి దూర దేశములనుండి విద్వాంసులను బిలిపించి, వారివలన శాస్త్రీయసందేహముల నిర్వర్తించికొని వారిని సత్కరించు చుండును. నేటిదినమున నట్టిపండితు లెవ్వరును వచ్చి యుండనందున స్వయముగ శ్రీమద్భాగవతపఠన మొనర్చెను. ఇట్లు జరుగుచుండ గనే సంధ్యాకాల మయ్యెను.

మరల కరపాదప్రక్షాళన మొనర్చుకొని నానా దేవతార్చనగృహమున కరిగి, సంధ్యాదిజపానుష్ఠానములయందు మగ్నుం డయ్యెను. నిత్యకర్మ లెల్ల యథావిధిగ నొనర్చి, భగవత్ప్రసాదమును స్వీకరించి యాతఁడు తద్గృహమునకు జనియెను. అచట వృద్ధురా లగు నన్నపూర్ణ ఫలహారము సిద్ధపరచి భర్త రాకకై యెదురు చూచుచుండెను. ఆయన లోనికి కరుదెంచి ఫలహార మొనర్చుచు గూర్చుండి యుండెను. కొంతవడి కన్నపూర్ణ యిట్లనియెను. "వింటిరా? మనయల్లుఁడు లక్ష్మిని దీసికొనిపోవుటకై వచ్చినాఁడట."

"సంతోషము! మంచిముహూర్తముఁ జూచి సర్వము సిద్ధపఱచెదను."

కాని యన్నపూర్ణ నేత్రము లశ్రుపూరితము లయ్యెను. ఆమె కన్నులు తుడిచికొనుచు నిట్లనియెను. "మనముద్దుబిడ్డ యత్తవారింటి కరుగుట సంతోషవిషయ మగుట నిశ్చయమే కాని, అల్లునిసంగతి మన మెఱిఁగినదే. సంసార మంతకంటె నధోగతి! ఇట్టిస్థితిలో పిల్లనట కంపుటకు నామన సెట్లు లొప్పును?"

"అమ్మాయి యత్తవారింటికి వెళ్ళుటకు మన సొప్పనియెడల నీవుకూడ నామెవెంట నల్లునింటికి వెళ్ళుము. తృప్తికరముగ లేదని పిల్లదానిసుఖమునకు వ్యత్యయము గలిగించుట యోగ్యము కాదు. పతిసేవవినా స్త్రీలకు మఱియొకధర్మ మేమిగలదు."

పాప మామె మఱి మాటలాడ లేదు. ఆమె చాలసేపటివఱకుఁ గన్నులు తుడుచుకొనుచుండెను. కాని యుపయోగ మేమియు లేదయ్యెను. ఫలహార మగుటతోడనే యతఁడు పంచాంగము చేఁబూని కొమరితె నత్తవారింటికి కనుపుటకు శుభదిన మరయుచుఁ గూర్చుండి యుండెను. అన్నపూర్ణ దుఃఖాతిశయమున బిగ్గరగ నేడువఁ దొడఁగెను. భార్యను సమాధానవాక్యములతో నూరార్చి యాయన

యీవలకు వచ్చెను. అన్నపూర్ణ విషణ్ణవదనయై యచ్చటనే నేల పైఁబడి నిద్రించెను.

బయటకు రాగానే సుశీలయును లక్ష్మియును నానాగారిదృష్టిపథమున బడిరి. వెంటనే లక్ష్మి నుద్దేశించి యాతఁ డిట్లనెను. "అమ్మా! నిన్ను దీసికొనిబోవుట కై నీ భర్త వచ్చెను. రాఁబోవుబుధవారము నాటిదెల్లవారుజామున గర్గాచార్యులు శుభముహూర్తమున నిన్నత్త వారింటి కనుప నపుకట్టియుంటిని. ఆదినమున నీవు నీయింటి కరుగ వలసి యుండును. తల్లీ! నేఁజెప్పఁబోవువిషయమును నీవు మనసున నుంచుకొనుము. భర్త మూర్ఖుఁడైనను, కురూపి యైనను, దరిద్రుఁడైనను, మఱి యెట్టివాఁడైనను, సరియె సతికి పతిసేవగాక వేఱొం డుగతి లేదు. సతులకు పతియే ప్రత్యక్షదైవము. బిడ్డా! నేను నీకు మిగులవినయపూర్వకముగఁ జెప్పుచుంటిని. అచటి కేగినపిదప నీవు మనఃపూర్వకముగ భర్తయొక్కయు, మఱియు నవ్విధముననే నత్త మొదలగుపెద్దలయొక్కయు సేవలొనర్చి వారొసఁగుమంగళాశీర్వాదము లందినచో నద్దాన నీకు సకలశుభము లొనఁగూడును."

ఇంతలో నాక్షణదీపప్రకాశమున హతభాగినియగు సుశీలయొక్క యశ్రుపూర్ణముఖముపై యాతని యంతఃకరణము చింతాక్రాంత మయ్యెను. అనాథయెదుట బతిసేవామహాత్మ్యమును గీర్తించుట యుచితము కాదని యిప్పుడాతనికిఁ దోఁచెను. వైధవ్యపంకమున మునిఁగియున్న బాలను సంబోధించి యాతండిట్లనెను.

"బిడ్డా! ఏల నీ విట్లు ఖిన్నవదన వయ్యెదవు? అమ్మా! యిటు చూడుము. వనమున ననేకపుష్పములు పుష్పించుచుండును. కాని వాని కన్నిటికిని దేవసేవాభాగ్య మెట్లుగల్గును? మందిరసుగంధి లము లగుననేకకుసుమములు విలాసినీమణుల యుపయోగవస్తువులై యుండును. కాని వానిలో నేదోయొకపుష్పమాత్రము తన యుత్తి

కేవలము సౌభాగ్యమువలనను, అనుపమపుణ్యఫలములవలనను, దేవునిశిర
ముపైఁ బ్రకాశించుచుండును. కావున తల్లీ! నీ వేల దుఃఖించె
దవు? నిజముగ నీవే భాగ్యవతివి. జనసేవయొనర్చి దేహసార్థక్య
మొనర్చుకొనుటకే పరమేశ్వరుఁడు నిన్ను నిర్మాణ మొనర్చెను.
ఈక్షణభంగురము లగుసుఖములకై నీవు మనసు నెందులకు చలింపఁ
జేసెదవు?"

సుశీలయు, లక్ష్మియు నవనతవదనలై మిన్నకుండిరి. నానా
చప్పున నటనుండి బయటి కేగి కన్నులు తుడిచికొనియెను.

౨౦

ఆదినము మంగళవారము. తెల్లవారుజామున లక్ష్మి నత్తవారింటి
కనుపఁబంచుటచే నానా గృహమంతయు మిగులసందడిగ నుండెను.
బియ్యము, పప్పు, ఉప్పు, నేయి, నూనె, పసుపు, కుంకుమ, చింత
పండు, మిరపగాయలు మొదలగుసంసారోపయోగము లగుననేకవస్తు
వులును, కప్పుకొనుశాలువలు, చీరెలు, రవికలు, ధోవతులు, నుత్తరీ
యములు మొదలుగాగల యితరవస్తువులును దీసికొని తెచ్చి యింటఁ
బెట్టిరి. తప్పేలా, గుండిగ, గిన్నె మొదలగు పాత్రసామానులు
కూడ దీసికొని వచ్చుచుండిరి. లక్ష్మి యత్తవారిస్థితిగతుల నెఱింగిన
వాఁ డగుటచే నామె నత్తింటి కనుపుసమయమున నానాయమిత
ద్రవ్యము వెచ్చించెను! దాదాపాఱుమాసములవఱకు నే సామగ్రియు
కొననవసరము లేకుండ ప్రతిపదార్థమును సమృద్ధిగ స్థిరపఱచెను.
ఇరుగుపొరుగువారీవస్తుసముదాయము నవలోకించి మిగులనచ్చెరు వంది
కూతుండ్ర నత్తింటి కనుపుసమయమున నామెతో నేదోకొంత
పంపుటెల్లరకు సహజమే కాని, యిటులింతవఱ కెవ్వరును నింతటి
విశేషముగ నొసఁగుట లామెచ్చుటను జూచి యుండ లే దనుకొనిరి.
పాప మన్నపూర్ణ యొక్కతేవిధమున శోకించుచుండెను. తన

పుత్రికతోఁ బంపుటకు సిద్ధపఱచి యుంచినయా వస్తువులను వారందఱు జూచి యింత సామానుఁగూడ కొంచెమనుకొనిరింతి దలిగెను. ఆగ్రామ మున స్త్రీలెల్లరు నీదినము లక్ష్మిని జూచిపోవుటకై యొక్కరొక్కరుగా వచ్చుచుండిరి. తల్లిదండ్రులు తన కొసంగుచున్న వస్తువులనామె మిగులప్రేమతోను, ఆదరముతోను నెల్లరకును జూపించుచుండెను. ఆసామగ్రులను గాంచి యాస్త్రీ లెల్లరాశ్చర్యచకిత లగుచుండిరి. గ్రామ మాబాలవృద్ధముగా లక్ష్మిని మిగులఁ బ్రేమించుచుండిరి. "దయయుంచుఁడు. నన్ను మఱువకుఁ" డని మృదుమధుర వాక్యములతో లక్ష్మి యెల్లరికడను సెలవుగైకొనుచుండెను. నేఁడామె హృదయమున హర్ష విషాదములు రెండును ముప్పిరి గొనుచుండెను. ప్రాణనాథుని వెంట సేవయొనర్చుటకై యరుగుచుండెను. అట్లగుట నామె కింతకంటె సంతోషదిన మెుండెద్ది? కాని తలిదండ్రులను, ఆత్మీయులను, ఇష్టసఖులను, ఇరుగుపొరుగువారలను విడిచి నేఁడు పతిగృహమున కరుగుటకై వారిసెలవు గైకొనునప్పు డామె యత్యంత వ్యథిత యగుచుండెను. పిన్ననాఁటనుండియుఁ దన్నుఁ బ్రేమించువారితో గలసిమెలసి పెరిగి, యిప్పుడు వీడి పోవలసివచ్చినందున లక్ష్మి కోమలాంతఃకరణ మెట్లు దుఃఖభాజనము కాకుండును?

నేఁడు లక్ష్మి ప్రయాణసంరంభ మేమని చెప్పవచ్చును! సమస్త సామగ్రు లీవలఁ బెట్టుచుండిరి. కొంచరావస్తువు లెట్లుబంపిన సురక్షితముగ చేరునో యనివిచారించి బండివాండ్రచే నాపదార్థములు చక్కగ బందోబస్తు చేయించుచుండిరి. బాలకృష్ణుని మహదానందమునకు పారమే లేదు. వానిజన్మలో నిట్టివస్తుచయమును పావము వాఁ డెక్కడ నెన్నడును జూచినదే లేదు. అందు విశేషముగ నన్నపానోచితవస్తుసామగ్రు లధికముగ నుండుటఁ జూచి వినాయకుని వెంట నాతనియింటి కరుగుటకు తానుగూడ ప్రయాణ మయ్యెను.

సంధ్యాకాలమునకు వారు గొల్లపల్లె దెప్పించిరి. సామానుల వాని
పై నెక్కించ ముసలివారు. ప్రయాణము పూర్వాకముగ సమస్త సామగ్రు
లును శకటములపై చక్కగ సమర్పితమగుటవలన బాలకృష్ణుఁడు
బండివారలపై నధికారము జూపుచు మిక్కిలి ఉబ్బడ చేయుచుండెను.
సామానులెల్ల నాని గృహమునకే గొంపోవుచున్నట్లున్నది! జాము
రాత్రి గడుగునప్పటికి సామానుబండ్లు ముందుబయలు దేరెను. ఆశక
టముల వెంట నడుగుటకు బాలకృష్ణవంతులు తయారయ్యెను. కాని
నానా విశ్వాసపాత్రుండగు తననౌకరునొక్కని నాబండ్లవెంబడి బం
పుటచే బాలకృష్ణుఁడు పోవలసినయగత్య మేమియు లేదయ్యెను.
ఆరాత్రి బాలకృష్ణుఁడు నిద్రయన నెట్టిదో యెఱుఁగఁడు. ఎప్పుడు
తెల్లవారునో, ఎప్పుడు బయలుదేరుదునని వాఁడు సెజ్జపై నిటునటు
పొరలుచుండెను. తెల్లవారుజాము గునప్పటి కొక్కగుఱ్ఱపుబండి
వచ్చి వాకిట నిలిచెను. బండిచక్రములు కట, కట శబ్దము చెవి బడిన
క్షణమున శయ్యనుండి గుభాలున లేచి బాలకృష్ణుఁడు బయటికి కరు
దెంచెను.

అశ్రుపూర్ణ వెక్కివెక్కి యేడ్చుచుండ నానా యనేకవిధముల
హితోపదేశము లొనర్చి యూరడింపుచు నితరాత్మీయుల వారిం
పుచుఁ జామాతను, తన బండియందు గూర్చుండబెట్టెను. లక్ష్మి
సజలనయనయై జననీజనకులయొక్కయు నితరవృద్ధులయొక్కయుఁ
బాదములపై శిరము మోపి, అనుజ్ఞ వడసి, ఆశీర్వాదము లందికొని
యెను, వినాయకరావుకూడ వారలకు నమస్కార మొనర్చుట
మఱచిపోలేదు. సంతోషభరమున బాలకృష్ణుఁడు మాత్ర మిది మొద
లంట మఱచిపోయెను. ఎవరును జెప్పకుండగనే వాఁడు చెంగున నె
గిరి బండిముందటి భాగమున బండివానిప్రక్క విరాజమానుఁడై
మిగులసంతసమున నెడమచేత నశ్వరజ్జువుల గ్రహించి కుడిచేత మిగుల

తీవిగ కొరడా పట్టుకొని స్వయముగ బండి తోలవలయు నని వాఁడెంతయో ముచ్చటపడు చుండెను. ఇంతలో బండివాఁడు స్వస్థానమున కరుదెంచి బాలకృష్ణుని చేతనుండిన త్రాళ్ళు లాగికొని కొరడా కర్రతో గుఱ్ఱము నదలించెను. వెంటనే శకటమునడచి పోవుచుండెను. లక్ష్మివద్ద సెలవు దీసికొనుట కట జేరినవారు బండి వైపునకు చూడ్కులు నిగిడించి విషణ్ణవదను లై యచట నిలుచుండి యుండిరి. కొంతవడికి శకట మంతర్ధాన మయ్యెను.

౨౧

త్రోవలో విశేష మేమియు సంభవింప లేదు. శకటసారథ్యము సంపాదించుటకొఱకు బాలకృష్ణుఁడుమాత్రము త్రోవపొడుగునను ఉమేదవారీ చేయుచునే యుండెను. తుదకు శకటము వినాయకునిగ్రామ సమీపమునకు వచ్చినంత బండివాఁడు బాలకృష్ణుని వేడికోలున కంగీకరించి, అశ్వరజ్జువుల వానిచేతి కిచ్చెను. మహోల్లాసపూర్వకంబుగ రజ్జువుల గైకొని, మిగులతీవితో కొరడా త్రిప్పుచు బాలకృష్ణుఁడు శకటము నడుప సాగెను. చాలసేపటినుండి వాఁడు శకటసారథ్య కౌశలమును లక్ష్యపూర్వకముగ నవలోకించుట నాపని వాని కేమియు దుస్సాధ్యముగ లే దయ్యెను. వాఁడు బండివానికన్న నత్యధిక గతిని నశ్వముల నడిపించు చుండెను.

శకటము రాజమార్గమును విడచి వినాయకునిగ్రామమున కేగు బాటవెంబడి పోనిచ్చెను. ఈయిరుకయినకొండలనడిమిత్రోవను నవీన సారధి యగు బాలకృష్ణుని బండి తోలనిచ్చు టుచితము కాదని బండివాఁడు కళ్లెము తనచేత గైకొనియెను. అప్పుడుకూడ కొరడా బాలకృష్ణునిచేతియందే యుండెను. నడుమ, నడుమ సకారణముగను, నకారణముగను కొరడాఝుళిపించుచు బాలకృష్ణుఁ డశ్వములపై తన ప్రభుత్వము నెఱపు చుండెను. ఇచ్చోట వా రెద్దుబండ్ల నాల్గింటిని

కలిసికొనిరి. అన్నిటికిని ముందు గుఱ్ఱపుబండియు, వెనుక నెద్దుబండ్లును
మెల్ల మెల్లగ వినాయకునియూరను బ్రవేశించెను. ఊరిలోని బాలురు
తమయాటలు మాని యాశకటములను వెంబడించిరి. కేవలము
బాలురసంగతియేమి? ఒకగుఱ్ఱపుబండియు, వెనుక నాలుగెద్దుబండ్లును
వానిపై సామగ్రులును, ఆచిన్నయూర బ్రవేశింపగనే యాగ్రా
మమున మిగులగడబిడ బయలుదేఱెను. వినాయకుఁడు భార్యను
పుట్టినింటనుండి దీసికొని వచ్చుచుండె ననువార్త యూరెల్ల వ్యాపిం
చెను. గుఱ్ఱపుబండి గ్రామమున బ్రవేశించుటకు సరియైనకారణ మిప్పు
డందరికిని దెలియవచ్చెను. అప్పుడుకూడ సామానుబండ్లను
గాంచి యివి యెందులకో యని వారు విస్మయ మొందక పోలేదు.
ఈవిషయ మాగ్రామమునలుగడల శబ్దమాత్రముతో ముగియ లేదు.
ఆశకటపంచకమును గాంచినవా రందఱు విస్ఫారితనేత్రములతో
నొకరినొక రవలోకించుచు వానివెంట వినాయకునిగృహము సమీ
పించిరి. నేడు రాధ యానందమున కవధియే లేదు. వెఱ్ఱిదానివలె
నాముదుసలి బయటికి పరుగెత్తికొని వచ్చి, కోడలిని బండినుండి
దింపి, మహాదరమున బ్రేమ దొలుకాడ నామె నింటిలోనికి దోడ్కొని
పోయెను. ఇంటికెదురుగ నానాల్గుసామానుబండ్లు వచ్చి నిలువ
బడెను. ఇంతవఱక నామెదృష్టి యావంక కరుగనే లేదు వాకిట
గూడిన యిరుగుపొరుగుస్త్రీ లెల్లరు రాధవెనువెంటనే గుంపులుగుంపు
లుగ గృహప్రవేశ మొనర్చిరి. వినాయకుఁడు మామగా రొసఁగిన
విలువవలువలపెట్టెను పరిచారకునిచే మోయించుకొని గృహమునఁ
బ్రవేశించెను. అందఱు నిలు జొచ్చినంత బండ్లలోనిసామగ్రిని బది
లముగ వడివడి దింపి, చెదరకుండ నొక్కచో బెట్టు డని బాలకృష్ణ
పంతులు బండివాండ్రపై తనయధికారము జూపుచు కేకలిడుచుం
డెను. బండ్లలో గలవస్తుసముదాయమును గాంచి మిగులవింతపడి

తదేకదృష్టిని బరికించుచు నచట నిలుచుండి యున్నవా రందఱు బాలకృష్ణు నొంటరిగ జూచి మిగులనుత్సాహముతో వాని నెన్నియో తెన్నుల బ్రశ్నింపసాగిరి. బాలకృష్ణుఁడు గంభీరస్వరముతో "ఏమయ్యా యిట్లడిగెదరు? ఇదియంతయు మాదే!" యనెను.

బాలకృష్ణుని యీవిచిత్రప్రత్యుత్తర మాలకించి యాట నిలిచియున్నవారిలో నొకగృహస్థ యిట్లనియెను. "ఇదియంతయు మీదే! సరియైనచో నిక్కడ కెందులకు? నీయింటికే కొనులకు తీసికొనిపోవేమి?"

"ఓహో! ఇది నాయిల్లు కాదా?

"ఏమి! ఇది నీయిల్లా! అదెట్లు?"

"ఏమయ్యా! అట్లు మాట్లాడెదవు? ఓప్పాడా వినాయకరావు గారిభృత్యుఁడను. అట్లగుట నీయిల్లు నాది కాదా?"

"ఇక్కడేదైన దుకాణముగికాణముపెట్టుట కాలోచించితి వని తలఁచెదను."

బాలకృష్ణునకు మిగులరోషము వచ్చెను. వాఁడు కోపావేశమున నిట్లనెను. "తిరుగ నే నంగడిపై చాకిరీ చేయుచు ననుకుంటిరా? ఏమి మీబుద్ధిజాడ్యము? వాగవాగ! ఈసామగ్రి నంతయు మాయన్న మామగారు మాపదెనెకు సారెగా నిచ్చి పంపిరి. ఇప్పుడైన దెలసినదా లేదా?"

"ఏమీ!"

ప్రశ్నించినగృహస్థు ఏమీ, మాత్రమని మిన్నకుండెను. మఱి యొకమాట వానినోట రాదయ్యెను. ఆతఁడు నోట వ్రేలుఁజొనిపికొని తెల్లబోయి చూచుచు గూర్చుండెను. అట గలతక్కిన వారందఱుకూడ నదేయవస్థయందుండిరి. బాలకృష్ణుఁ డానల్వురుబండివాండ్ర చేతను సామగ్రిని లోనికి బంపి, అటనున్న వారిలో నెవ్వరైన నేదేని దొంగిలింతు రేమో యనికాబోలు తానుబయట పహరాయిచ్చు

గృహమున గల రెండు మూడు గదులు సామానులతో నిండిపోయెను. ఆగంతులకు నిలుచుటకైన స్థలము లేదు. బాలకృష్ణుడు లోని కరుదెంచి చూచునప్పటికి సామానంతయు చావడిలో న స్తవ్యస్త ముగ బడియుండెను. వాని నెత్తి వాడు చక్కగ సమర్చుచుండెను. కోడలు సారె గొనవచ్చిన చలిమిడి, కొబ్బరి, పసుపు కుంకుమము నిరుగుపొరుగువారలకు పంచిపెట్టుటకై రాధ మిగుల తొందరపడుచు స్వయముగ నాపని నెఱవేర్చుచుండెను. తనకు సహాయార్థము బాల కృష్ణుని కూడ బిలిచెను. కాని యిట్టి రుచ్యము లగు మధుర పదార్థములు చేతినిండుగ నందరకుం బంచిపెట్టుటకు వానికి మనసెట్లొప్పును! వాడందులకిచ్చగింపడయ్యెను. కాని రాధయుత్సాహ మీదినమున నపూర్వముగ నున్నదే! ఆమె తలయెత్తి బాలకృష్ణునివంక చూ[illegible] తోచెను.

ఆగంతుక స్త్రీపురుషులెల్లరు ఆహాహా యను మెఱమెచ్చులతో దీక్షితుల గృహము ధ్వంసముజేసిరి. ఏగడియయందుం బట్టిస్థిత్యంతరము కలుగునో యని చెప్పుటకు సాధ్యము కాదు. గడచిన మూడేండ్లలో [illegible] బంధుమిత్రులు చుట్టములు నితరులు నాయింటివంక గన్నెత్తి యైనను జూడలేదు. వాగ యీదినము, రాధమ్మ చిన్ని రాధమ్మ

పిన్నిగాని కలుపుగోలుతనమున నిచ్చకము లాడసాగిరి. క్షణము లోపల నాచిన్నయూర పెద్దసందడి బయలుదేరెను. తరుణవృద్ధ బాలికా నాయికులకోలాహలధ్వనులతో నినాదముకొని యి ల్లెగిరిపోవు చుండెను. లక్ష్మియొక్కయు, నామెతల్లిదండ్రులయొక్కయు ప్రశంసతో భూమ్యాకాశము నిండిపోవు చుండెను. ఎవరినోటనుండియు మఱియొకవిషయము వినవచ్చుట లేదు కాని యిరుగుపొరుగువార లెనలేనితమయామోదమును గనపఱచు చున్నను దానిలో శతాంశ మైనను వారియంతర్యామి యదార్థ మని యొప్పుకొనజాలదు. అనేకులహృదయము లీర్ష్యానలముచే దగ్ధ మగు చుండెను. కలహకలా విశారద యగువరాళసాబాయి సక్కుబాయి మొదలగుకలహప్రియు లనేకసతులకరీగ నారాత్రి కంటతెత్తిపోవు చుండెను. పాపమువారికి నిద్రకూడ పట్టలేదు.

## ౨౨

ఆరాత్రి అనేకు లెటు లీర్ష్యానలముచే దగ్ధులై జాగర మొనర్చిరో యటులే యానందాతిశయమున సదాశివునితల్లియుఁ గనులుమూయ లేదు; రేయియంతయు మంచముపై నటునిటు దొర్లుచునే యుండెను. తెల్లవారుచుండగాఁ గొంచెము కూర్కు వచ్చినమాట నిజమే కాని యదియు సుఖస్వప్నపరిపూర్ణము. అరుణోదయమునను లేచి రాధ గృహకృత్యములు నిర్వర్తింపఁ బ్రారంభించెను. కాని ఆమె నలికనవూడ్చి, కలాపుచల్లుచుండగనే లక్ష్మి లేచివచ్చి యావృద్ధు రాలి హస్తమున గలబిందెను దీసికొనియెను. అంత రాధ "తల్లీ! నేను నిన్నేమియుఁ బనిచేయనీయ" ననెను.

"మఱి నన్నెందుల కిటకుఁ బిలిపించితిరి?"

"నేను మాయమ్మ నిటకుఁ దీసికొనివచ్చినది గృహకృత్యములు నిర్వర్తించుటకుఁ గాదు. నీవు నాగృహలక్ష్మి వని పిలపించితిని. అమ్మా, ఈమాత్రపుపని నావలన నెఱవేఱక పోవునా!"

"అత్తయ్యా! మీరిట్లనఁజెల్లునా? మీ పాదసేవ సేయు భాగ్యము నాకు దొరుకు ననునాశచేఁగదా నేనిటకు వచ్చితిని. నేను కూర్చుండి యీయింటిపనియంతయు మీచేఁ జేయింపనా?"

ఇప్పటికి నావృద్ధురాలి యజ్ఞానము పోలేదు. కోడలి వినయభూషణముచేతఁగూడ రాధ నేత్రద్వయము నిండిపోయెను. కాని యవి యానందాశ్రువులు. కన్నులుదుడిచికొని రాధ యిట్లనెను. "నాకష్టమునకు వగచి యెవ్వరేని రెండుకనికరపుమాటలు పలికిన నంతియే చాలును. నే నిట్టిసంసారములు పదియైన నొక్కచేతిమీఁద నిర్వర్తింపఁగలను. నేనేమి పనికి వెఱచుదాననా! ఆడుపుట్టుకఁబుట్టి పనికి జంకిన నెట్లు?"

"నే నిటనుండ మీరే యీపనినంతయుఁ జేయుట భావ్యమని మీకుఁ దోఁచినా? మీరిఁక గూర్చుండి యెట్లొనర్పవలెనో నాకానతిండు. ఈదినమునుండియు మీకు గల గృహకృత్యనిర్వాహణోత్సాహము సంక్షేపించి విశ్రాంతి గొనుడు."

చిన్నకోడ లెంతయో ప్రార్థించి యత్తగారిచేతిలోని బిందెను, చీపురును దీసికొన నాలుగైదుమారులు ప్రయత్నించెను. గాని యెంత బతిమాలికొన్న నావృద్ధురాలు వినదయ్యెను. తుద కుపాయమేమియు లేక చిన్నకోడ లామెకు సహాయముచేయఁ దొడగెను. ఆవశ్యక మగునిత్యకృత్యములు సాంతమయినంతనే లక్ష్మి గృహమున నచ్చటచ్చట శిథిలములయిన భాగములు బాగు చేయఁ జొచ్చెను. పుట్టినింటినుండి వచ్చిన బాలకృష్ణుని సహాయముగఁ గొని యామె యింటిలోని కసవు మొదలగువానిని దీసివైచి నేల మిట్టపల్లములు లేకుండ సమముచేసెను. గోడలలోని రావి మొక్కలు, జువ్వి మొక్కలు, గరిక మొదలగువానిని దీసివైచెను. ఇదియంతయు సాంతమగునప్పటికి రెండుజాములు తిరిగిపోయెను. కోడలియొక్క శ్రమగాంచి

నంత నావృద్ధురాలి యొక్క యంతకరణము క్షోభించెను. కాని యింతటియల్పావకాశమున జరిగిన గృహపరివర్తనమునుజూచిన మీఁద నామె కపారానందము కలిగెను. ఆకుగ్రామమునందు వివాహాదిశుభ కార్యముల కేప్రకారము గృహముల నలంకరింతురో యంతకన్న నిను మడిగ దీక్షితుని గృహమున నేఁడు నిత్యకళ్యాణము పచ్చతోరణముగ గనుపించు చుండెను.

భోజనానంతరము నాఁడు లక్ష్మి యొక నిముసమైనను విశ్రాంతి గొనలేదు. శయనగృహము సుసజ్జితము చేయ మొదలిడెను. ఏవస్తువు లెచ్చట నుండవలయునో యెచ్చటనుంచిన శోభించునో యాయావస్తువుల వానివాని యోగ్యస్థలములం దుంచెను. శయ్యా మొదలగునవి నూతనశోభ దాల్చెను. ఇవ్విధముననే యొకదాని తరువాత నొకటిగ నాయింట గలపడకగదులు మూఁడును పరిశుభ్రపఱచి వానిలో వస్తువుల తగుచోట్ల నునిచెను. దీక్షితుని గృహస్థితి పూర్వము త్యంతశోచనీయమైయుండెను. లక్ష్మి దినమింటకాలు పెట్టిననాఁడే మరల క్రమమైనస్థితికి వచ్చెను. తనజనకుఁడొసఁగిన ద్రవ్యమున గొంతభాగ మీపనులు జక్కబెట్టుటకై యామెవినియోగించెను. సుందరిచావడికూడ వచ్చుపోవువారు కూర్చుండుట కనువగు రూపమును దాల్చెను. లక్ష్మి యట కరుదెంచిన వారముదినములతరువాత నొకనాఁడు దీక్షితుని గృహబాహ్యాభ్యంతరరూపములను జూచి యాయిల్లెవరిదో వెంటనే గుర్తించుట కొకానొక గృహస్థునకు దుస్సాధ్యమయ్యెను.

ఇచ్చట వినాయకుని స్థితి యెట్లుండెనో కొంచెము పరికింపవలెను. భార్య వచ్చినప్పటినుండియు నిల్లంతయుఁ బరిశుభ్రమయ్యెను. వంటయిల్లుకూడ మిక్కిలి యారోగ్యనిలయమై యుండెను. అవసరమగు నపుడు పావలో అర్ధో భార్యవలనఁ జేతపడుచుండెను. ఇది యిట్లుండ

పరిచారికవలె నామె పతి సేవాతత్పరురాలై యుండెను. ఇంతవరకితఁడు భార్య నంత కనుపెట్టి భయపడుచుండెడువాఁడు. క్రమక్రమముగ నిప్పు డా భయమును బోగొట్టుకొనుచుండెను. ఇంటికి వచ్చును. తనయర్ధాంగి తో సేవింపఁబడుచున్న సౌభాగ్య ముచ్చటించుచును, యథాశక్తి యుక్తముగను నామె యాలోచన చేసికొని సంకోచన పూర్తి చేసికొనుటయు గూడ సంభవించుచుండెను. ఇవ్విధమున వినాయకుని మనసున గలపత్నీ సంబంధమగు భయము మెల్లమెల్లగ తగ్గుచుండెనో యటులే ప్రీతియు ప్రణయమును తత్ప్రదేశమున నుదయము నొందుచుండెను. మనఃపూర్వకముగఁ బ్రవర్తనమొనర్చి ప్రేమించినచో వశముకాని ప్రాణి యీధరాతలమున నెందును గానరాదు. వినాయకుఁడు మూర్ఖుఁ డయ్యును వాని యంతరంగకరణమున పరోపకారప్రకృతియు, ఇంకఁ గొన్ని సద్గుణములును వాసముచేయుచుండెను. ఇట్టి మనుజునిహృదయము సంతతప్రయత్నము వలనను, నిష్కాపట్యమువలనను, మనఃపూర్వకముగను ప్రేమించినచో స్వాధీనముకాక పోవునా!

వినాయకుఁడు యథేచ్ఛముగ రెండుపూటలను భోజనమొనర్చి తృప్తిగ గంజాయిత్రావి గ్రామమంతయు నిరర్థకముగఁ దిరిగివచ్చుచుండును. సంసారసంబంధములగు పనులు లేశముగూడ నాతఁడొనర్చుటలేదు. గృహిణియగు లక్ష్మి యొక్కనాఁడైన నిదేమని భర్తను నిస్సారముగాని, సామాన్యదూషణగాని యొనర్చుటలేదు. మీఁదుమిక్కిలి నామె సంసారపరిపోషణార్థమై శ్రమపడి యావశ్యక పదార్థములు స్వహస్తమున సిద్ధపఱచి యుంచును, ప్రతి విషయమున నామె ప్రాణపదముగ మనఃపూర్వక శుశ్రూష లొనర్చుచుండెను. ఈకారణమువలననే వినాయకునకు, పత్నివిషయక మగుభయ మంతర్ధానమయ్యెను. మెల్లమెల్లగ వినాయకునకు భార్యయందు లక్ష్యమేర్పడెను. ఆమెవిషయమై వానిమనసున పూర్ణప్రణయమును, అత్యంతా

దరమును జనించెను. క్రమక్రమముగ సంసారకృత్యములను గాని మన మాకర్షించుచుండెను. వినాయకుండు పూర్వము వలె నూరంతయు నిరర్థకముగ తిరుగుట మెల్ల మెల్లగ మానుచుండెను. పరమ దక్షయు, గృహిణీమణియు నగులక్ష్మియు సంసారకృత్యముల భారము నొక్కటొక్కటిగ భర్తపై వైచుచుండెను, వినాయకుఁడును మెల్లమెల్లగఁ బనిపాటులు చేయుట కలవాటుపడు చుండెను. పూర్వము వినాయకరావు కృశదేహుఁడు, మలినవస్త్రధారియునై యుండెను. కాని యోగ్యురాలగు భార్యయతిజాగ్రత్తగఁ జూచుకొనుటవలన వానిశరీరము చిక్కబట్టెను. వాని మలిన వేషము మాయమయ్యెను. వినాయకుఁ డిప్పుడు దేహపుష్టిగలిగి స్వచ్ఛవస్త్రధారణ మొనర్చి, సంసార కార్యములందు శ్రద్ధ జూపుచుండెను. కుమారుని పరివర్తనము గాంచి రాధ యత్యంతసంతోషితస్వాంత యయ్యెను. ఆవృద్ధురా లెల్లరితో నిట్లనుచుండెను. “మాలక్ష్మి పుట్టినదెల్ల ముత్యము, పట్టినదెల్ల బంగారము సుమా! మాతల్లి చేసిపైఁ జేయి వైచినను బంగారము గావలసినదే.”

గ్రామమునగలవారు దీక్షితుని కుటుంబమున నీయాకస్మికస్థిత్యంతరమునకు శ్రేయోదాయిని యగులక్ష్మి కారణభూతురాలని యేకవాక్యముగ నామెను బ్రశంసింపసాగిరి. ఊరిలో ముగ్గురు నలుగురొక్కచో జేరిన చాలును దీక్షితుని చిన్నకోడలి ప్రశంసావృత్తాంత మటరాకుండు టెన్నటికిని సంభవింపదు.

ఇవ్విధమున లక్ష్మి మూడునాలుగుమాసములు సంసారశకటమును సుమంత్రితముగ నడపెను. ఆమెతల్లిదండ్రులు తమకుమార్తెను బంపుమని చాలమారులు రాధను వేడుకొనిరి. కానిరాధయందుల కొప్పుకొనలేదు. కాన వేరు తెఱవుగానక వా రా యాస వీడిరి. అట్లయ్యును నడుమ నడుమ మనుష్యులనుబంపి పుత్రికయోగక్షేమములఁ దెలిసికొనుచుండిరి.

ఇచట సదాశివరావు, మాధవరావు, కంట్రాక్టుపని చేయుచుండెను. కాని ఇంటికర్చుకై యింతవఱకు కొంత సొమ్ము పంపవలయు నని పాప మాతని కెప్పటికిని స్మరణకై నరాలేదు.

౨౩

చిన్నకోడలు సంసారభారమంతయు వహించి శిథిలావస్థలో నున్న సంసారశకటమును ఇప్పటికి దాదాపు నాలుగుమాసములనుండి సుయంత్రితముగ నడుపుచుండెను. జనకుడమితముగ వస్తునముదాయ మొసగినందున నింతవరకు సంసారమునం దెట్టిలోటుపాటును కలుగ లేదు కాని అదియేమి కల్పతరువా! సంవత్సరము పొడుగున నెట్లు గడచును? ఇంతవఱకు సదాశివునికడనుండి యే మయిన కర్చుకు వచ్చియుండినచో వీలుగనుండెడిది. అయిదారుమాసములయినను నొకయురకా నయినను వచ్చియుండలేదు. ఎట్లయిన కర్చుతప్పదు గదా! తనెంత యోజించినను సంసారము గడచుమార్గ మేమియు గానరాదయ్యెను. అట్లగుటచే జనకుడొసగిన తొడవుల విక్రయింప నామె కృతసంకల్పయయ్యెను. అత్తగారికి కూడ నీవిషయ మెఱింగించెను రాధయిూపలుకులాలించి విస్మితయై "అది యెందుకె తల్లీ! నాబొందెలో ప్రాణమున్నంతవరకు నిన్ను నగలమ్మనీయ" ననెను. అత్తగారికి కష్టనిష్ఠురములన్నియు దెలియజెప్పుచు "నామాటాలకిం పుడు. మీరిట్లు గట్టిపట్టుబట్టి కూర్చుండకుడు. నావద్ద నిప్పుడు కొలదిపైకముమాత్రమే మిగిలియున్నది. దానితో రెండుమూడునెల లయిన జరుగునని తోచదు. మఱిముందుగతియేమి." యని లక్ష్మి పలికెను.

ఆమెగుసలికి డగ్గుత్తిక బడియెను. ఆమె సజలనయన యై "అమ్మా! జరిగినంతవరకు జరుగనిమ్ము. ముందుగతిముందు. తరువాత నేదోయొకనగ తాకట్టుపెట్టినచో గొన్నిరోజులు గడచు" ననెను,

“తాకట్టుగీకట్టు పెరెత్తవలదు. తాకట్టుపెట్టుటచే మనవంతు దానివలన మిగిలిననగలన్నియు కూడ నాశనమగుట తప్ప వేఱు లాభము లేదు. సంసారము నడుపుటకు దీనివలన చిన్నమెత్తు ఉపయోగ మయినను లేదు. కావుననిప్పుడే యీవస్త్రాభరణములు నొక్కపరి విక్రయించితిమేని [illegible] రెండువేలరూపాయలవఱకు రాగలదు. ఇపుడు ధాన్యపుధర తగ్గుగానున్నది. కావున మన [illegible] ధాన్యము ఖరీదు చేసిపెట్టి, మరల యెప్పుడు ధాన్యపుధర హెచ్చునో యపుడు జాగరూకతతో విచారించి విక్రయించినట్లయిన లాభము రాగలదు. దానివలన సంసారయాత్ర గడుపవచ్చును. ధాన్యము మనయింటనే నిలువజేసికొందము. నగలిట్లు దాచుటకన్న ధాన్యము దీసికొని దాచి యుంచుట సరికాదనియా మీయభిప్రాయము?”

కోడలి దూరదర్శిత్వమువలన వృద్ధురాలు చకితయై శాంతస్వరమున ని ట్లనియెను:

“అమ్మా! నీవు చెప్పినదంతయు నిశ్చయమే. కాని మన మూడు వాండ్రము. ఇంక నేమగునిసంగతియున్ననో గృహకార్యముల చక్కబెట్టగలవాఁడే కాని యిట్టి వ్యాపారాదుల కక్కరకు వచ్చువాఁడు కాఁడు. వర్తకమునకు కల్లబొల్లిమాటలు ప్రధానము. సరే ధాన్యమిప్పుడు ఖరీదు చేయువారెవ్వరు? ధాన్యము మంచిచెడుగులు చూడగలవారెవ్వరు? సరిగా బేరమాడువారెవ్వరు? దీనికంతకు చురుకైనవాఁ డెవ్వఁడైన కావలయును. లేనిచో నిష్కారణముగ నష్టపడవలసివచ్చును.”

నష్ట మెందులకు వచ్చును? మనమూడువాండ్రమయినంతమాత్రమున నీమాత్రపువ్యాపారము సేయ జాలమా? మఱియు మనశాల కృష్ణుఁడు ఇంగులచాకచక్యము కలవాఁడగుటచే మంచిచెడుగులు పరిశీలించుట, బేరమాడుట, మొదలగుకార్యము లన్నియు వానివ [illegible] చేయునని నాకు గట్టినమ్మకము.”

ఇంతలో "ఏమువదినే, ఏమిశ్రేయము!" అని కేకలిడుచు బాలకృష్ణుం డటకు వచ్చెను. బాలకృష్ణుని కిష్టముగా దనని, అత్తగా రనియు, వినాయకుని అన్నా యనియు, లక్ష్మిని వదినా యనియుం బిలుచుట పరిపాటియయ్యెను. ఆమె మందహాసముతో "ఏమిరా బాలకృష్ణా! మేమిప్పుడు ధాన్యవ్యాపారము చేయుచుంటిమి. నీకు దాని సంగతి సందర్భము లేమయినఁ దెలియునా?" యని యడిగెను.

బాలకృష్ణుఁడు సంతోషితస్వాంతుఁడై "ఇది యేమిప్రశ్నము వదినే? నాది కృషికవృత్తియై యుండ, నీవని నాకే తెలియనిచో నీప్రపంచమున మఱియెవ్వరికి దెలియును?" యనెను.

అంత రాధ "మనవానికి తెలివితేటలకు లోపము లేదు. అందె వేసిన చేయిరా" యనెను.

అందుపై లక్ష్మి యాశ్చర్యచకితయై "ఏమంటివి? నీకు వ్యవసాయ వృత్తికూడ తెలియునా?" యని వానిని బ్రశ్నించెను.

బాలకృష్ణుని వయస్సు రమారమి పదునేను సంవత్సరములు. కాని వాఁడు కొంచెము మాటకారితనము నేర్చియుండెను. ఆతఁ డుత్సాహపూర్ణస్వరమున నాతఁ డిట్లనెను. 'కర్షకులుగా బుట్టి పెరిగి వ్యవసాయపుఁబను లెఱుఁగకపోవుటసిన తల్లిదండ్రుల పేరుప్రతిష్ఠలను నిలువబెట్టుటయే!"

అంతట లక్ష్మి యత్తగారివంక దిరిగి యిట్లనెను. "వింటిరా మన బాలకృష్ణుఁ డేమనుచున్నాఁడో! నే వీనిని చేతిక్రింద నుంచుకొని వ్యవసాయమును, ధాన్యవ్యాపారమును జేయ సమకట్టితిని-నాయాభరణవిక్రయమునకు మాత్రము మీ రనుమతించిన చాలును."

కడకు వేఱుపాయము గానక రాధ యందుల కనుమతించి యిట్లనెను. "నీ వంటి సద్గుణసంపన్న యగుబిడ్డకు ఏమి యసాధ్యము? కాని బిడ్డా! నీయాభరణములు మరల నేర్పడనిచో నామనసు

స్వతంత్రత నొందఁజాలదు. పోనీయేవిధమైన రెండుగుల్లలు నేనైనను జేయించిపెట్టుదమనినను—ఉన్నది తుడిచి పెట్టుకటప్పు—మించిపోయిన యిప్పుడు నాచేతిలో శక్తి లేదు. అయ్యో! ఏమి చేయుదు! దైవము నానుదుట నిట్లు వ్రాసినాఁడు హా అమ్మా! నీయిష్ట మెట్లో యట్లే సంతోషముగ నొసఁగుము." వృద్ధురాలికంఠము గద్గద మయ్యెను. కన్నులనుండి యశ్రుకణములు బొటబొట జారెను. ఆమె ప్రేమాతిరేకమున తన చిన్నకోడలిని కౌఁగిలించుకొని ముంగు దువ్వి, చెబుకము పుణికి, ముద్దాడెను.

రెండుమూఁడు దినములలోపుగనే పరిచితుఁ డగునొకకమసాలిని బిలిపించి వానిద్వారా లక్ష్మి తన సొమ్ములను విక్రయించెను. అత్తగారు వెనుక కూర్చిండి పోరుచు వారలోఁ గొన్నినగల నమ్మనిచ్చినదికాదు. మిగులనవసర మగునాలుగైదింటి నట్టే యుంచెను. మిగిలినవానికి రమారమి ౧౬౦౦ రూపాయలు వచ్చెను. ఇప్పుడు పుష్యమాసము. అందుచేత నీసంవత్సరము పంటలు చక్కఁగ ఫలించెను. అట్లగుట ధాన్యము విపులముగ నుండెను. లక్ష్మి పదునయిదువందల రూపాయలు బెట్టి సుమారు నలుబదియైదుపుట్లధాన్యము ఖరీదుచేసి కొట్లలో బోసి నిలువ జేసెను. దీక్షితులునిస్వార్జితములో గొంతభూమి గలదు. ఈభూమి స్వల్ప మగుమక్తాకు రైతున కమరఁబడి యుండెను. ఆరైతునొద్దనుండి యాభూమిని దీసికొని స్వంతముగ వ్యవసాయము చేయింపనారంభించెను. ఆభూమియందు కొంతవరకు తోఁట కూడ గలదు. అందుచెఱకు, మొక్కజొన్న, వంగ, కంద, చామ మొదలగువానిని పైరుపెట్టిరి. బాలకృష్ణునివయసు స్వల్పమైనను బుద్ధి యతితీక్ష్ణము మిగులచురుకైనవాఁడును. ఒడలు వంచి పాటుపడువాఁడు నగునొకనౌకరును బాలకృష్ణుఁడు సాయముగఁ దీసికొని యాభూవ్యవసాయపుపనులయందు నియుక్తుఁ డయ్యెను. వినా

యొక రాత్రివరకు మెల్ల మెల్లగ నా [illegible] దెలిసికొను చుండెను.

సదాశివుం డర్ధరాత్రి [illegible] నోరు [illegible] వచ్చి యుండలేదు. అట్లయ్యు లక్ష్మి [illegible] సారము తో ఓపికయు గలుగ దయ్యెను

౨౮

“హృదయేశ్వరా! నా తనువు, ప్రాణము, ధనము సర్వమునుగూడ మీ యధీనమై యున్నది. నా దేహముపై నను, నా ప్రాణముపై నను, నిప్పుడు నాకావంతయును అధికారము లేదు. మీరే నిశ్చయముగ వానికి పాలకులును, యజమానులు. మీ సుఖమే నా సుఖము. మీ దుఃఖమే నా దుఃఖము! ఈ ప్రపంచమునం దిప్పుడు మీరుగాక మఱియే పదార్థమును నాకుఁ బ్రియము కాదు. మీరెట్లు చెప్పిన నే నట్లొనర్తును. మీరేది కోరిన నేనది యిత్తును. మీకేమి కావలయును? మీ యాప్సితము నెఱవేర్చుట కీదాసి——”

“మనోహారిణీ! నా యాఱవప్రాణమా! నేను ప్రేమాభిలాషిని. ప్రేమక్షుధ నన్ను దహించివేయు చున్నది. ఈయాచకునకు ప్రేమ భిక్షము కావలయును. మఱేమియు వలదు. ప్రేయసీ!”

ఒక్కయువతి కటాక్షయుక్త మగు మధురహాస మొనర్చుచు నొకయువకుని మెడపైఁ జేయివైచి ముద్దులొల్కుతియ్యనిపల్కులఁ బల్కుచుండ యువకుఁడానందవిహ్వలుఁడై పై విధమున బ్రత్యుత్తర మొసఁగెను.

ఆతరుణులు రమణీయ మగు దివాన్ ఖానాలో సుందర మగు సోఫాపైఁ గూర్చుండి యుండిరి. ఈదర్శనగృహము ప్రశస్తమై యుత్తమ ప్రకారమున శృంగారింపఁబడి యుండెను. గొప్పచిత్రకారుఁడు తనకుఁ గలచాతుర్య మంతయు వినియోగించి మహాకౌశలమునఁ

నాటికి [illegible] యువయువతీపటములు మనోహరములగు [illegible], కాని కొంతసిగ్గు! ఎట్టిదృఢమనస్కులకైన నాచిత్తరువులు మనశ్చాంచల్యము గలిగింపక మానవు. ఇది గణికా గృహము కాని వేఱుగఁ జెప్పవలయునా?

ఈతఁడు మాధవరావు. యువతి మాధవుని గ్రామవాసిని యగుతార యనుప్రఖ్యాతవారవనిత.

ఆదినమురాత్రి మాధవరావు కోపావేశమున తనబాలసహధర్మిణి యగుమనోరమను పదాఘాత మొనర్చి యీతారమందిరమునకు వచ్చి దాఖలయ్యెను. ఇంతకుముందొకప్రాణమిత్రుని వేడికోలువలన తారపాటవినుట కొకసారి యిట నీతఁడు వచ్చి యుండెను. ఆ సందర్భమున నిరువురకుఁ గొంతపరిచయము గలిగెను. మాధవరావు తనగృహమునకు వచ్చినతోడనే తార వాని నెంతో సన్మానించెను. తారలోకోత్తరలావణ్యమును గాంచియు, కోకిలస్వరమును విని యు మాధవరావు మిక్కిలిసంతసించి మోహపాశబద్ధుఁ డయ్యెను. దౌర్భాగ్యవశమున లజ్జాశీలయు, బాలికయు నగుమనోరమ పతిప్రేమాప్రవాహమును తనదెసకు మరలించుకొనుట కసమర్థ యయ్యెను. నాతియేమి చేయఁ గలదు? మాధవరావుమనను తారచే నాకృష్ట మయ్యెను.

ఏదేనికృత్యమున ప్రవృత్తుఁ డగుటకుముందు దానివలన గలుగఁబోవు సాధకబాధకముల సప్రమాణముగ మనసున వితర్కించియు మనసు నెట్లో సమ్మతింపఁ జేసి, దానికి యుత్తేజ మొసంగుటకు బ్రతివాడును బహుల గంద్రగోళపడుచుండును. కారణ మేమన మానవునకు చిత్తచాంచల్య మంకురింపఁగనే సదసద్వివేకబుద్ధి లోపలనుండి యొక్క తీవిధముగ బోధుచు చుండును. అదిసహించుట బహుకష్టము. బాలిక యగుమనోరమ భర్త కనుజ్ఞ యొనర్చి

గంభీరాపరాధము జేసి యుండుటచే మాధవరావున కాగ్రహము జనించెను. తత్కోపభరమున పాపము బాలికయెడ గాఁగ దీర్ఘకోపిష్టుఁడై మాధవరావు పాపపంకిలమున నురికెను. ఇందు తన దేమియు దోషము లేదనియు, సర్వదోషములకు మూలము తనపత్ని మనోరమయే యనియు, అట్లగుట నీసందర్భమున నెట్టిపాతకము సంభవించినను నాపాతకములకు బాధ్యురాలు మనోరమయే యనియు నామూర్ఖుఁడు స్థిరపఱచుకొనియెను. పాపకార్యమున కుద్యుక్తుఁ డగువాఁడు తనకు తగినట్లుగ నేదోయొకసిద్ధాంతము చేసికొని పాప కర్మమునకు భీతిల్లుమనమున కుత్తేజ మొసఁగును.

మాధవరావు సుశిక్షితుఁడయినను చిన్నతనమునుండి యెల్లరకు ముద్దులాఁడగుటచే నాతఁడు పూర్ణస్వాతంత్ర్య మనుభవించుచుం డెను. పైన పెద్దవా రుండుటచేతను, పూర్ణశ్రీమంతుఁడై యుండుట చేతను నాతఁ డెవ్విధ మైనశారీరక, మానసికకష్టముల నెఱుం గఁడు. యౌవనకాలమున ప్రణయతృష్ణప్రాబల్యము నొందుసమయ మున లజ్జాన్వితయు, బాలికయు నగుమనోరమవలన వానిపిపాస తీరి నదికాదు. భార్యవలన ప్రణయలాభము నందుట యశక్య మని మనసున సిద్ధాంతము చేసికొని యాతఁడు జ్ఞానశూన్యుఁడై పోయెను. వానివిద్యయు, బుద్ధియు, జ్ఞానము నొక్కమారు నశించి పోయెను. వీనితో నపరాధిని యగునా కోమలబాలిక సౌఖ్యము గూడ నాశన మై పోయినది!

ఈరోజులకు మాధవరావు తారకు వేతనము నిర్ణయింప లేదు. ఆమె యొకనాఁడు తద్విషయము నిశ్చయపఱచుకొన నెంచి, సమ్మోహకమధురస్మిత మొనర్చుచు, మారుతూపుల బోలు తనదు చంచలకటాక్షములు మిక్కిలి దీక్ష్ణముగ నాతపై బఱపు చుండెను. మోహాంధుఁడై యున్నమాధవరావుపై నీదినము తార తనకడ

గల మోహినీశక్తి నంతయుఁ బ్రయోగించెను. ఇప్పట్టున మాధవరావు హస్తమున స్వర్గ మగపడునటుల [illegible] సిద్ధముగ నుండెను. ఇంతకుముందే యింతచాతుర్యమును జూపిన మాధవరావును గాఢాలింగనముఁ జేసి "మనోహరా! మీకొఱకే స్వర్గము సిద్ధముగ నున్న" దని యామె పల్కెను.

మాధవరావున కింతకంటె నెట్టియాపేక్షయును లేదు. పత్నీ ప్రేమ విషయమై సంపూర్ణముగా నిరాశుఁ డగుటచే నా ప్రేమ మన్యత్ర సంపాదించుట కాతఁడు ధీరుఁడై యింతటివరాధ్యమునకు లోనయ్యెను. అట్లగుట నాతఁడు ప్రేమవిహ్వలుఁడై "ప్రేయసీ! నేను ప్రేమక్షుత్తుచే తపింపుచు నుంటిని. నాకు ప్రేమభిక్ష కావలయు" నని వచించెను.

యోగ్యస్థలమున యోగ్య మగుయాచన జరిగినది. అందుచేత స్వర్గము జూప సామర్థ్యము గలదాని కీక్షుద్రప్రేమదానము చేయుట కేమిలెక్క! తారకట్టూర్పు విడిచి యిట్లనియెను. ఆహా యేమి విచిత్రముగ మాట్లాడెదరు! ఇంతవరకు నా ప్రేమ మీ రందనే లేదా? నే నెల్లు మిమ్ము ప్రాణసమానముగ ప్రేమించుచుంటినో యది యింతవనుక మీమనసునకు గోచరింపనే లేదా? ఒక్కక్షణము మీమదన మోహనమూర్తి కనఁబడకుండినచో నీదాసికి సర్వము నంధకారమయమై, యాహారనిద్రలుకూడ స్ఫురింపక, యొక్కటేవిధముగ మీపాదధ్యాన మొనర్చుచుండుట మీరు కొంచె మయిన దెలిసికొనలేక పోతిరిగదా? ఏది మీరడుగక పూర్వమే నేను మీకిచ్చి మరచితినో దానిని మరల నెటులీయగలను."

మాయావిని యగు తార తనమాయాజాలమును వ్యాపింపఁజేసి యపూర్వచాతుర్యమువలన మాధవరావును సమ్మోహనాస్త్రమునఁ బడవైచెను. తార కేవలము నేను ప్రాణపదముగఁ బ్రేమించు

చుంటిని. నను మాటలతో సంతృప్తిఁ జెంది యానందించిన నీసుప్రీతిని
ప్రేమతోఁ బాటు మాయాజాలమును కూడఁ బరిత్యాగించి ప్రకా-
శించెను. హాహా యనుచుండగనే, దాని నేత్రము లశ్రుపూరితము-
లయ్యెను. కంఠము గద్గదమయ్యెను. ఈ మహావాక్యములను మాధవ
రావు తలక్రిందుగాఁ బడిపోయెను. ఆచారుగారి యశ్రుపూర్ణనే-
త్రములను స్వచక్షువులతో నవలోకించిన మీఁదను, దాని బొంగురుగద్గద
కంఠరవము స్వకర్ణములతో విన్నమీఁదను, దానినిస్సీమప్రేమమునందు
మాధవరావునకు సంశయమెట్లు కలుగును. ప్రేమభరంబున గులాబిరం
గును సుకుమారమై నవనవోన్మేషమున నిగనిగలాడు దాని చెక్కిలి
నొక్కి తియ్యనిముద్దు గొని, చేతులతో నా కన్నుల నొత్తుచు
మాధవరావిట్లనెను. "ముద్దులగుమ్మా! నీవు నన్ను మనఃపూర్వక
ముగఁ బ్రేమించు చుంటివి నని నే బాగుగా నెఱుఁగుదును. అట్లగుట
నేనే నీపై మమతఁ జెంది యుంటిని. నీకు నాపైఁ బ్రేమ లేనిచో
నీప్రేమమునకు నే నెట్లు బద్ధుఁడ నగుదును? ఈనీప్రేమ మటులే యావ
త్తము నఖండముగా నుంచ నాపరమేశ్వరుని వేడికొనుచుంటిని."

"నేనును రేయింబవళ్ళు దైవము నిదే భిక్ష వేడుచు చుంటిని. మీరు దీని కేదో తగినయుపాయము త్వరలో నాలోచింప వలయును. మీకు గాక యన్యు లెవ్వరికి నీశరీరముపై నధికారము లేదు. సర్వకాల మీదాసి యీపాదములనే నమ్ముకొని యుండును. మదన మోహనా! నాయింటికి మఱియొకరు వచ్చుట లేదు. నిరర్థకముగఁ బదిమందిమనుష్యుల రాబట్టుకొని వారితో కలసిమెలసి ప్రసంగించుట నా కసహ్యము. మీరీకట్టుదిట్టము లొనర్పనిచో నేను యథార్థముగఁ జెప్పు చుంటిని. విషము దిని మీ ముందరనే ప్రాణముల విడిచెదను." అనునప్పటికి దానికంఠము రుద్ధమయ్యెను. నేత్రములనుండి యవిరళాశ్రుప్రవాహముబాలువాఱి వక్షస్థలమును దడిపివైచెను.

మాధవరావునకుఁ గూడ దుఃఖము రాకపోలేదు. అగును. ఇట్టి
యకృత్రిమ నిస్సీమప్రేమము గాంచినంత నెవ్వాని కట్లు కలుగకుండును!
అతఁడు తారను గాఢాలింగన మొనఁగి దానికన్నీటిం దుడుచుచు
నిట్లనెను. "ప్రేయసీ! నాకు నదే యిష్టము. నీవు నీతల్లిని కొంచెము
నొడంబఱిచి చూడుము. నేను దానికడ నీసంబంధ మగుకట్టు
బాటము లన్నియుఁ జేసివైచెదను. మీకు నెలకర్చున కేమి యిచ్చిన
సరిపోవునో సరిగా నిర్ధారణ మయినచో బాగుగ నుండును."

"ఈవిషయమును మాత్రము నేను వెళ్ళి మాయమ్మతో చెప్పను.
నాకవస్థ యెట్లుండెనో యది నాకే తెలియును. ఇదియంతయు
దానిపోరుఫలమే. మీవలన నాలుగైదువందలు పుచ్చుకొనునప్పటికి
నొక్కొక్కసమయమున మీ రిటకు వచ్చినప్పుడు మిమ్మది చులుకన
జేయక మానదు. మీరొక్కదినము నాకంట బడకున్న నాప్రాణము
నిలువదు. మాయమ్మతో నీసంగతి జెప్పుటకు నన్ను మాత్రము
పంపకుఁడు. ఈజీతమువిషయముమాత్రము మీ రనకూడదు, నే విన
కూడదు. ఎవరిపాదములకడ నాప్రాణము, సమస్తము నాధారపడి
యుండునో వారికడ నశాశ్వత మగుధనము పే రయిన నెత్తుదునా!
స్నేహము కావలయును కాని డబ్బు ప్రధానమా! కాన మీ కేది
సరి యని తోఁచునో యది యొనర్పుఁడు. మాయింటికర్చు తప్ప
మఱియేదియు నాకక్కఱ లేదు."

"మీయింటికర్చునకు నెలకెన్నిరూపాయ లగుచున్నవి!" సిగ్గభి
నయించి అఱమోడ్చుకన్నులల్లార్చుచు తార యిట్లనెను. కర్చున కేమి,
చేసినచో చాల గలదు. కాని యిప్పుడే సంసారభార మంతయు
మీనెత్తిపైబడుటచేత నమితవ్యయ మొనర్చుటకు నామన సెట్లు సా
హసించును! నెలకు నూఱురూపాయ లయిన జాలును. ఏలాగో చూచి
వాడుకొని దానితో కాలము గడుపుకొందుము."

ఇయ్యెడ తార యంగవిక్షేపమును, కటాక్షములును, మధురస్మితమును, లాలింపుమాటలను మాధవరావు మనసును మోహప్రపూరితముగఁ జేసివైచెను. తార యడిగిన నూఱురూప్యములు జీతము వానికి స్వల్పముగ గానుపించెను తార తన్ను మనఃపూర్వకముగ ప్రేమించుచున్న దనియుఁ గేవలము ప్రేమవలననే యింత కొద్ది జీతముతో సంతుష్టి బడిన దనియుఁ దలంచి సంతోషపూర్వకముగ దానికి నూఱు రూపాయిలు జీత మిచ్చుట కొప్పుకొనెను

ఇట్లు తన కార్యము నెఱవేఱినందున తార గర్వమున మరల మోహినీస్వరూపధారణ మొనర్చి, వేశ్యాసులభ మగు నానాభినయములు జేయుచు నిట్లనుకొనెను. "నే నిదివఱ కెంతకల్లబొల్లిమాటలాడి యెంతలాలించి, యెన్ని మెరమెచ్చులు జూపినను నింత యెక్కువగ నూఱు రూపాయలు జీతమిచ్చెద నన్న ముండాకొడుకొక్కఁడైన నున్నాఁడా? ఇంతకన్న నెక్కువ యడుగుట కెవ్వతెకైన సాహస ముండునా! నూరురూపాయల కీతఁడు చవ్వున నొప్పుకొనియెను. ఇంకను కొంచెము హెచ్చించినచో కొంగులోఁ బడియెడివాఁడే. భయము లేదు. పిట్టవలలోఁ జిక్కినది. మెల్లమెల్లగ రెండువందల రూపాయలకు పైగా సీతనియొద్ద గుంజనిచో నా పేరు తారగాదు."

తార యీవిధమున మనోరాజ్యము కల్పించుచుండ సనామయ యమునకే మాధవరావాతన్వంగి సౌందర్యమును తనయుత్ప్ర ప్రణయాసనముతోఁ బ్రశంస మొనర్చుచు నిట్లు తలపోయుచుండెను. "ఆహాహా! ఏమి యీవనిత! చందురునందంబు డిందుపఱచునీమె ఖరమున యెన్ని మాఱులు జూచిన నన్ని మాఱులు నూతనసౌందర్యము దృగ్గోచర మగుచున్నదే! ఈమె నవీనలావణ్య మెచ్చట నుండి వచ్చుచున్నది?

౩౨

మాధవరావు తారయెడ బద్ధానురాగుడై [illegible]
పోవుచుండెను. కొంతకాలమువరకు [illegible]
కంట్రాక్టువ్యవహారము [illegible]
మంతయు బావమరది సదాశివునిపై బడియెను. సదాశివరావు
చెమటూడ్చి పనిచేయుచున్నమాట నిజమే. కాని వానికి వ్యవహా
రమున గలలోతుపాతులు సరిగా ననుభవము లేకతన నేకపొరపాటు
సంభవించుచునే యుండెను. కంట్రాక్టుపని సున్న మాటలతో
నడచునది కాదు. జాగరూకతతో ప్రతిస్వల్పవిషయమును గూడ
వేయికన్నులతో గనిపెట్టుచుండవలయును. దానితో తిరుగు మరు
గులు బాగుగా నెఱిగి యనావిని గా బని చేయవలయును. ఇట్టి వ్యాపార
మునకు మిక్కిలి మనుకైన వాడు కావలయును. పాప మమాయకుం
డగు సదాశివునివలన నే మగును కొన్ని దినములవఱకును వ్యాపా
రము బాగుగనే నడచినది. ఇచ్చట మాధవరావు తారమాయాజాల
మున మునిగి పోయెను. దానిమూలమున వానికి స్వర్గము కూడ
తుచ్ఛముగా దోచుచుండెను. ఇంక వ్యాపారము నడుచుటెట్లు? మెల్ల
మెల్లగ వ్యాపారము బుట్టమునుగుచు వచ్చుచుండెను. మాధవరావు ఖర్చు
మాత్రము మితి మీఱియుండెను. వ్యాపారము రాబడి తగ్గినది
ఖర్చుమాత్రమధికము. అట్లగుట దీనిపరిణామ మేమో స్పష్టముగనే
తెలియగలదు.

పాప మెల్లకాలము దాగి యుండదు. ఎప్పుడో యొకప్పుడది బద్ధలై
తీరును. మాధవరావు విచిత్రనటనము రామచంద్రుని చెవిని
బడియెను. తన కుమారుడు వేశ్యాసక్తుడై నందుల కాతడంతగా జింతించ
లేదు. కాని వాని నిర్లక్ష్యమువలన వ్యాపారము చెడుచున్నందు
నకు మాత్ర మా వృద్ధున కమితదుఃఖము జనించెను. పుత్రుని

కాసింత మనస్సున సంతోషము కాతెచ్చుకొనుచు మెలగుచున్నది. ఈ మాదిరిని చింతయే కొలది దినములలో రామచంద్రునకు హృద్రోగముగఁ బరిణమించెను. ఇంతలో కర్మధర్మసంయోగమువలన భయంకర మగు నంటువ్యాధి దగులుకొని వైద్యసాధ్యము గాక యొకదినమున నావృద్ధుఁ డైహికదుఃఖములనుండి విముక్తుఁ డయ్యెను. ఈయాకస్మిక ఘటనవలన దిరుగుబోతగు మాధవరావు మార్గ మకంటక మయ్యెను.

శాస్త్రవిధిచొప్పున రామచంద్రునియౌర్ధ్వదైహికకర్మ లన్నియు యథావిధిగ నడచెను. ఈకర్మల కేమియు స్వల్పవ్యయము కాలేదు. రామచంద్రునిమనస్సంతోషముకొఱకై చిరంజీవి మాధవుఁ డీరీతి నపరకర్మలు నిర్వర్తించెను. మామగారి శ్రాద్ధదినములకు హతభాగిని లక్ష్మికూడ పుట్టినింట నుండి వచ్చెను. ఆమెచాల దినము లత్తింట నుండుటకు శక్యము కాకపోయెను. ఆమె వైధవ్య ధర్మపాలనము కిచ్చట ననివార్యము లగు నానావిఘ్నములు సంభవించెను. ఆమెయిరువురాడుబిడ్డలు—కాదు పూర్వజన్మము శత్రువులు—అణుమాత్ర మయిన పాపభీతి లేక మాటిమాటి కామెను హింసింప సాగిరి. ముందే వైధవ్యదుఃఖాగ్నిని బ్రుగ్గుచున్న దీనురాలగు నయ్యబల మానసికయాతనాభర మేగాక యీయాడుబిడ్డల సాధింపుకూడ నెంతని సంహింప గలదు! మామగారికర్మ సాంత మయినయొక్కవారము లోపలనే యామెపుట్టినింటికరిగెను.

వినాయకరావు కూడ తనవదినెగారితండ్రిశ్రాద్ధమునకు వచ్చియుండెను. వినాయకరా విప్పుడు పూర్వవినాయకునివలె యుండ లేదు. అంతయు మాఱిపోయినది. అట వినాయకరావుమూడు నాలుగుదినములుండి యింటికరుగుటకు బయలు దేఱెను. వచ్చునప్పుడాతఁడు వదినగారిని పుత్రులను గూడ వెంటదీసికొని తనతో నింటికి రమ్మని యన్నగారి నెంతయో ప్రార్థించెను. కాని పార్వతి

కష్టము లేనందునను నెన్నడును నన్నుబట్టి పిలువనిదది కాదు. జగన్నా థుఁడు, రాముఁడు పుత్రము పనబ్రహ్మతో నరికెడ నను నిక్కలి వేస్తూ, గాని పార్వతి వారిని పోషించు చుండెను.

రామచంద్రుఁడు పుట్టెడు దినమునకు నాల్గుమాసములు వచ్చి యుండెను. రెండుమూడు దినములు కెక్కువగ నెవ్వరి వచ్చుట సంభవించు లేదు. పార్వతియును నామె జ్యేష్ఠ భగిని యగు గంగయు గలిసి వారిని వెంటనే సాగనంపిరి. రామచంద్రుని యాకస్మిక మరణమువలన నందరికన్నను గంగ కెక్కుడుకష్టములు సంభవించినవి. శైశవమునుండియు రామచంద్రునకు గంగపై ప్రేమ కుండెను. గంగకు గల దర్పమునకును, అహంకారమునకును మూలకారణము తండ్రి కీమెయెడ గలమహా దరమే. అట్లగుట పితృవియోగజనితదుఃఖ మందరికంటెను గంగకు దుస్సహము గానుండెను. ఇం దాశ్చర్యమేమియును లేదు. గంగ స్వభా వానుసరణముగ పితృమరణమునకు పాపము అనపరాధిని యగు మనోరమ కారణముగ గాని ఈచల్లనితల్లి యింట్లో నడుగు పెట్టి నందువలనను. ఈదౌర్భాగ్యురాలి యదృష్టమువలనను నాజనకున కకాల మృత్యువు సంభవించెనని యామెను నిందింప సాగెను. గంగ మాటి మాటికిని మనోరమను శ్రమబెట్టుచు, ఆమె సుశీలతను ద్రుంచివైచు చుండెను. పాపమా కోమల బాలికయొక్క యనిర్వచనీయమగు స్తాపము వర్ణింప శక్యము కాదు.

తండ్రి చనిపోయి రెండువారములయ్యెనో లేదో యప్పుడే మాధవరావు వేశ్యయింటికిఁబోవనారంభించెను. ఇప్పుఁ డాతఁడు రాత్రులయందు యింటికి వచ్చుటకూడ బొత్తిగ మానివైచెను. దినములో చాలభాగము తారయొద్దనే గడచిపోవు చుండెను. తార మదిరాదేవతకు మహాభక్తురాలయి యుండుటచే మాధవరావుకూడ మెల్ల మెల్లగ సంపూర్ణసురాభక్తుఁ డయ్యెను. కొలఁదిదినములలోనే

ఇంతటిక్రొత్తగుబాళి గ్రామమునకే దాపించెను. ఇంతవరకు కిం
క్రొత్తవారు మాధవరావుదుర్వర్తన మెల్లరకును దెలియు లేదు. కాని
యిప్పుడది నీటిపై వైచిన తైలబిందువువలె గ్రామమంతటను వ్యా
పించెను. అతనిహితులును ఆప్తులును, ఈ చెడునడత మాన్ప
విషయమై యనేకవిధములు సద్బోధ లొనర్చి మరలింపఁ జూచిరి.
కాని మాధవరా వీవిషయమున నణుమాత్రమైన తనదోషము
లేదనియు, దోషసర్వస్వమునకు బాధ్యురాలు మనోరమయే యనియు
వారితో వాద మొనర్ప సాగెను.

సోదరునిదుర్వర్తనమునకు గంగయు, పార్వతియు నిరువు రాఁడు
బిడ్డలును మనోరమను రేయింబవళ్ళు దూషించుచు కఠోరవాక్యము
లతో నొప్పించు చుండిరి. సోదరుని ప్రవర్తనము వీరిలో గంగమన
స్సునకు సమాధానముగనే యుండెను. కాని పార్వతికి మాత్రమత్యంత
దుఃఖదాయక మయ్యెను. గంగ సంతోషించుటకు కారణమిది.
ఇప్పుడు మనోరమకు సుఖలాభము లేదు. ఆమెసౌభాగ్య మంతరించి
నది. గంగవంటి యాడుబిడ్డకు నింకేమి కావలయును? సోదరుని
వేశ్యాసేవనము గంగ కిష్టమైనది గాని యాతఁడు భార్యను ప్రేమించి
యామెను సుఖపెట్టుట మాత్రమామె కణుమాత్రమును నరిపడ
లేదు. బాలికయగుమనోరమ గంగ కేమియపకార మొనర్చెను!
అట్టిదేమియు లేదే! కాని యామె గంగకు మఱఁదలై యుండుట
యే యపరాధమాయెను! ఈభయంకరాపరాధమువలననే గంగ
మనోరమకు శాశ్వతశత్రు వయినది.

మాధవరా వెట్లు పరాధీనుఁడై జ్ఞానశూన్యుఁ డగుచుండెనో
యట్లే మనోరమయవస్థకూడ నధికాధికముగ శోచనీయ మగుచుం
డెను. ఇంటిలో నెందరుపరిచారకు లున్నను ఇంటి పనులన్నియు
రేయింబగళ్ళా దౌర్భాగ్యురాలే యొనర్పవలసి యుండెను. అందువలన

పాపము తినుటకు కడుపునిండ భోజనమైన దొరకుట లేదు. ఆడు
బిడ్డల సాధింపులవలనను, ఈ స్నేహబాధ వలనను జడినొందుచు నామె
నిట్టూర్పులతో కడుపు నింపుకొనుచుండెను. ఇతరాహారమువలన
నామెకుఁ బ్రయోజన మేమి? ఆయాక్రందన మెవ్వరికిని విన
వచ్చుట లేదు సరిగదా, తెలియవచ్చుట కూడ లేదు. మఱియు నది
వినవచ్చుటకును, దెలియవచ్చుటకును మార్గముకూడ లేదు. కారణ
మేమన ఆమెరోదనము శబ్దాశ్రుహీనమై యుండెను. సశబ్దరోదన
మనేకుల కడ జూచి యుందరు. కాని అశ్రుహీన మగురోదనము
కేవలము మనోరమయభ్యాసఫలితమే.

వీటియన్నిటికంటె కష్టతరమైన యాతన పతియనాదరము. ఆమె
యౌవనావస్థయందుఁ బ్రవేశించుటచే తనస్థితి యిప్పుడామెకుఁ దెలిసి
నది. ఆమె దేహమున యౌవనచిహ్నము లెట్లు రమణీయముగా శోభిల్లు
చున్నవో యటులే యంతరంగమున హితాహితజ్ఞానముకూడ విక
సించుచుండెను. ఆగంభీర నిశాసమయమున దన్నుకారణముగ పదా
ఘాతకుఁ గూర్చి భర్త యెందుకు బయటికి వెడలిపోయెనో, తనవలన
నేమి యపరాధము కలిగెనో, మనోరమ యీదినమువరకును స్థిర
పఱచుకొనలేక పోయెను. దీనికారణము బ్రాణేశ్వరు నడుగవలయు
ననియు, అందు క్షమాపణ వేడవలయు ననియు, మనోరమ యిప్పు
డెంతయో వేగిరపడుచుండెను. కాని యామె దౌర్భాగ్యము వలన
నెంతప్రయత్నించిన నట్టిసుయోగము తటస్థము కాదయ్యెను. ఆదౌ
ర్భాగ్యపురాత్రినుండియు నామెను దగ్గరకు రానిచ్చుటలేదు. ఎప్పు
డైన నామె దైవికముగ తారసిల్లినచో వెంటనే యాతండటనుండి
తొలఁగిపోవును. పాపమామె కింక నుపాయమేమి? దగ్గఱ నెవ
రును లేనిసమయమున నామె యింట గలదేవతార్చనాగృహముకడ
కరిగి, దేవికడ శిరము వాల్చి ముకుళితకరకమలయై జాలి గద్గ

నిట్లనును. "తల్లీ జగదంబా! భక్తాభీష్టప్రదాయినీ నీవు నాయెడ ప్రసన్నవై నాకు మరణము ప్రసాదించిన నీ [illegible] కృతజ్ఞ నగుదును."

ఆడుబిడ్డలవలన గలుగుచున్న యీ సహింపరాని కష్టములకు మనో రమ యాత్మహత్య చేసికొనవలయునని గూడ నూహించుచుండెను. కాని యాత్మహత్య యెట్లు చేసికొనవలయునో [illegible] కేమియు స్ఫు రింప లేదు. అందువలన నామె యీ కష్టముల దప్పించుమని దేవిని [illegible] వేడుచుండెను.

౨౬

రామచంద్రునియొద్ద ద్రవ్యము మాధవరావుచేతి కందెను. ఈసమయ మున నింతటి శేషధనము మాధవరావుచేతి కందియుండనిచో నది నిజముగ నాశనమై యుండెడిది. ఈయదృష్టము నతని నిష్టసఖులకును మూలమయ్యెను. మాధవరావు జీవితచారిత్రమే దీనికి ప్రబలదృష్టాం తము. మాధవరా విప్పుడు క్రమక్రమముగ దుర్వర్తనము బాహాట ముగా చేయుచుండెను. లోకనింద కాతఁ డిప్పు డేమాత్రమును వెఱ చుట లేదు. పరవంచకులును, స్వార్థపరులును, వ్యసనాసక్తులును, ముఖస్తుతు లొనర్చువారును నగు సేవకు లనేకు లాతని చుట్టును మూగు చుండిరి. ఈనరాధములు మాధవుని నాశనమార్గమును సులభము చేయుచుండిరి.

ఆదినమున తోఁటవిందు. మాధవరావు నుద్యానగృహమున నేడు మిగుల కోలాహలముగ నుండెను. ఈదిన మాతనిమిత్రు లచట సమావేశమైరి, కొన్ని దినములనుండియు నీవిందునకు తగుసన్నాహ ములు జరుగుచుండెను. కొందఱు గాయకనర్తకీగణికాసమూహము లను బందోబస్తు చేయుటయందును, కొందరు నానావిధమద్యముల సమకూర్చుటయందును, కొందఱు మాంసాహార పక్వాన్నముల

సిద్ధపఱచుటయందును, నిమగ్నులై యుండిరి. ఒక్కఁడును నిరర్థకముగ గూర్చుండి యుండలేదు. ప్రతివానికిని యేదోయొకపనియే! ఉదయమున గడచిన జామునఁ బ్రొద్దెక్కెను. గోవిందరావు, రామరావు, విష్ణుపంతు, నరహరిపంతు, అమరసింగ్ సులేమాన్ ఖాన్, నౌరోజీ, జాన్ డిసోజా మొదలగు పెద్దమనుష్యులందఱు మెల్ల మెల్లగ నచటికిఁ జేరిరి. తార, సుందరి, చంద్రానన మొదలగు గణికామణులు గూడ నటకు రావలసి యుండిరి. ఆపెద్దమనుష్యు లెల్లరు మిగులనుత్కంఠతో వారియాగమనమును బ్రతీక్షించుచుండిరి. ఇంతలో నాలుగుగుఱ్ఱపు బండ్లాయుద్యానవనమున బ్రవేశించెను. బండిచక్రములచప్పుడు చెవిని బడుటతోడనే యచటి పెద్దమనుష్యులయుత్సాహమేమని చెప్ప వచ్చును! అందఱిముఖములు ప్రఫుల్లములయ్యెను. సులేమాన్ నాబండ్లకెదురుగ బరుగిడి పోయి, యాబండ్లలోని వారికి స్వాగత మొసఁగి, వారి నుద్యానగృహమునకు దీసికొని వచ్చెను.

మదోన్మత్తగజములవలె పదనిక్షేప మొనర్చుచు, ఘల్లుఘల్లని నూపురధ్వనులు చెలుగడల మ్రోయుచుండ వారయువతీ సమూహము ద్యానవిలాస మందిరము ప్రవేశించెను. అంత నా పెద్దమనుష్యుల యంతఃకరణములు హర్షోర్మితతులం మునిఁగి తేలుచుండెను. నారంగజులేచి వారవధూమణులకు స్వాగత మొసంగిరి. శీఘ్రకాలములోనే యారల కెల్లెడ శాంతి నెలకొనెను. నౌరోజీసేటు చేతులం జోడించి యారమణీగణమున కిట్లని మనవి చేసెను. "సుందరీమణులారా! శుభకృత్యములు ప్రారంభింప నింకవిలంబ మేటికి? మీరు కర్ణధారిణులై యీపతితులను భవనదిని దాఁటింపుఁడు!"

ఆ వారవనితలు లజ్జ నభినయించుచు, కన్నులు త్రిప్పుచు, చిఱునవ్వులయు నిట్లనిరి. "ఈరోజున నిచట మీవంటిసరసు లింద రుండ మే మంతటి కార్యభార మెట్లు వహింపగలము!"

మయ్యెను. నారోజీసేటు హార్మోనియమును ముందు గూర్చుండెను. రామారావు తబలా చేతఁ దీసికొనెను. సుందరి కర్ణరసాయనముగ గానము సేయఁదొడంగెను.

"ప్యాలా ముఝే భర దే"

ఆహా! ఆసమయమున నయ్యప్రతిమ మహానంద మెవ్వరు వర్ణింపగలరు! నలుగడల సంతోషము గ్రమ్ముకొనెను.

"హాయి, హాయి! బలే, బలే! ఏమి షోకయిన పాట! వహవా!" ఇత్యాదిశబ్దములచే నుద్యానభూమి కంపితమయి, నభోమండలము గూడ బ్రతిధ్వనించుచుండెను. మధ్యమధ్య గ్లాసులు ఠణఠణ శబ్దించుచుండెను. యువతీయువకుల యోష్ఠస్పర్శనముగూడ నావెంటనే జరుగుచుండెనని వేరుగ చెప్పనక్కఱ లేదుగదా! ఇంతలో రెండు గంటలు గొట్టిరి. పక్వాన్నము చల్లారిపోయినందున వంటవాండ్రకెంతయో కష్టముగ నుండెను. తుదకు హుస్సేను ముందునకు వచ్చి ధైర్యము వహించి "అన్నంపాణా షల్లారి అయింది" అని చెప్పెను.

ఈపలుకులు సులేమాన్ మియా మనసున కెంతయో కష్టముగ నుండెను. అతఁడొక్క విసరున నావంటవానిదగ్గఱకు పోయి కంపితగాత్రముతో నిట్లనను "అరే, హరాంజాద్! నీకీ నిషి వుండావు లేదు? మా కీసంతోషాన్కి పాడూ సేస్తావు! నీకి కండ్లుకి నుపడ్తాదీ లేదు? అరే నువర్! యీడ డబ్బైడబ్బై నవాబులు అయిన్వాల్యాన్కి బరోబర్ కిమ్మత్ చేసే యీపన్నెండు రత్నాలు ప్రకాశించుచున్నాయి లేదు? అరే ఫర్! దీన్కి ముందర నీవత్త అన్నం యేమీ లెఖయుంటాదివోయ్? యిది షాంతం అయింతి అంటే తర్వాతా నూస్తాం పోబే!'

సులేమానును, తక్కినవారును బ్రాందీనిషాలో మునింగి యుండి "అరెరే పాట యేమి మజాగావుంది, యేమి మజాగావుంది!" అను

చుండిరి. అది గాంచి మాధవరావు "అరే హుస్సేన్! ఇక్కడ పోయి తయారయినయాయన్నము నిటకు దీసికొని రమ్ము." అని ఆజ్ఞాపించెను.

"జీ హుకుం ఖుదావంద్" అనుచు హుస్సేన్ పక్వాన్నముల దెచ్చుటకై వెడలిపోయెను. వెంటనే భోజనపదార్థము లన్నియు నటకు వచ్చినవి. కాని చప్పట్లున వారిలో చాలమంది నేలబడి దొరలుచుండిరి. లేచి కూర్చుండుటకయిన త్రాణ లేదు. అట్లగుట మహాప్రయాసంబున, విశేషద్రవ్యము వెచ్చించి, తయారు జేసిన యాహారసాన్నముల నాస్వాదించుటకు పాపము వారసమర్థులై యుండిరి. సుందరం, తార మొదలగువారిలో మాత్ర మొక్కరికేగూడ నింతటిమైక మెక్కలేదు. ఏలయన నట్టిసమయముల మాయావిను లగుననవేశ్యలు తగుమాత్రముగనే సురాపాన మొనర్చుచుందురు. ఆరంగేలిపురుషులకు మైకము కలుగజేయుటయే వారిప్రధానోద్దేశము, వారిలో నొక్కతెకూడ మ్లేచ్ఛులచే పక్వము చేయబడిన యాహారమును స్పర్శనమయిన చేయలేదు. మాధవరావు నింక నొకరిద్దఱుమాత్రము కొద్దియో, గొప్పయో భుజించిరి. తుద కావంటక మంతయు భైరవసేవకర్పణ మయ్యెను. ఇవ్విధమున తోటపండుగలో ద్వితీయాంకము ముగిసెను.

సాయంకాలము తృతీయాంకము ప్రారంభ మయ్యెను. యజమానుడు మాధవరావు పడకనుండి లేచి బయటకు వచ్చికూర్చుండెను. అటు లగుట తక్కినవారుకూడ మైకముచే దూలుచు లేనియోపిక దెచ్చికొని లేచి కూర్చుండిరి. నిశాసమయ మగుటయే తడవుగ నాగృహామునలువంకల దీపమాలికలు ప్రజ్వలితములై యెల్లెడలగాంతి వెదజల్లుచుండెను. తోటమాలీలు కొందఱు జాజులు, విరజాజులు, మల్లెలు, మొల్లలు, సంపెంగలు మొదలుగాగల కామోద్దీపకము

లగుపుష్పములను మనోహరగుచ్ఛములుగను, రమణీయహారములు గను, సిద్ధపఱచి దెచ్చిరి. అహోకీనాలాతెల్లరు మహానందమున వాని చేకొని కొందఱు చేతులను, కొందరు కంఠములను, కొందఱు కేశపాశముల శోభాయమానముగ నొనర్చిరి. తిరుగ సంగీతము ప్రారంభ మయ్యెను, ఫలాహారాస్వాదనముగూడ ప్రారంభ మయ్యెను. తబలా సారంగి మొదలగు సుమధురవాద్యధ్వనులు సమ్మేళన మయ్యెను. ఆవాద్యములతో నట నున్న స్త్రీపురుషులమనోవృత్తులు సమ్మేళితము లయ్యెను.

అల్పకాలములోనే సారంగీమధురాలాపము ప్రారంభ మయ్యెను. "ధిత్తాం ధిత్తాం" అని తబలాధ్వని బయలు దేఱెను. హార్మోనియము సప్తస్వరములందును బలముగ ధ్వనించు చుండెను. నర్తకీగణము నృత్యారంభమునకు గడంగెను. శ్రుతు లన్నియు సమ్మేళన మయ్యెను. ఆసమయమున నారమణీమణులపదసంచాలనముతో వారి నూపురములనుండి వెలువడుమధురఝణత్కారములుగూడ నీసంగీత ధ్వనులతో గలసి పోయెను. ఇంకేమి చెప్పవలెను! సంతోష తరంగము లెగురుచుండెను. ఆయువకుల కామాగ్నియు బ్రజ్వలించు చుండెను. ప్రథమున దాదాపు గంటన్నరవఱకు నృత్యము జరిగి నది. తదనంతరము పాటప్రారంభ మయ్యెను. అయినతోడనే నలు వంకల నగ్గి ప్రళయము మై పోయినది

ఎల్లరు సుఖసాగరతరంగముల నోలలాడు చుండిరి. ఆదినమున తాము మాధవరావు నుద్యానవనమున గాదు—ఇంద్రుని యుద్యానవన మున నసించియున్నట్లుగ ప్రతివాడును భావించు చుండెను. మధ్యా హ్న మువ్వాడును భోజన మొనర్చియుండినందున ప్రతివానికి నిప్పుడు కడుపులో నాకలి మండిపోవు చుండెను. అటు లయ్యును సురా దేవిప్రసాదమువలన నింతవఱకును వారియాత్మారామ మేమియు దక్కగ

లేదు. కాని మాయయుక్తాహా మెంతవఱ కుండును? నిరాహారము లగునాయుదరములలో పడినమద్యపానపాపే నాకలిమంట నాలుగురెట్లధిక మయ్యెను. అందరును స్మృతిభ్రంశమొంది యుండిరి. మెల్లమెల్లగ గ్లాసులు పగులగొట్ట సాగిరి. ఆకాచశకలములవలన ననేకుల చేతులు గీసుకొని పోయి వానివెంబడి రక్తము కారుచుండెను. క్రమక్రమముగా సంగీతముకూడ నిష్టముగూడ తప్పిపోవు చుండెను. అందఱు మైకమువలన నోడ లెరుంగక గంతులు వేయ మొదలిడిరి. ఒకరిమాటనొకరు వినిపించుకొనుట లేదు. ఒకరినొకరు లక్ష్యపెట్టుటయులేదు. అందరు సురాదేవికి స్వాధీన మైపోయిరి. కడకు దెబ్బలాటలో దిగినది. నొకర్లుచాకర్లుగూడ సురాదేవికి దాసానుదాసులే యగుట నింక నాదెబ్బలాటను మాన్పువా రెవ్వరు?

క్రమక్రమముగ కుర్చీలు మేజాలు నొకరిపైకొక రెక్కించు చుండిరి. చిత్రములు, ఫొటోగ్రాఫులు, అద్దములు తునకతునకలై పోవు చుండెను. కొందరికి చేతులు విఱిగెను. కొందరికి పాదములు విఱిగెను. కొందరికిఁ దలలు పగిలెను. అటులయ్యు నొక్కనికిఁగూడ చైతన్యము కలుగ లేదు. భోగము వారికి సహాయముగ వెంటవచ్చిన వస్తాదొకఁ డీసందడిలో నున్మత్తులై యున్న యాపెద్దమనుష్యుల గడియారములు, బంగరుగొలుసులు, ఉంగరములు వగైరాలను నంకిన మట్టునకు జమచేసికొని యాసుందరీమణులఁ దీసికొని యటనుండి పలాయనము చేసెను. ఇచట నీపోకీపురుషులెల్లరు నెత్తురుమడుగునఁ బడి గడబిడగ దొరలుచుండిరి.

## ౨౭

ప్రాతఃకాలమున నొకనొకరు పరుగెత్తుకొని వచ్చి మాధవరావును మేల్కొలిపి సంభ్రమమున నిట్లనెను. నడవండి, నడవండి, చప్పున కొంపమునిఁగింది. అమ్మగా రేదో బుడ్డిలో మందు తాగేశారు.

ఇప్పుడు గుడ్లు తేలేస్తుంది. మాట మన్ను లేకుండా పడిపోయింది. సదాశివరావుగారు మిమ్మల్ని వేగే పిలుస్తున్నారు!"

అమ్మగారు రనగా మరెవ్వరు? హతభాగిని యగు మనోరమయే! కడచినరాత్రి జరిగినమహోత్సవము వలన మాధవరావు మిగుల శ్రమం జెంది యుండెను. అటులయ్యు నిద్రాభంగకర వర్తమాన మాలకించినంత దిగ్గునలేచి యారంగేళీశాలికాగ్ర మచ్చటనే వదలి యొక్కపరుగున నింటిలోనికి వచ్చెను. ఇచ్చట దృగ్గోచరమైన భయంకరకృత్యమును గాంచి స్తంభితుండై పోయెను. ఆతని కట్టెదుట మనోరమ తన సన్నమరణావస్థ ననుభవించుచుండెను. ఆమె ముఖశ్రీ వికటమైపోయెను. దృక్కులూర్ధ్వము లయ్యెను. కన్నులు లోతునకు దిగుడుకొని పోయెను. అణుమాత్రమైన నామెకు స్మృతి లేకయ్యెను. ఆతం డింకను బరికించిచూచెను. ఆమె నోట నెవ్వరు నొక్కనీటిచుక్కయైనం బోసినట్టు పొడకట్టదు. ఆమెకించుక శాంతి కలుగ నెవ్వరు నుపచారముం గూడ చేయుట లేదు. మీదుమిక్కిలి నతని జ్యేష్ఠభగిని గంగ మృత్యుసమయమునం గూడ భయంకరముగ గర్జించుచు నామెపై నిట్లు హృదయభేదక వాక్ప్రహారములం బరపు చుండెను. "...దౌర్భాగ్యురాలా! ఎంతటి మాటలమల్లివే! పనిపాటలు చేయకుండ హాయిగా పండుకొనవచ్చును గదా యని యేమిటక్కు పన్నినావే! అన్నపుముద్ద లేమియు గొంతుక కష్టపడలేదుగద! ఇంత తిండిపోతు రాక్షసివి మాకెక్కడ దాపురించినావు! ఒసీ! నీకా యింతతొందరగా మరణము! మరేమియు భయము లేదు. ఇంకను నీ వెంతకుందిని పంప వలసి యుంటివో! నీవు చచ్చిపోయినచో రేయింబగళ్లు నన్ను కాల్చుకొనితినువారెవరు? నీకు చావవలసిన అంత సంతోషమైతే చావవమ్మా—సంతోషముగ చచ్చిపొమ్ము. మానాయన డింకొకదానిని పెండ్లాడి యీబాధనుండి విముక్తుడవును!"

హృదయద్రావక మగునీ దారుణగాథ నంతయుం బ్రత్యక్ష

చక్షువులఁ గాంచియు, దానికిఁ దోడుగ తనసోదరి హృదయభేదకవాక్య
ముల స్వకర్ణములఁ దాఁకించినను మాధవరావుస్వాంతము కఠినవిన
యమున నొక్కుచున్నది కరుణారసప్రపూరిత మాతృస్యాను. అతిదీనాంతః
కరణము దుఃఖభరిత మాతృస్యాను దుష్టకులాంగనాకృత్యమును గాంచి
నంత నెవ్వని మనసు ద్రవీభూతము కాకుండును? ఆ కరుణావేగమున
మాధవరావునకు సోదరిపై నెంతో యాగ్రహము వచ్చెను. అతఁడు
నంత ప్తమానసుఁడై యిట్లనెను. "అక్కా! దయామయుఁ డొకఁడి
యున్నాఁడు. కాని నీకు బుద్ధియు లోకభీతియుఁ గూడ లేవుసుమా!
పాషాణముకంటెఁ గూడ నీహృదయము పాషాణమా యేమి? హృ
దయమే పాషాణము గానిచో ప్రాణము పోవుచుండుట నీకన్నులారఁ
జూచుచుండియు నాకొనసందింతువా? అది యటులుండుము. ఈ
చచ్చినపీనుగుపైఁ గూడ నిట్టి శస్త్రాఘాత మొనర్చుచుంటివి!
నిశ్చయముగ నీవొనర్చు దుస్సహహింసామూలముననే నీకోడలు విషపాన
మొనర్చి ప్రాణము విడిచినది. ఈ మృత్యువునకు నీవే కారణమువు.
ఇటనుండి వెడలిపొమ్ము. నీ మొగ మింకఁ జూపకుము!"

ఆజన్మాంత మెవరిచేతను పల్లెత్తుమాట బడనిగంగ కీదినము పుత్రు
సమక్షమున జరిగినయీపరాభవ మెంతయసహ్యము! గంగ క్రోధా
వేశమున జ్ఞానశూన్యయై ఛీత్కార మొనర్చుచు నిట్లనెను. "ఈదిన
ము బ్రాందీ గిందీ త్రాగినమైకము తలకెక్కినదా యేమిః? పెండ్లా
మును వెనుక వేసికొని నామీఁదికి పోట్లాటకు వచ్చుటకు నీకేమియు
సిగ్గైనలేదటరా! ఇంత సొమ్ము నీ మొగమునఁ బెట్టి చదువుసంధ్యలు
జెప్పించి యింతవానిగఁ జేసినందు కుపకారమా యిది? నీచదువుమీఁదను
నీమీఁదను నిప్పు—"

మాధవరా వీసమయమున సోదరికోపము నించుకయు లెక్కఁ
గొనక సత్వరమున మనోరమకు చైతన్యము కలుగఁజేయ యత్నిం

చెను. స్వహస్తమున నామెనోట గంగోదకము బోసి వీవనతో వీవ సాగెను. ఇంతలో సదాశివరావు డాక్టరును దీసికొని వచ్చెను. మనోరమ నాతఁడు బరీక్షించి, ఆమె త్రాగిన యౌషధపుబుడ్డి నేఁ దెలిసికొని డాక్టరు తెల్లమొగమువైచెను. వెంటనే సిద్ధపఱచి తెచ్చిన యౌషధమాతఁ డామెనోట నెంతో కష్టమున బోసి యిట్లు చెప్పి వెడలిపోయెను. "నన్ను చాల యాలస్యముగఁ బిలచితిరి. అందువలన నీమె జీవించుట దుర్లభమని తోఁచుచున్నది. పావుగంటలో నే నేనిచ్చినయౌషధమువలన శాంతి గలిగినచో నీమె బ్రతికిన బ్రతుక వచ్చును. ఈమె నిప్పుడు లేవదీసి కూర్చొబెట్టరాదు. ఏమాత్రము కూడ నిద్దుర బోనివ్వ వలదు. ఇంకొకపావుగంట సేపటి కీమెస్థితి యెట్లుండునో నా కెఱుక పరపుఁడు."

డాక్టరు వచించినయీపలుకు లాలించి యెల్లరు మగుల దుఃఖించిరి. కాని గంగయానందమున కేమాత్ర మవధి లేదు. మనోరమ చావ వలయు నని యామె తనమనసున నెందరో వేల్పులకు మ్రొక్కుచు నటనుండి వెడలిపోయెను. కాని పార్వతి ముందునకు వచ్చి మనోరమను లేవదీసి కూర్చుండబెట్టెను. ఇంతియే కాదు. ఆసమయమున నామె నేత్రములనుండి రెండుకన్నీటిబిందువులు కూడ రాలెను. ఇది సదాశివుని యుపదేశముచే నైయుండునోపు. మనోరమ విషయమున నీదినము గాఢదాంపత్యప్రేమము మిక్కిలి వృద్ధిజెందెను. ఇప్పు డాతఁడు మనోరమ కుపచారములు లోపములేక చేయుచుండెను. అదృష్టవశమున నల్పకాలములోనె మనోరమకు శాంతి గలిగెను. ఈశాంతి మిక్కిలియల్పమయ్యు సదాశివున కెంతో యాశ జనించెను.

మనోరమకొఱకు కంటకితుఁడై సదాశివుఁ డధికముగ దుఃఖితుఁడయ్యెను. గతమేమన రేయింబవళ్లామె కట్టిదుర్భరహింస జరుగు చుండెనో యాతఁడు సంపూర్ణముగ నెఱిఁగియుండెను. కాని యా

సాహచర్యమున వారించుట కాతనికడ నేమాత్రమును ప్రజ్ఞ లేదు
ఇటు లయ్యెఁ దనపత్ని యగుపార్వతిని మాత్ర మీవిషయమై యెం
తేదు చాలవఱకు మందలించెను. అందువలననే బయట కంతఁ
పార్వతియామెను వేధించుట లేదు. మనోరమకొఱకీదినము సదాశివుఁ
డెంతయో శ్రమపడుచుండెను. ఈవ్యాధియు ద్రావకప్రసంగము
మొట్టమొదట నాతఁడే కనిపట్టెను. వెంటనే యాఘోరవృత్తాంత
మాతఁడు మాధవునకుఁ దెలియఁ జేయుటకై పరిచారకు నాతనికై కని
గాను డాక్టరింటికి పరుగెత్తుకొని పోయెను. తొలుదొల్త సదాశివుఁ
డీభయంకరవిషయమును గనిపెట్టియుండనిచో మనోరమకు చికిత్స
కూడ జరుగకయే పాప మామెయాపాటికి నిస్సంశయముగ మరణించి
యుండును.

కొలఁదిసేపటికే మరల పెద్దవాంతి యయ్యెను. దానివెంబడి విష
ము చాలభాగము బయటికి వెడలిపోయెను. మనోరమ కించుక చైత
న్యము గలిగెను. మరల డాక్టరును బిలిపించిరి. రోగిని మరలబరీక్షించి
డాక్టరిట్లనెను. ఇంక నంతగా భయము లేదు. అయినను మీరలు జాగ
రూకతతో నీయౌషధము వెంటవెంటనే పావుగంట కొకసారి యీమె
కడుపులో పోయవలయును.

క్రమముగా రోగియొక్క జీవితాశ యిప్పటికి నిశ్చయ మని తోచెను.
మనోరమ తనవిశాలనేత్రములను దెఱచి విస్మితదృష్టులతో
నలువంకల జూడఁ దొడఁగెను. ఇప్పు డామె వెనుకటిమనోరమ కాదు.
ఆమె కిప్పు డెట్టిలజ్జయు లేదు ఇంతలో సదాశివుఁ డౌషధము ద్రా
వించుటకు వచ్చెను. కాని యెంతబలవంతము చేసినను నామె యౌ
షధము తీసికొనలేదు సదాశివుఁడు "సోదరీ! ఏల నీవిట్లు మూర్ఖపు
పట్టు పట్టెదవు? ఈయౌషధముఁదీసికొనుము. ఔషధము ద్రాఁగనిచో
స్వస్థత యెట్లు గల్గును? అని యామెను బుజ్జగించెను.

అతిహీనమైన మనోరమ [illegible] నేత్రములను సదాశివునివంక జూడసాగెను. ఆమె శుష్కాధరముపై [illegible] డెను. ఆనవ్వు జూచినవా రందఱును విస్మితులైరి. వా రందఱును [illegible] మనోరమాముఖమువంకే జూచుచుండిరి. క్షణములో [illegible] స్వరూపమును బొందెను. ఇప్పు డామెకు [illegible] లేదు. మనోరమ మృదు మందస్వరముతో "నా కౌషధమువలదు. నా కిక స్వస్థతయు వలదు. నాకు బ్రపంచేచ్ఛ లేదు.!" అని వక్కాణించెను.

'ఎంతపిచ్చిపిల్లవు! అమ్మా! ఏటికిట్లనెదవు?' అని సదాశివుఁడు పలికెను.

"అన్నా! నాయట్టి పాపభాగినికి మరణమే శ్రేయము. నేను—" ఇంకను నేమియో జెప్పవలయు నని యుండెను; కాని యామెపై మా టాడజాలదయ్యెను. నేత్రములనుండి యవిరళాశ్రుధార ప్రవహింప సాగెను. కంఠము రుద్ధ మయ్యెను. సదాశివుఁ డుత్తరీయాంచలమున నామె యశ్రుల దుడిచివైచెను. మనోరమ వెక్కి వెక్కి యేడ్చుచు "అన్నా! చూడుము. నేను నీకాళ్ళకు మ్రొక్కెదను నామరణమునకు నీవడ్డమురాకు" మని యతనిని వేడుకొనెను.

సదాశివుఁ డామె నూఱడించుచు "[illegible] దులకు మరణమును గోరెద రమ్మా! నీ కీబంగారమువంటి సంసార ముండియు నీవు మరణ మపేక్షించు టేల?" అని ప్రశ్నించెను.

ఆమె శోకసాగర మొక్కపెట్టున పొంగి పొరలెను. [illegible] స్మరణకు రాగనే యామె మిగుల నస్థిర యయ్యెను. నోటివెంట నొక్కపలుకైన వెలువడుట లేదు. నునుచెక్కుల [illegible] శ్రుధారలు ప్రవహింపఁ దొడగెను. ఈసమయమున నామె సదాశివుని ప్రశ్న కేమని యుత్తర మొసఁగగలదు! కృశించినహస్తముల నామె మెల్లమెల్లగ పైకెత్తి శిరమున బెట్టి, యాకసమున దృష్టి నిగుడించెను. ఇదియే యాప్రశ్న కామె యొసగినప్రత్యుత్తరము.

ఆప్రత్యుత్తర మందఱిహృదయములను వ్యాకుల మొనర్చివైచెను. సదాశివుఁ డెంతయో విలపించెను. ఆతఁ డేడ్చుచు "మాధవరావూ నీవే నిశ్చయముగ నీవే యీసర్వాపరాధములకుఁ గారణము! ఈదినము వఱకును నీసోదరివలన గలుగు చున్న యసహ్యబాధల నెల్ల నెట్లో యామె సహించుచు వచ్చినది. ఎప్పుడు నీమె "ఆ ఊ" అనుటగూడ నెవ్వరును జూచి యెఱుఁగరు. కాని మాధవరావూ, నీవలన కలిగిన తిరస్కారముమాత్ర మీమె సహింపజాలకుండెను. ఇప్పట్టున. నీవీమెను బతిమాలనిచో నెవరుచెప్పినను నీమె యౌషధము గైకొనదు ఎటుగుగ స్త్రీహత్య సంభవింప నున్నది. ఆపైన నీయిష్టము" అని యించుకదూరమున కొత్తిగిలెను.

మాధవరావుహృదయము పాషాణనిర్మితము కాదు. అతఁడు గద్గదకంఠుఁడై విషణ్ణవదనుఁడై "కనూ నిజమూ, నా యవినా దరమువలననే నీకు జీవితమునం దసహ్యము కలిగినది!"

మనోరమ యిప్పు డజ్ఞానబాలిక కాదు. ఇంతటసమర్థురాలైన గూడనామె కిప్పుడు మాటలాడు ధైర్యము గలిగెను. చీరచెఱఁగున నశ్రువుల దుడిచికొనుచు నామె యిట్లనెను. "నే ననుభవించు చున్న యాతన మీమనసునకు స్ఫురించి యున్నచో నంతవఱకు వచ్చియుండదు. వివాహ దినదిపూర్వము కేవల మీదుస్స్వభావవిషయమై యనేక పర్యాయములు నే నను చుండెడుదానను. అయినదాని కంతకంటె నధికదుఃఖ మిం కేమి కావలయును? ఈవిషయము మీకు దెలియఁ జేయుట తటస్థించినచో నే బొందుచున్న భయంకరదుఃఖమున నొక్క శతాంశమైన మీకు దెలియఁజేయ తటస్థించినట్లయిన మఱియీ పృథివియందింకే సుఖములు నే లెక్కగొనను! ఈనాటి యీనావ్యా ధ్యావువలన తనకార్యము కొనసాగినచో నాసుఖమున కింతయు లేకుండునుకదా!"

ఈమె యింతటి పాతివ్రత్య మెచట నేర్చుకొనెను? ఎల్లరు విస్మిత చిత్తులై స్తబ్ధు లైరి. మాధవరావు స్వప్నమునగూడ తనభార్య యింతటి సాహసికురాలని తలంచ లేదు. ఆసమయమున నతనికి వచ్చిన దుఃఖమున సమస్తమును కని యూరక నానందింప లేదు. కేవలమనోరమ కోపమావలననే తనవిమలచరిత్రమునకు తానె కళంకము తెచ్చుకొనె నని యింతయుఁ గాలము తలంచుచుండెను. "అంతయు దైవఘటనము. అది గడచిపోయినది. దానికి మనము చింతించిన లాభ మేమి? ఇప్పు డీయాపధము దైవమునను."

ఇట్లని మాధవరావు వెూషధపాత్రను మనోరమ ముఖమునకు దగ్గరకు బట్టెను. మనోరమ కంపితస్వరమున నిట్లనెను. "మి మ్మొక్కసారి గాంచినంతనే నిం కెందుకు చావవలయును? మీరు నాభర్త. మీరు నాకు సాక్షాద్దైవము. మీయాజ్ఞ కెదురాడుదునా!" అని యామె యాయౌషధముగ్రోలెను.

ఇంతలో మాధవరావిట్లనెను... "ఆత్మహత్య మహాపాతకము ఆత్మహత్య జేసికొనినవారు నిశ్చయముగ నరకకూపమున బడుదు."

ఈదినము మనోరమకాకస్మికముగా ప్రసంగసామర్థ్యము కలిగెను. ఇంతవర కామె యిట్లు మాటలాడు టెప్పుడును జూచియుండ లేదు. ఆమె సనుమనే యిట్లనెను. "కాని యేపాపిష్ఠురాలు పతి సుఖమునుండి వంచితయగునో దానిపాలికమున కాత్మహత్యయే యోగ్య మగు ప్రాయశ్చిత్తము కాదా యేమి!"

మనోరమ యెదుట నిలుచుట కిదిన మెవరుసమర్థులు! లోలోన దెరిపి లేకుండ మండుచుండి బాలిక హృదయము దగ్ధమైపోయెను. ఆమె దగ్ధహృదయముపై నీదినము బిందుమాత్రజలసేచన మయ్యెను. హృదయ మహాప్రవాహ మిన్నిదినములు బద్ధమై యుండి, యీదిన

మపరోధము తెగి, [illegible] బయటఁ బడెను. [illegible] మింకిపో యినవాఙ్మరి [illegible] మాత్రస్మృతిముగ [illegible] యూరి పాలైపోగెను. ఆదినమాట తనమనసున గల యనేకవిషయములను మిగులస్పష్ట ముగ [illegible] ప్రకటన మొనర్చెను. [illegible] మనోరమదోష మేమియు లేదని మాధవరావునకిప్పుడు నమ్మకము కలిగెను. సర్వదోష ములకును మూలము సకలగుణాలంకృత యగు [illegible] సోదరి గంగయే యని యాతఁడు మనస్సున నిశ్చయించెను.

మనోరమ కకాలమృత్యువు తప్పినను గంగవలన గలుగుబాధ మాత్ర మేమియుఁ దప్ప లేదు. మనోరమను రహస్యముగ హింసింప గంగ నానావిధములగు నూతనోపాయములను గనిపట్టుచుండెను. కాని యసహాయులకు సహాయుఁడును, దుర్బలులకు బలము ను, అనాధలకు నాధుఁడును నై, యెవ్వఁడు సమస్తవిపత్తు [illegible] యుం డెనో యట్టిభగవానునికృపాదృష్టి యిప్పుడు మనోరమపై సంపూర్ణ ముగ నుంటుటచే [illegible] యుండఁగ నన్నియు బయలుపడు చుండెను. కతమే మన, ఇప్పుడు పార్వతి మొదలగు వారందఱు మనోరమపక్ష మవలంబించిరి. [illegible] ప్రతిదినము సంభవించు చున్నస్వల్పవిషయములుగూడ నూహను చెవిసి యడు చుండెను. అటు లయ్యు నిందులకై [illegible] గంగ నప్పుడముకూడ ననుటలేదు. గంగమాత్రము తనస్వభావానుసరణముగ నోపదుని వహోత్తమున నామెను దుర్వాక్యము లాడుచునే యుండెను. వినికిని నొందకొన్నదిన మున మిగులవిరక్తుఁడై మాధవరావు మనోరమను పుట్టినింటికనుప నమకట్టి, ఆదినముననే యీవిషయము మామెచెవిని వైచెను.

మాధవునిచరిత్రదోష మింతవరకును పోలేదు. ఇట్టిదోష మొ క్కపరి మనుష్యునిచారిత్రమును స్పృశించినచో నంతమాత్రమున బోనిచ్చునా? సరిగా గన్నులు దెఱచిచూడవలెను. కాని మాధవరా

నాసహాయక లేదు. నిన్ను పుట్టినింటికి బంపుటకు నిజమైన కారణ మిదియే" అని పలికెను.

మనోరమ కోపులకపోలములపై నానందాశ్రుపూరము ప్రవహింప సాగెను. ఆమెహృదయమున నంతటి సుఖము డైనా ఆనందమును నందు చెప్పననొక కల్పనాతీతమయ్యెను. మనోరమ కంపిత స్వాంతము తోడను కరుణాజనకస్వర ముతోడను "నాథా! మరల నన్ను చెంతనుంచుకొని నడుపుడు. ఎచ్చట మీ రుందురో యదియే నాకు స్వర్గ మనెను.

మాధవరా వుచ్చైస్స్వరమున నిట్లనెను "ఏమీ? నే నెందున్న నందే స్వర్గమా? అది యబద్ధము. నాదుమిక్కిలి నే నెచ్చట నుందునో యదియే భయానక మగు రౌరవనరక మై యుండవలెనే! నేను నరకములో కీటకమను. ఈజగమున నాయట్టియధమాధముడు మఱెవ్వడు."

"పతివినా, స్త్రీ కన్యము స్వర్గమైనను సరిగా దని నానమ్మకము. స్వర్గ మనుమాటయే నాస్మరణకు రాదు. అది మీకు వ్యతిరిక్తమైన నే త్రికరణశుద్ధిగ జెప్పుచుంటిని — ఆస్వర్గమేమియు నాకు వలదు. నాకు మీతో బాటు నరకమే సౌఖ్యము!"

మాధవరావు స్తంభితుడై పోయెను. ఇదేమి యీమె యాపూర్వపుమనోరమయేనా! చాలతడవు స్తబ్ధుడై యుండి యనంతర మాతడిట్లనెను. "మనోరమా! నీ వేమనుచుంటివి? నీ కెట్లుగనా యేమి? నే ఘోరపాతకినిని సుమా! నాలో నాకే సిగ్గగుచున్నది. ఇట్టి పాప, నీచుడు, అధమాధముడు నగుభర్తను నీవు తిరస్కరింపవా?"

"ఏదినమున మిమ్ము దిరస్కరింప నాకు బుద్ధి వొడమునో — అంతకుపూర్వమే భగవంతుడు నా కంతము గలిగించుగాక! మీకు నూర్గురు దాసీలున్నను వారిలో నన్నొకదానిగా నంగీకరించినచో నాకు జాలును. నాకు మీచరిత్రదోషమును బరికింప నిచ్చలేదు. నా కెవ్వరును జూప నక్కఱ లేదు. ఏదినమున మీదోషముల గాంచ

మున భంగ మయ్యెను. ఆమె యసాధారణగర్వ మింతకాలమున కీగినమున నీరయ్యెను. ఈవిషయములన్నియు నామె కెంతో యసహనీయము లై యుండెను. మనోరమ విషప్రాశన మొనర్చిననాటగోలె గంగహృదయమధ్యమున ప్రచండప్రళయ ముద్భవ మై యుండియు బయటి కాభయంకర మగుతుఫానుచిహ్నము లేమియు గానవచ్చుట లేదు. గంగ లోలో నత్యంతక్రుద్ధ యై యుండియు మహాప్రళయము సంభవించుటకు బూర్వము ప్రకృతి యెట్లు శాంతభావము వహించి యుండునో యట్లే గొన్నిదినములవఱకు బాహ్యావర్తనము శాంతి ధారణ మొనర్చి యుండెను.

మనోరమ పుట్టినింట కేగినప్పటినుండియే గంగవర్తనము చప్పున మాఱిపోయినది. మొదట నామెహృదయమున నున్నపితృశోకము గుభాలున బయటికి యుబికెను. తండ్రికొఱ కామె యనేకక్షణము లుచ్చైస్స్వరమున రోదన మొనర్చెను. కాని పూర్వమువలె నొక్కరు కూడ నామె నూఱడించుటకు రారైరి! వలదని చెప్పుటకు చెల్లెలు పార్వతిమాత్ర మొకటిరెండు మాటలుఁ జెప్పి యామెను సమాధాన పెట్టుటకు కొంచెము ప్రయత్నించెను. ఇట్లగుట పాప మామె యెంతసేపేడువగలదు? తుదకు తనకు దానే యూరడిల్లెను. తరువాత నామె పూర్వస్వరూపధారణ మొనర్చెను. ఎవరితో నేమియు మాటలాడక గంగ యింటిలోని వస్తువులపై దనకోప మంతయు దీర్చికొను చుండెను. చెంబులు, తప్పేలాలు, గిన్నెలు, పళ్ళెములు మొదలగువానిని జితుకగొట్టుటకును, పప్పు, బియ్యము, నూనె, నేయి మొదలగువానిఁ బాఱబోయుటకును బ్రారంభించెను. ఇవ్విధమున గంగ వంకరపను లొనర్పసాగెను. చాలకాలమునుండి మాధవరావిదియంతయుఁ జూచీచూడనట్లు సహించి యుండెను. కాని యిప్పుడు సోదరిదుశ్చర్య లన్నియు నాతనికిమిగుల నసహ్యము గలిగించు

చుండెను. ఇప్పట్టున నా సెంక మున్ను నున్న సంసారము వృద్ధికి వచ్చుమార్గము లేదని తలంచి గొంకు గొందినమనసు మాధవరావు "గంగా, వినుము, నీ పిల్లొనన్నిచ్చుచున్నచో నెంకమాంద నేనొప్పుదు ప్రో" దనెను.

గంగ యీనినపులివలె కోపమున పండ్లు పటపటకొఱుకుచు నుచ్చైస్స్వరమున "నిజమేరా నాయనా! ఇప్పుడు నా పనులు నీకెం దుకు బాగుగ నున్నను! నీ విప్పుడు మాయాయదారి పెండ్లముపలలోఁ జిక్కిపోయినావు. ఆముష్టిముండదాని వాళ్ళు నీ యత్తమామలు నిజముగా నీకేదో మందో మాకో బెట్టి వలలో వేసికొన్నారు. ఆ యింద్రవంశము నిర్వంశముగాను! చచ్చినవాళ్ళు నాకు గనుపడినచో చీపురుకట్ట దీసి కొని దిగతుడుపు పెట్టుదును" అని యఱచెను.

మాధవరావు మిగుల నంతప్తుఁడై "నీకు నే నొక్కటే మాట జెప్పెదను. నీవు నన్నెంతగ నైన దిట్టుము. కావలసినచో నాభార్యను నీయిచ్చవచ్చిన ట్లనుము. ఇందుకు నిన్నేమియు నననే. పాప మావృద్ధుల నెందుకు శపించెదవు! నిష్కారణముగ వారిని దిట్టినచో నీ వెన్నటికిని బాగుపడవు." అని నచ్చఁ జెప్పెను.

"నీ మొగముమండ! చచ్చినవాడా! పెండ్లమునకు లొంగిపోతి వని నీకు సిగ్గైనను లేదఁటరా! అత్తవారిపక్షమై నామీఁదికి పోరా టమునకు వచ్చెదవా! నీసిగ్గు బొగ్గులుగాను! ఛీ, నీ మొగమున నుమియా! చచ్చినవాఁడా, నీపాపము నీవే, యనుభవించెదవులే! ఆఘాతకిని నిన్ను మంత్రించి వలలో వేసికొన్నది. ఉరిపెట్టుకొని చావుము!"

"నిజముగా నిప్పుడు నాకురిపెట్టుకొని చచ్చుయోగమే వచ్చి నది. అదియే యుత్తమము. కాని చండాలురాలా! నాకన్నముందు నీ వీప్రపంచమున లేకుండబోవు టావశ్యకము, దుష్టురాలా! నీవే

నా సర్వనాశనమునకుం గారణమవు. నీమూలముననే నేను స్వర్గ మోక్షములకు దూరుఁడ నైతిని. సంసారసుఖంబును నీట గలిపితివి. సౌఖ్యము నడుగంటం జేసితివి. చిన్ననాటి సహవాసముగ నాశీల మన ర్చితివి. నీవే-నీవేయిందుకు పాపపలవయితివి—"

"చచ్చినవాఁడా! పెండ్లామకుఁడు ప్రత్యక్షముగా నున్నాఁడా? నీకుల ముయి మైపోను! నీ ముఖమెటువంటిదే! సరే, యిదిగో పోతున్నా, నేనుసా రముమీఁద నిప్పుపెట్టి నేఁ బోయెదను. నేచచ్చినతరువాత నీ వేమాత్రము సుఖపడెదవో చూచెదను!"

ఆచండాలురాలుగ్రస్వరూపధారిణి యై వచ్చి క్రోధావేశంబున శరీరము కంపింప, తనచిన్నచిన్ననగలు, పుత్తడిధోవతులు కొన్నిటిని దీసికొని, యెదుటం గనబడినవస్తువులను ధ్వంసము చేయుచు నింటినుండి తత్క్షణము బయటికేగెను. జనులును నిర్ఘాంతపడి చూచుచుండిరి. గంగ నెవ్వరును వారింపలేదు. ఆసర్వప్రళయకారిణిమూర్తి సమ్ముఖమున నిలుచుట కెవ్వరుసాహసింపలేదు.

ఆదినమున గంగజాడ యెవ్వరికిని దెలియలేదు. రెండవరోజున నామె పినతల్లియింటికి జరిగినట్లు దెలియవచ్చెను. ఈకల్లోలమువలన మాధవరావు మిగుల ఖిన్నుఁడయ్యెను. ఖిన్నహృదయుఁడును ప్రఫుల్లమునర్పుట కై యాతఁడు మరల తార నన్యభావమున శరణుం జొచ్చెను. మరల సురాపానము ప్రారంభమయ్యెను. మిత్రులందఱు గలసికొనిరి. మరల మనోరమ సౌఖ్యమున కంతరాయము వాటిల్లెను. వారముదినములలో మాధవరావు శ్వశుర గృహమున కరుగవలసి యుండెను. ఆవారముగడచెను. ఇట్లే నాల్గువారములు తిరిగివచ్చెను. కాని మాధవరావునకు వాగ్దానము స్మరణకు రాలేదు. నడుమనడుమ నెప్పుడైన సరళహృదయయు నిర్దోషయు నగు భార్య స్మరణకు వచ్చినప్పుడుమాత్ర మామెకొఱ కాతని మనస్సు

న్యాయముల సంపాదించుచుండెను. కాని యాతని స్థితియంత క్షణికము. క్రమక్రమముగ
నాతఁడు మనోరమాసంగతియే మఱచిపోయెను. ఇవ్విధమున నప్పుడే
యాఱుమాసములు గడచిపోయెను. అనంతరము మాధవరావు
శ్వశురాలయమునకేగుట తటస్థింప లేదు.

౨౯

క్రమక్రమముగఁ బిత్రార్జిత మంతయు వ్యయమయ్యెను. వ్యాపారము
చక్కఁగ నడుచుటలేదు. కర్చు మాత్రము మెండుగ నుండెను.
చేత సొమ్ములేదు. వ్యసనములు సాగి తీరవలెను. అందువలన
ధర్మాధర్మవిచక్షణ సేయకయే విత్త మార్జించుటకు మాధవరావు
ప్రవృత్తుఁడయ్యెను. అడ్డపెట్టువా రెవరును లేనిచో చంచలవృత్తి
గలమనుజునకు ధర్మాధర్మములయందును, పాపపుణ్యములయందును
లక్ష్య మెట్లుండును? ఎంతదుర్మార్గ మైనను సరే ద్రవ్యలాభము
గలిగినచో నంతియే చాలు, మాధవరా వెంతయో సంతసించును. ఈ
ద్రవ్యమువలన నే యాతని వ్యసనవ్యాపారములు సాగుచున్నవి.
మానసస్థితియం దేదో కొంచెము పరివర్తనము గలుగునమయముననే
యాతఁడు భార్యతో శ్వశురాలయమున కరిగియుండినచో క్రమక్రమ
ముగ దుస్సాంగత్యమునుండి విముక్తుఁడై మరల సత్పథమునకు వచ్చి
యుండును కదా! కాని దైవయోగము వేఱుగ నున్నది. 'బుద్ధిఃకర్మా
నుసారిణీ' యనుట నిశ్చయము.

ఇవ్విధమున దాదాపు వత్సరము గడచిపోయెను. ఇటుల జరిగి
జరిగి మాధవుని పాపకర్మములకుఁ దగినప్రాయశ్చిత్త మగునమయము
సమీపించుచుండెను. ఇప్పు డాతని కట్టిమానాభిమానములును లేవు.
ఆతనిస్థితి తడిసిగాని గుడిసె కట్టఁడన్న ట్లయినది. ఒకదానివలన
మఱియొకపాపకర్మ మాతనిని జుట్టుకొనుచుండెను. ఇట్టిస్థితిలో
నొక్కదిన ముదయమున మాధవునియూర నాల్గువైపుల నొకస్త్రీక

ముగ పోలీసువారు వచ్చి చుట్టుకొనిరి. ఒకపోలీసినస్పెక్టరును గుప్త
పోలీసుసంఘములోని యొకరిద్దఱును గ్రామమునఁ బ్రవేశించిరి.
సమయమున మాధవసదాశివులిరువురు కచేరిచావడియందు గూర్చుండి
యుండిరి. బయట గడబిడ యగుటతోడనే సదాశివుఁడు చప్పున
లేచి యదియేమో కనుగొనుటకు బయటికి వచ్చెను. ఇచట మాధ
వుఁడు పలాయితుఁడగుటకు మార్గ మరయుచుండెను. కాని వాని
ప్రయత్నము వ్యర్థ మయ్యెను. రహస్యపరిశోధకులు కచేరిచావడిద్వారము
వద్దకు వచ్చినిలిచి కర్కశస్వరమున నిట్లనిరి. "రామచంద్రపం
తులుకుమారుఁడు మాధవరావు జనార్దనదీక్షితునికొడుకు సదాశివ
రావు నెచ్చట నున్నారు?"

సదాశివునిమనసున నెట్టిపాపమును లేదు. అతఁ డేమ భ్రమను
వెలువక "నేనే సదాశివరావును. ఈతఁడే మాధవరా" వని మాధ
వుని వ్రేలితోఁ జూపెను.

ఇనస్పెక్టరు వెంటనే జేబులోనుండి రెండుకాకితములఁ దీసి "మిమ్ము
రువురను ఖైదుచేయుటకై యీవారంటు వచ్చి యున్నది" అని
పలికెను.

సదాశివుఁడు విస్మితుఁడై "నామీఁదనా వారంటు! ఇదెందు
లకు? మేమేమి యపరాధ మొనర్చితిమి? ఫిర్యాది యెవరు?" అని
వారి నడిగెను.

ఇనస్పెక్టరు కఠోరస్వరముతో "ఫిర్యాదీ సర్కారువారు. ఆరోప
ణము దస్తావేజు బనాయించు. మీరు ఆగ్రాబ్యాంకు వేయిరూపా
యిల చెక్కుమీఁద పదివే లని అంకెలు దిద్ది బ్యాంకువారిని మోస
పుచ్చితిరి.

ఇంతవఱకు మాధవరావు నోటనుండి యొక్కమాటకూడ వెలు
వడలేదు. అంత నాతఁడు చప్పున " ఈసంగతి యసత్యము. ఆచెక్కు
పదివేలరూపాయలదే" యని నుడివెను.

అని స్పెక్టరు కనిబొమలు ముడివడ క్రుద్ధుఁడై యిట్లనెను. "నిజ
మో యబద్ధమో యది కోర్టులోఁ జెప్పవలెనుగాని, ఇప్పుడు మీరు
మా స్వాధీనమున నుండవలయును. మిమ్ము నరెస్టు చేసితిమి."

సదాశివుఁడు నిలువునఁ గ్రుంగిపోయెను. మాధవునిచర్య గాంచ
నాతనికి మిగులసంశయము కలిగెను. ఒక్కవారము దినములక్రిందట
మాధవరావు పేరుగల పదివేలరూపాయల చెక్కును తానే రసీ
దిచ్చి బ్యాంకునుండి సొమ్ముఁ దీసికొనివచ్చి యుండెను. ఈచెక్కు
ఫోర్జరీచేయఁబడిన దని యాతని కప్పటికించుకయు సందేహము
కలుగలేదు. ఇప్పుడు మఱి తా నేమిచేయవలయునో యాతని
కేమియుఁ దోఁచుటలేదు. ఈసంగతి మాధవరావు మిత్రుల కందరకు
వెంటనే దెలిసినది. కానియాశ్చర్యము! ఆదినమున కన్నుపొడిచి
కొనిచూచినను నొక్కఁడు కూడ మాధవుని చూచిపోవుట కైన
రాలేదు. ఆదినమున మాధవుఁడు తనస్నేహితుల యోగ్యత బాగుగఁ
దెలిసికొనెను; కాని యది మిగులనాలస్యముగ, సమయము మించిన
వెనుక!

వారంటు దీసికొనివచ్చినవారు బొంబాయిపోలీసువారు. కావున
వా రా యిరువురను బట్టికొని బంధించి బొంబాయికిఁ దీసికొని
పోయిరి. ఇయ్యాకస్మికసంకటము వినినంతనే పార్వతి మిగుల రోదన
మొనర్ప సాగెను. జగన్నాథునకును రామునికి నిప్పుడు కొంచెము
కొంచెముగ మంచిచెడ్డలఁ దెలిసికొనునంతటివయసువచ్చినది. తమ
తండ్రికిని మేనమామకును సంభవించినవిపద్దశను కన్నులార గాంచి
యేడ్చుచు దాము కూడ వారివెంట పోఁగ మొదలిడిరి. అప్పు డొక
నౌకరు వారినిఁ బట్టికొని బలవంతముగ నింటిలోనికిఁ దీసికొని
వచ్చెను. మాధవరా వేగముగ నానౌకరుతో దగ్గరగ నిట్లనెను.
నన్ను విడిపించుటకు మీ రేమియుఁ బ్రయత్నింపవలదు. నాకుఁ గల

యాస్తినంతయు విక్రయించివైచి సదాశివుని మాత్రము విడిపింప యత్నింపుడు ''

నిట్టివాక్యములతో నీవిషయము గ్రామమంతయు వ్యాపించెను.

## 30

మనుజున కూర్జితకాలము సమీపించినచో సకలదిక్కులనుండియు వానికి మహాభివృద్ధియే జేకూరి యహితవిషయములు కూడ హితప్రదము లగుచుండును. కానియొక్కొక్క కష్టకాలము ప్రాప్తించినచో మిత్రులుకూడ శత్రువులగుదురు. సరే తనకు జాతకవిధి కాల మహిమవలన నైననేమి, అదృష్టమువలన నైననేమి, మరి దేనివలన నైననేమి. మాహాత్మ్యము గలదనుటమాత్రము నిశ్చయము. మనము యథావిధిగ వర్తించినచో తప్పక యిట్లు సంభవించు గలదని దృఢముగ నెవరును జెప్పజాలరు. అంతయు దైవసూత్రముచొప్పున వాటిల్లుచుండును.

లక్ష్మీబాయి వెనుకటిసంవత్సరము ధాన్యము మొదలగునవి ఖరీదు చేసి నిలువ జేసియుంచినదాని కీసంవత్సరము నగుణ దేవునియతి కృపావిశేషమువలన రెట్టింపుధర వచ్చెను. ఈధాన్యము వలనను సొంతవ్యవసాయమువలనను దాదాపు రెండువేల యయిదువందల రూపాయలవరకు లాభమువచ్చెను. అట్లగుట నిప్పుడు దీక్షితుని కుటుంబమనస్తాపము వదలిపోయినది. సంసారవ్యయము గడచి నాల్గు డబ్బులు వెనుకబడు చుండెను. లక్ష్మీసామర్థ్యమువలనను, పరమేశ్వరు నభయహస్త మాపైపై నుండుటవలనను, ఆమె యేది తలపెట్టిన నది జయ మగుచుండెను. ఆమెస్థితి మిగుల నభివృద్ధియం దుండెను. నలువురిలో పరువునష్ట మని లేనిపోని డంబములకుబోవక ప్రామాణికముగ సకలదానధర్మాదికము లొనర్చువారిపై బరమేశ్వరు డెల్లప్పుడు కరుణాళుడై యుండుటయు, ప్రతివిషయమునను వారికి జయముకలుగుటయు, ననుభవసిద్ధమే కదా!

యుండినను, మంచిచెడు కాలములందును నొక రజ్జువుతో బంధింపఁబడి యుంటిమి. నను స్త్రవిషయములందును గాన స్వాతంత్ర్యము గాని తో సంసార శకటము నడచు టెట్లు? నే గిందఁబడినచో మీరు చేయూత యొసగి నన్ను లేవనెత్తి కొనవలయును. ప్రసంగవిశేషమువలన మీరు క్రిందికి జారినచో నే జేయూతనొసగి మిమ్ము నడకుండ బట్టికొనవలయును. ఇదియుండుటే యైకమత్యము. మనలు వేఱువేఱుగ మానవిరువుర మొకహృదయములము మీరు పతి, నేను పత్ని. మీరు శ్రేష్ఠులు, నేను నికృష్టను. మీరు సజ్జ్ఞానులు, నే నజ్ఞానురాలను. మీరు యజమానులు, నే దాసిని!”

వినాయకుని యానందమున కవధిలేకుండెను. సుఖసముద్రమున డుఘు నాతఁ డోలలాడు చుండెను. సాశ్రునయనుఁడై భార్యను గాఢాలింగనముఁ జేసికొని “ప్రాణేశ్వరీ! నీ వేమైన ననుము. నీవు నాకొనర్చిన యుపకారము లనంతములు. నే నవి మఱచిపోవునంతటి కృతఘ్నుఁడను కా” నని పలికెను.

లక్ష్మి మృదులాధరము పై చంద్ర రేఖవలె చిఱునవ్వు ప్రకాశించెను ఆమందస్మిత మర్థవిహీనము గాదు. తత్క్షణమే సామాన్య భిన్న వదనయై “అయితే నావలన మీ కేదో యుపకారము కలిగిన దని మీకు దోఁచినందుననే నాపై ప్రేమ నిల్పితిరా? పత్నీభావమున మీరు నన్ను ప్రేమించుట లేదు?” అని వచించెను.

“ఛీఛీ, అట్టియభిప్రాయము మున్నటికి వలదు. తొలుదొల్త నీపై ప్రేమ లేనిమాట నిజమే. మిక్కుమిక్కిలి నీవనినచో నా కెంతో భయముగ నుండెడిది. నీపేరు విన్నంతనే నాగుండె తటతట కొట్టుకొనుచుండెడిది. నిజముగ పై ప్రాణము పై కెగిరిపోయెడిది. కాని నీ విచటికి వచ్చినప్పటినుండియు నాభయమంతయు మాయమైనది. ఇంతియే గాక నీతో మాటలాడవలయు నని నాకిచ్ఛ వొడమినది. నీవద్ద

నెట్టి మోహిసెనే క్తి గలదో పరమేశ్వరున కెఱుక! ఇప్పుడు మాత్రము
నీపుతప్ప నా కితఃపరము లేదు. నీవు లేనిచో నేనొక్క గడియ ప్రాణము
గడుపజాలను!"

## ౩౧

సతీపతులు ప్రణయసంభాషణ మీరీతి జరుగుచుండ వీధిలో నెవరో
నుండి "వినాయకరావు గారూ! వినాయకరావుగారూ! వినాయకరావు
గారింట్లో నున్నారా?" "అనియెవ్వరో కేకలు వైచిరి. వినాయ
కరావది విని వెలుపలికి జనియెను. అంత రాధయు, మనోరమయు
గదిలో బ్రవేశించిరి. మనోరమ పుట్టినిల్లు వినాయకుని యూరే.

లోపలికి రాగానే రాధ యిట్లు ప్రారంభించెను. "అమ్మా! విన్నావా!
మనయూరి బాబాయికోడలు తెల్లవారుజామున బిడ్డను గన్నది.
మగపిల్లవాడు పుట్టినాడు. పిల్లవాడు మాణిక్యమువలె నున్నాడని చెప్పి
నారు! దేవుడు నీకు కూడ నట్టి బిడ్డ నీవలయునని నా కెంతో
ముచ్చట. ఆతల్లి జగదంబ నాకోరిక నెప్పుడు నెరవేర్చునో నీకడుపున
గూడ సంతనలను పుట్టించి యింటిలో నాట లాడుకొనుచుండ గన్ను
లార గాంచి మఱి చావవలయునని కొండంత ఆశతో నుంటిని.
దైవ మేమి చేయ నున్నాడో!"

"మీ రెందులకట్టుల చింతించెదరు! నాకుమాత్రము బిడ్డలు
లేరా!" అని లక్ష్మి నవ్వెను.

"మన మంతటి నోములు కూడ నోచితిమా! అయ్యో నాపిచ్చి
తల్లీ! నీకు బిడ్డ లెవ్వరే!"

"ఏమి! జగన్నాథుడు, రాముడు, ఎవరిబిడ్డలు?"

అనపేక్షిత మగు నీప్రత్యుత్తర మాలకించినంత నా వృద్ధురాలి
నేత్రయుగళ మానంద బాష్పములతో నిండిపోయెను. గద్గదికతో నామె
"బిడ్డా! ఈశ్వరుడు వారికి సంపూర్ణాయు వొసగుగాక! వారు

పిల్లలు పలుకు నేర్చుటయేమో. కాని వారు నిన్నమ్మా యని పిలువరు కదా! యనెను.

"అత్తమ్మా కాని పిలుచుటకు గాకపోయినచో నీ పెదనాన్నగారండి బాలకృష్ణున్ని నన్ను బిలువ నని చెప్పినను, వాడు నన్నమ్మా యని పిలచిన సంగతి చూచినావా?"

కోడలిపలుకులు ముఖ్యముగ నీకడపటిమాట లాలకించి రాధ యెట్టి మానసికము నొందెనదో చెప్పుటకు వలనుపడదు. "ఇప్పుడు నేనేగి బాలకృష్ణునకిది చెప్పెద" నని యామె యచటనుండి వెడలిపోయెను. బాలకృష్ణుడు తన్ను నావృద్ధురాలికి ప్రాణము. రాధ యిప్పుడు మునుపటి రాధవలె నుండలేదు. ఆమె నేత్రములలోని జలవర్షము కొంతకాలమునుండి నిలిచిపోయినది. ఆమెజిహ్వాయంత్రము పూర్వమువలె నిప్పుడు రేయింబవళ్లు నడచుచుండుటలేదు. ఇంతియే కాక నామెముఖముపై నిప్పుడు కొంచెము వికాసము కూడ గాన్పించుచుండెను. వృద్ధురాలిప్పుడు సంతుష్టురాలివలె గానవచ్చుచుండెను.

అత్తగారు బయటి కేగినతరువాత లక్ష్మి మనోరమ నుద్దేశించి "మనోరమా! నేను నీమొగ మిట్లు చిన్నబోయిన దేమి?" అని ప్రశ్నించెను.

పుట్టినింటికి వచ్చినప్పటినుండియు మనోరమ చాలమట్టునకు దిన మంతయు లక్ష్మియొద్దనే గడపుచుండెను. మనమున సకలవిషయములను, సమస్తదుఃఖములను, ఆమె లక్ష్మికడ దాపక స్పష్టీకరించు చుండును లక్ష్మియు ననేకవిధముల నామె నూరడించుచు, హిత వచనము లుపదేశించి దుఃఖోపశమన మొనర్చి యామెకు ధైర్యముం జెప్పు చుండును. ఇందువలన పాపము మనోరమ కొకవిధముగ నిం చుక శాంతి కలుగుచుండెను లక్ష్మిపలుకు లాలించి మనోరమ దీర్ఘ

"దేవునిదర్శనమె మనకు లభింపవలయు ననునిచ్చయున్నచో మన మీవిషయమున లక్ష్యముంచ నవసరమున్నది. స్త్రీజాతి కింతకంటె నవమానకరమైన దేది! మనోరమా! నాకు యథార్థము చెప్పుము సాధనరావును జూచుటకై నీమనసు వేగిరపడు చున్నదా లేదా?"

శిశిరసిక్తప్రభాతకమలమువలె బాలికనేత్రద్వయము మరల నశ్రుభరాక్రాంత మయ్యెను. అల్పకాలములోనే యొకటి రెండు బాష్పబిందువులు కూడ నామె స్నిగ్ధకపోలయుల్పై మెఱయ సాగెను, అపవిత్రదుఃఖాశ్రువులే లక్ష్మిప్రశ్నమునకు ప్రత్యుత్తర మొసగెను. మనోరమ కింక వేఱుగ ప్రత్యుత్తర మొసగ నావశ్యకత లేదు. లక్ష్మితనచీరెచెఱగుతో నామె యశ్రువులు దుడిచి వైచెను. అటుపిమ్మట మనోరమ కొలదికాలములోనే సుస్థిరయై "ప్రాణ మొసగినను, సఖి! యొక్కసారి వారిదర్శనము నాకులభించునా చెలీ! యనెను.

అనుచుండ బాలికకు దుఃఖము పొంగి పొరలివచ్చెను. ఆమె పెద్దపెట్టున రోదన మొనర్ప దొడగెను. లక్ష్మియామెను చేరదీసి బుజ్జగించి శాంతవచనముల నోదార్పు ప్రసంగవాక్యము లిట్లనెను.

"చెలీ మనోరమా! నిట్లు దుఃఖింపకుము. నీవట్టి సాధ్వికి నీశ్వరుడెల్లప్పుడును గష్టములు కలిగింపడు. నీవట్టి పతిభక్తితత్పరయగుసాధ్వీమణిగా నెంచుననగా. నీభర్త వేశ్యాసక్తుడును, వ్యసనాసక్తుడును నై యున్నను నీవందులకు కించుకము నిష్ఠురములాడుట లేదు. అతడు ఘోరతర పాపపంకిలమున మునిగి యున్నను నీ వతని దేవునివలెఁ బూజించుచున్నావే! యింక నీపతిభక్తి కంతము కలదా! ఏసాధ్వికిట్టి యకృత్రిమ పతిభక్తి యుండునో యట్టిదానిని భగవంతుడు పతిసుఖవిముఖ నొనర్పడు. చెలీ! నామాట నమ్ముము రెండుదినములకో, లేక రెండుమాసములకో నీసర్వస్వము నీయధీన

మగును. ప్రస్తుత మేదో దురదృష్టవశమున ననుభవింపవలసి వచ్చిన దానిని కొంతకాల మనుభవింపక తీరదు. దేవతలకుం గూడ ప్రాక్కృత మనుభవింపక తీరదు. ఇక మనుష్యమాత్రులగు మానవులమాట చెప్పనేల!

లక్ష్మి పలికిన ప్రియభాషణములవలన మనోరమకు గొంతయూ ఱటగలిగెను. ఇంతలో వినాయకరావు చేతనొక యుత్తరముం బట్టుకొని మ్లానవదనుండై యచట కరుదెంచెను. భర్త విషణ్ణవదనమును గాంచినంతనే ఏమది, మామగా రెట్లున్నవారయిన దేమి? ఏమియువిశేషములు లేవుకదా? యనిలక్ష్మి వేగిరపాటుతో నడిగెను.

భార్యమాటకుఁ బ్రత్యుత్తర మొసంగకయే వినాయకరావు పత్త్రమా మొకందించి దీర్ఘనిశ్వాసమువిడిచి యచటనే నిలువఁబడియెను. లక్ష్మి కంపితహృదయముతో లేఖలోని నాయుత్తరమాక్రిందివిధముగఁ జదువుకొనఁదొడగెను.

శ్రీ జగదీశ ప్రసన్న!

తీర్థస్వరూప రాజమాన్యరాజ శ్రీవినాయకరావు బాబుగారి సముఖమునకు—

తమ కుమారుఁడు జగన్నాథరావు ననేక త్రికాలాభివందనములాచరించి చేయువిన్నపములు.

ఇచ్చట మేమందరము మహావిపత్తున మునిగియుంటిమి. ఈదిన ముదయమున పోలీసువారు శ్రీనాయనగారిని, శ్రీనాథరావు మామ గారిని ఖైదుచేసి తీసుకొనిపోయిరి. ఏదో ఫోర్జరీ చేసినట్లు వారిమీదఁ నేర మారోపించిరని మేము వింటిమి. ఏదుర్మార్గులు విరోధము వలన నీయపనింద దెచ్చిపెట్టిరో తెలియదు. ఇచట మాకెవరును సహాయ మొసఁగువారు లేరు. తుదకు ధైర్యమైన జెప్పువారైన లేరు. ఈసంకటము నుండి మమ్ముద్ధరించు భారము మీపై నున్నది.

మనోరమ మొట్టమొదట సమస్తవృత్తాంతమును వినియెను. నోటి వెంట మాటలేదు. స్వప్రజ్ఞానముకూడ లేదు. కాని తుదకు చూచు చుండగనే యామె మూర్ఛితయై గుభాలున భూమిపైబడియెను.

౩౨

నానావిధోపచారములవలన మనోరమ మూర్ఛనుండి తేఱి యించుక స్మృతి బొందెను. లక్ష్మి యామెను ననేకవిధముల నూరడించి యిట్లనెను "చెలీ మనోరమా! నిజముగా నీభర్త యనపరాధి యైనచో భయపడవలసిన యవసరము లేదు. సత్యమును రక్షింప భగవంతుఁ డున్నాఁడు సుమా! ఈ కేసు బొంబాయికి వెళ్ళినదని వినుటచే నాకెంతో ధైర్యము కలిగినది. నావిషయముగా భావించి వారిని విడిపించుటకై ప్రయత్నము చేసెదను. నీ వేమి తలచుచుంటివో కాని యీవిషయమున మనకు జయము కలుగునని నావిశ్వాసము"

ఎల్లరు చకితులై లక్ష్మివంక జూచు చుండిరి. వినాయకరావు తుదకు దీర్ఘనిశ్వాసము విడిచి "ఎంతయినను నీ వాఁడుదానవు. ఈపని నీవలన నెట్లు నెఱవేఱఁగలదు?" అని యడిగెను.

ఆసమయమున లక్ష్మి యిట్లనెను. "ఏను పురు! మేమాఁడువారల మగుటవలన నీచాత్రపుఁ బని మావలన సానుకూలము కాదా? అనేకవిషయములలో బురుషులకన్న మేము బలహీనుల మగుట నిజమే కాని, సూక్ష్మవిషయముల గనిపట్టి కష్టములనుండి విముక్తులఁ జేయుట మావలనఁ గాకుండనా యేమి?"

పత్నిదృఢవాక్యము లాలించి వినాయకరావించుక యచ్చెరువొంది యిట్లనెను. "నీవు కోపము దెచ్చుకొనకుము నీ బుద్ధి, నీసామర్థ్యము, మొదలగునవన్నియు నే నెఱుఁగుదును. కాని యిట్టియాపదలలో నీవలన నెట్లు సాహాయ్యము కలుగునో నాకు దోఁచకున్నది."

"ఆపదలు వచ్చినపుడు కలవరపడి యంతయు మఱచినను చేయు

వలసిన దానిని చెప్పుతును. మా మేనమామ బొంబాయిలో ప్రసిద్ధి కెక్కిన బ్యారిష్టరగుట వినియుందువు గాతలుగా రాజంచునా? వారి సాయమువలన నే నీసంకటమునుండి వారిని విడిపింపఁ బ్రయత్న మొనర్చెదను. రేపటి తెల్లవారుజామునే మనము బొంబాయికి బయలుదేఱవలయు నని నా యభిప్రాయము."

ఇంతలో రాధ యచట కరుదెంచెను. కోడలిపై పడ్డ కేసు సంగతి తెలిసినంతనే వృద్ధురాలిమనను వ్యాకుల మయ్యెను. ఆమె పెద్దపెట్టున రోదన మొనర్ప సాగెను. చాలకాలమునుండి యామెయిదు నలి యేడ్పు నెవ్వరును జూడలేదు.

నానావిధములగు సమాధానవాక్యములతో లక్ష్మి యత్తగారి నూరార్చెను. తనకొడుకును విడిపింప బ్రయత్నించుటకై తనకోడలు బొంబాయి కేగు నని తెలిసినమీఁదట రాధ కెంతో ధైర్యము కలిగెను. ఇప్పుడా వృద్ధురాలు తనపుత్రుని నిశ్చయముగ నయ్యాపద నుండి విముక్తుం డైనట్లు తలంచెను. ఏవిషయమున వినాయకునకు విశ్వాసము లేకుండెనో యావిషయమున రాధకు పూర్ణవిశ్వాసము కలిగినది! పాపము హతభాగిని యగుమనోరమ నెన్నియో తెన్నుల నూరార్చి వారందఱామె నింటికి చేర్చిరి.

మఱునాఁడు తెల్లవారుజామున బయలుదేఱి తగుసమయమునకు వినాయకరావు భార్యాసహితుండై బొంబాయికి వచ్చి చేరెను. లక్ష్మి మేనమామ "గిర్గాం" లో నుండెను. తన మేనకోడలు నామెభర్త యాకస్మికముగా నరుదెంచుటచే మేనమామయు నాతనిభార్యయు మిగుల నానందించిరి. మేనమామను గాంచినంతనే లక్ష్మి యాతని పాదములపై బడి "మామా! నన్ను జుట్టుకొన్న యీభయంకర విపత్తునుండి రక్షించుటకు నీవు తప్ప నింకెవ్వరును లేరు" అని విజ్ఞపించెను.

మామగారి కిది యేమియుఁ దెలియుటలేదు. అతఁడు మహాపస్మారము
మునఁ బడియెను. ఇది గాంచి వినాయకరా వాతనికి సమస్తవృత్తాంత
మును నివేదించెను. లక్ష్మియన్న మేనమామ కెంతో ప్రాణము.
ఆమె నోదార్చి యాతఁడిట్లనెను. "అమ్మా దీనికై నీవు నాకడ నిట్లు
జాలిగదుర పరితపించెద వెందులకు; ఎంత వెఱ్ఱి తల్లివి! అమ్మా నా
ముద్దులలక్ష్మిపై వచ్చిన యాఁపద నామీఁద వచ్చినట్లు కాదా! నీవే
మియుఁ జింతింపకుము. వినాయకరావూ, మీరు కూడ స్తిమితముగ
నుండుఁడు. వారిని విడుదల చేయించుటకై నాచేతనైనమట్టునకు
ప్రయత్నించెదను"

ఆమె మేనమామ యగు శ్రీధరపంతులు బొంబాయిలో ప్రఖ్యాతి
వహించిన బ్యారిష్టరు. కోర్టులో నీతఁడన్న నెంతయో గౌరవము.
శ్రీధరపంతులు వకాలత్ నామా పుచ్చుకొని దానిలో నపజయ
మొందుట బహుశః ఎవ్వరును జూచియుండరు. తొందర తొందరగ
భోజన మొనర్చి యాతఁడు పోలీసుకోర్టు కేగెను. కేసువృత్తాంతమంతయుఁ
దెలిసికొని ఛీఫ్ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటువద్ద ముద్దాయిలను జామీను
మీఁదట విడుదలచేయు విషయమున వెంటనే పిటీషను పెట్టెను. కాని
వానిప్రయత్నము వ్యర్థమైపోయెను. శ్రీధర పంతులు తానే జామీ
నుండుటకు సిద్ధపడియెను. కాని మేజిస్ట్రేటిట్లనెను. ఏవిధముగను
మీవినతి నంగీకరించుటకు నాకు వీలుపడినది కాదు. ఇందుకు నేను
మిగుల జింతించుచుంటిని. అయినను మీరు సరిగా తగిన యేర్పాటు
లన్నియుఁ జేసికొనుటకు తగిన యవకాశము సంతోష పూర్వకముగ
మీకొసఁగుచుంటిని.

యథాసమయమునకు విచారణ ప్రారంభమయ్యెను. బ్యాంకులోని
యిద్దఱుముగ్గు రుద్యోగులయొక్కయు, చిక్కు నొసఁగిన వాని
యొక్కయు, వాఙ్మూలములు మొదట తీసికొనిరి. ఆసాక్ష్యమువలన మేజి

ప్రేటు కేసు సెషన్సుకోర్టుకు కమిటుచేసినట్లు తనయభిప్రాయమును కనబఱచెను. కేసు స్వభావమంతయు జూచి శ్రీధరపంతు లందుల కంగీకరించెను. సెషన్సువిచారణదిన మింకను రెండుదినములుమాత్రమే యుండెను. అట్లగుట ముద్దాయీలు జైలులో విశేషకాలము నిరాశులై కష్టపడవలసిన యోగము తటస్థింప లేదు.

సెషన్సుకోర్టులో మరల సాక్షు లందఱి వాఙ్మూలములుతీసికొనిరి. ఆకాలమున శ్రీధరపంతులు బొంబాయిలో ప్రఖ్యాతబారిష్టరై యుండుటచేతను, ఈ కేసులో నాతఁడు పూనుకొని పనిచేయుటవలనను సాక్షు లందఱు నాతనికి వెఱచి యాతని యభిప్రాయాను సారముగ వర్తించుట కంగీకరించిరి. వారి వాఙ్మూలములోని యసంబద్ధత జడ్జీగారికి జూరరులకును స్పష్టపఱచి ముద్దాయీల నిరపరాధిత్వమును బారిష్టరుగారు వారికి మిగులనమ్మకము గలుగునట్లు నచ్చబలికిరి. ముద్దాయీల తరఫు వారి మానసము లెల్ల సంతోషవికసితము లయ్యెను.

"నిర్దోషు లని యేకవాక్యముగ విడిదిపుచ్చ జూరీ లాలోచించుచుండ నంతలో మాధవరావు జడ్జి నుద్దేశించి యింగ్లీషుభాషలో ధారాళముగ నిట్లనెను. విజ్ఞస్వరూపులగు న్యాయమూర్తీ! జూరీ లోని యోసద్గృహస్థులారా! నేనుగొంత చెప్పవలసి యున్నది. చిత్తగింపుఁడు. మీదృష్టికి నేను నిర్దోషినని తోఁచినను, ఈశ్వరునిసమక్షమున నేను మహాదోషిని. నాతరపున మహావిద్వాంసుఁ డగుబారిష్టరుగారు తమయపూర్వకౌశలమువలన మీకన్నులలో దుమ్ముగొట్టెను. కాని పరమేశ్వరుని కన్నులలో దుమ్ముగొట్ట నాతనివలన గాదు. నే స్పష్టముగ నొప్పుకొను చుంటిని. ఈయపరాధము నేజేసితిని. నాతో సమానముగ బోనులో నిలుచున్న నాబావమఱది సదాశివరావు మాత్రము నాతో గూడ నిష్కారణముగ కష్ట మనుభవించుచున్నాఁడు.

స్వహస్తమున నాచేతే. ఇట్లొప్పుట కాతని కొసగితిని. ఆతడు దానిని మార్చి రొక్కమంతయు నాకు దెచ్చియిచ్చెను. ఈ చెక్కు వ్యవహార మాతం డేమియు నెఱుంగడు. ఇందుల కెట్టి శిక్ష విధింపవలసి యున్నను నది సంపూర్ణముగ నాకే విధింపుడు. ఇంతియే కోర్టువారికి నే విన్నవించుకొనునది.

మాధవరావునోటినుండి వెలువడిన యీపలుకు లాలించినంత కోర్టులో నున్న వారందఱు స్తంభితులై పోయిరి. బారిష్టరు గారిశిరము పైన వజ్రాఘాతము బడినట్లయ్యెను. మాధవరావును మిన్నకుండు మని రెండుమూడుసారు లాతడు కన్నుసన్న సేయుచు, నడుమనడుమ వారింప బ్రయత్నించెను. కాని మాధవరా వదియేమియు లక్ష్య పెట్టలేదు. ఇంక బారిష్ట రూరకుండలేక పోయెను. అతడు లేచి కోర్టు వారి కీక్రింది విధమున విన్నవించు కొనియెను.

“ముద్దాయితల తిరుగుచున్నది. అతడు బుద్ధివిహీనుడయి నాడు. తా నపరాధి నని యొప్పుకొనుచుండుట కూడ నాతడు డీనినంత నెఱిగియుండడు. విష్ణుస్వరూపుడ వగు నో న్యాయమూర్తీ! జూరీలోని సద్గృహస్థులారా! పోలీసు వారివలన నన్యాయముగ నిట్టి యసహనీయావమానము సంభవించెనేని మర్యాదగల మానవున కెవ్వని కైనను బుద్ధిభ్రంశము కలుగక మాన దని సర్వజ్ఞులగుమీరెఱిగి యే యుందురు. కాన కరుణామయు లగున్యాయాధీశులు ముద్దాయి యొక్క యీయసంబద్ధప్రలాపము నేమాత్రమును లెక్కగొనక విడిచిపుత్తురు గాక యని ప్రార్థించుచున్నాను.”

కాని యేమిలాభము? బారిష్ట రింకను కుర్చీపై గూర్చుండెనో లేదో యప్పుడే మాధవరావు మరల నిట్లు ప్రారంభించెను. “బారిష్టరుగారు వచించినది పొరబాటు. నా కేమియు మనశ్చాంచల్యము లేదు. నన్ను విడిపింపగలందుల కాతడెంతయో శ్రమపడి తన

చాతుర్యమంతయు వినిపించెను. ఇంతలో వారికి నేను యావజ్జ న్మము కృతజ్ఞుడనై యుందును. [illegible] రక్షించుకొనుటకు చాతుర్య మునకును తగు ఫలిత కోర్టువారి నొసంగుట శ్రద్ధాపూర్వకముగ నే వల దని కోరుచుంటిని. ఈపరగణా పాతకుండు కేవల మీయపరాధమే జేసియుండ లేదు. ఇంక ననేక పాతకములచే నీ బాధకుండు తన చరి త్రకు కళంకము దెచ్చికొనియెను. అందుకు తగిన ప్రాయశ్చిత్త మనుభవించిన గాని చరిత్ర సంశోధన మొనర్చ నవస్థ కలుగ నేరదు. కేవల మీదే కారణమునకై న్యాయాధీశుల కన్నులలో దుమ్ముగొట్టి యీ పాప జీవితమును సహించుటకు నాకే మాత్రమును నిష్టము లేదు" తరువాత వినాయకరావును గురించి యిట్లనెను. "వినా యకరావు! మా యున్న గాంని దీసికొని మీ యింటికి కరుగుడు. పాతకి యగు మనుష్యుని సర్గమువలననే యాతనికి కూడ నీయవమానము సంభవింపవలసివచ్చెను. నీయొక్కయు, నీ భార్య మేనమామయొక్కయు నుపకారము నే నాజన్మాంతము మఱచిపోను!"

నిరాతంకనిష్కంపితదీపజ్యోతివలెను, ప్రశాంతసమయమున గాన వచ్చు గంభీరసముద్రమువలెను, కోర్టంతయుం గొంతవడి మిగుల శాంతముగను స్తబ్ధముగను నుండెను. అందఱు చిత్రప్రతిమలవలె తటస్థముగ నుండిరి. తుదకు జూరీయభిప్రాయము మారి "ముద్దాయి యగు మాధవరావు దోషి. కాని కోర్టువారు వానిని క్షమింపవలయు నని" వారు సిఫారసుం జేసిరి. న్యాయాధీశుడును జూరీలసిఫారసునందు సంపూర్ణలక్ష్యముంచి ముద్దాయి మాధవరావునకు సంవత్సరము కఠినశిక్ష విధించి సదాశివరావు నిర్దోషియని స్థిరపఱచి విడదిపుచ్చెను.

## 33

కోర్టుబోనులోనుండి బైటపడగనే సదాశివుడు వెక్కివెక్కి యేడ్చుచు తనకనిష్ఠభ్రాత నాలింగనము జేసికొనియెను. అతని నోటివెంట మాటలేదు. కొంతవడి కతడు పెద్దపెట్టున రోదన మొనర్పదొడగెను.

బాష్పోదకముచే వినాయకుని వక్షస్థలము తడిసిపోయెను. కొంత
కాలములోనే యయ్యగారును పరస్పరానందాశ్రువుల దుడిచివైచికొని
అందఱును గలసి శ్రీధరపంతులుగారియింటికి వచ్చిరి. తనసోద
రుని విడుదలకు వినాయకరావెంతటిమహానందమును బొందుచుం
డెనో యంతకు నిమ్మడిగ మాధవరావును విడిపింపజాలనందుల
కంతకధిక దుఃఖము ననుభవించుచుండెను. గృహములోనికి
రాగానే వీరిరాకకై యెదురుచూచుచున్న లక్ష్మి యింటిలోనుండి
వీధిద్వారముకడకు బరుగిడి వచ్చి "ఏమయిన" దని మిక్కిలి యుత్కం
ఠతతో నడిగెను. వినాయకరావు చెప్పలేక యిట్లనెను. "కార్యము
నందు సగ మనుకూలమైనది. మామగారు నిర్దోషి యని స్థిర
పఱచి విడచి పుచ్చిరి. కాని పాపము మాధవరావున కొక్కవత్సరము
కారాగృహవాసశిక్ష—"

లక్ష్మి వ్యథితాంతఃకరణయై "మాధవరావుకొఱకు మామామయ్య
యంతశ్రద్ధగా పనిచేయలేదని తలంచెద" ననిపలికెను.
వినాయకరావు తద్వృత్తాంత మంతయు సవిస్తరముగ భార్యకుం
దెలిపి "మీమేనమామవా రిరువురివిషయమునను గూడ నొక్కటే
విధముగ నెంతయో శ్రమపడి పనిచేసిరి. కాని మాధవరావు తనకుం
దానే కారాగృహములోని కేగె" నని చెప్పెను.

లక్ష్మి అత్యంత చింతాతురయై "మనోరమ నింక నేనెట్లూఱడిం
తును! ఆసాధ్వీమణి కిప్పటికి మాటలేదు. మాధవరా విప్పుడు
నిశ్చయముగ పశ్చాత్తప్తుడై తనకుం దానే స్వయంకృతాపరాధము
నకు ప్రాయశ్చిత్త మనుభవింప నిప్పుడు ప్రారంభించినాడు. అదె
ట్లయిన నుండనిమ్ము. దీనినిబట్టి జూడ తుదకు మనోరమకు శుభప్రద
మగునని తోచుచున్నది."

వినాయకరావు విస్మితుఁడై "ఇంతవఱకు మనోరమకుఁ గలిగిన లాభ మేమి?" యని యడిగెను.

"అపరశుద్ధయహంకారము పరమేశ్వరుఁ డేరీతిగా నొసఁగెనో యది యంతయు మనసునుంచికొనిన కే. మనోరమ ప్రస్తుతవృత్తివలన నామెకు శక్తివర్తనమును నిరోధించుట కెప్పటికిని సాధ్యము కాదు. పతి దుర్మార్గప్రవృత్తుఁడై యున్నప్పుడు యుక్తివలన వానిని సన్మార్గమునకుఁ దీసికొనివచ్చుటకై ప్రయత్నించ నలయును. ఈవిషయము మనోరమ మనసునకు స్ఫురింపలేదు. ఆ మొముఖముననే విన్నదానిబట్టి నే నిట్లు చెప్పుచుంటిని. ఆమె పుట్టినింటికి రాక పూర్వము అనగా మాధవరావు నడనడి మారిపోవు సమయముననే యీమె యాతని కించుక సాయ మొనర్చి యుండినచో మాధవరా విప్పటి కీదుర్దశలకుఁ బాలుగాక యథార్థముగ నప్పుడే మరల సన్మార్గానువర్తియై యుండును. కాని యామె యట్టు లొనర్పక తా నిచటికిఁ బయలుదేఱివచ్చెను. అందువలనఁ దిరిగి మాధవరా వధః పతనమార్గమునఁ బ్రవృత్తుఁ డయ్యెను. కాని మనోరమవంటి సాధ్వీమణికా సంతతపతి సౌఖ్యాపరోధము? ఇందుకొఱకే సుమా మాధవరా విప్పుడు కారాగృహవాసశిక్ష ననుభవించుట. ప్రస్తుతము మనోరమవలన నెట్టిసహాయమును పొందకుండగనే మాధవరావు స్వచరిత్రసంశోధన మెట్లు నిశ్చయింప నగునో యామార్గముననే యాతఁ డవలంబించెను. అగ్నియందుఁ గాల్చి రంధ్రముఁ బొడవనిచో బంగారము ముడివేయుట యెట్లు వీలుపడును?

"నిశ్చయముగ నిదియంతయు నీదో వానియిచ్ఛయో: ఆజగదీశ్వరుఁ డేయుద్దేశమున నేవిషయము ఘటింపఁ జేయునో యది యల్పబుద్ధు లగుమానవుల కగమ్యము. సరే కాని మన మిప్పు డిచట వృథాకాలయాపన మేల చేయుచున్నాము? అచట మాయమ్మ యెంతయో దురపిల్లుచుండును."

కాని శ్రీగిరపంతులా దినము వారిని బోనీయలేదు. మఱునాటి ప్రొద్దిటిబండికి బొంబాయినుండి వారు తిరిగి తమయూరికి వచ్చిరి. సదాశివుని గాంచినంతనే రాధ యానందము బట్టశక్యము కాకుండెను. సదాశివరావు సజలనయనుఁడై తల్లిపాదములంబడి యామెను మన్నింపవేడుకొనెను. వృద్ధురాలు కొమరుని బాష్పములు తుడిచి వాని నూరడించెను. వీరు వచ్చిన సంగతి వినినంతనే మనోరమ లక్ష్మివద్దకుఁ బరుగెత్తుకొని వచ్చెను. మనోరమను జూచినంతనే లక్ష్మిమనసెంతయో వ్యాకులమును బొందెను. "చెలీ! ఏమైనది?" అని ఉత్కంఠితస్వరమున మనోరమ వచ్చుచునే యామెను బ్రశ్నించెను.

ఇట్లు బ్రశ్నించుచు మనోరమ కరుణాజనక దృష్టితో లక్ష్మివంక వీక్షించెను. ఆమెకు నిజవృత్తాంత మెఱింగించుట కెంత ప్రయత్నించినను వారికి సాహసము కలుగలేదు. మనోరమయెదుట మాధవుని యథార్థవృత్తాంత మతిగుప్తముగ నుంచునట్లు వారందఱు స్థిరపఱచికొనిరి. లక్ష్మి స్థిరచిత్తయై గంభీరముగ నిట్లనెను. "సఖీ మనోరమా! అంతయు శుభమయ్యెను. ఈశ్వరునికృపవలన తలపెట్టిన పనియందు మనకు జయమే కలిగినది. కాని నీపతి మే మెంతచెప్పినను మావెంట నిటకు వచ్చుట కంగీకరింప లేదు. అమ్మా! అతఁడిప్పుడు నిజముగ పశ్చాత్తప్తుఁడై యున్నాఁడు! ఒక్క సంవత్సర మజ్ఞాతవాసమున గడిపి స్వయంకృతాపరాధమునకుఁ బ్రాయశ్చిత్త మనుభవించినంత నాతఁ డిచ్చటి కరుదెంచును. ఇటులీవత్సరము గడచి యాతఁ డిచ్చటికి వచ్చినంత నప్పుడు నీ యాసర్వస్వముపై కేవలము నీయధికారమే యుండును గదా చెలీ! నీవిప్పుడంతగఁ జింతనొందకుము."

మనోరమ ఖిన్న వదనము కొంచెము ప్రఫుల్లమయ్యెను. ఆమె వెంటనే యిట్లనెను. "వారా భయంకర విపత్తునుండి విముక్తులైరి. నా కంతియే చాలును. వారికెచ్చట సుఖముగ నుండునో యచ్చటనే

సంతోషముగ నుండనిమ్ము. కాని చెలీ! ఇంతటి భయంకర పాప కార్యము వారు చేసిరని నే నమ్మజాలను. నిష్కారణముగ వారిపై నీయపనింద వచ్చినది. వారు నిర్దోషు లని నా యభిప్రాయము. వారిచరిత్రకుఁ గలంక మనునది యెప్పుడును సంభవింపనేరదు. వారికష్టము లన్నియు ననుభవించుట కేవల మీ పాపిష్ఠురాలి యదృష్ట దోషమూలమున సుమా!"

ఇంతవఱకు లక్ష్మి మనస్సెట్టి యస్వస్థతయు బొందియుండ లేదు. కాని మనోరమయొక్క సరళప్రకృతి, సరళప్రేమయొక్క గంభీరత మొదలగునవి మనసున స్ఫురించుటతోడనే లక్ష్మి నేత్రద్వయ మశ్రుపూరిత మయ్యెను. ఆమె తన యశ్రువులఁ దుడిచికొని యిట్లనెను. "సఖిమనోరమా! నీయట్టి నవనీతహృదయము గలవారు పృథ్వీతలమున నతిదుర్లభురాలు. అది చూచి నేను నైతము నీవంటి యంతఃకరణము కావలయునని యభిలాషపడుచుంటిని. అమ్మా! నీ యీసద్గుణసంపదలవలననే నీవు సుఖవతి వయ్యెదవు. నామాట గట్టిగ నమ్ముము."

లక్ష్మివాక్యప్పటికి నన్నృతము కాకుండిన మనోరమకు గట్టినమ్మకము. అందువలననే లక్ష్మిపై మనోరమకుఁ బ్రాణముకంటెఁ గూడ నధిక ప్రేమ. అప్పుడు లక్ష్మి పలుకులవలన నామె తనకుఁ దానే సమాధానపడియెను. ఆమె యీసంవత్సర మెప్పుడు గడచునా యని దినములు లెక్కబెట్టుకొను చుండెను. ఎల్లప్పుడును లక్ష్మి సహవాసమున వేళబుచ్చుటయందే యామెకు మిగుల నిష్టము. లక్ష్మికి విశ్రాంతి దొరికినఁజాలు. 'రామాయణము మహాభారతము' ఇత్యాది గ్రంథముల లోని నానావిధోపదేశరూపకపూర్ణవిషయముల నామెకువినిపించుచుండును.

## ౩౪

జగన్నాథుని రాముని నిచటికి దీసికొని రమ్మని లక్ష్మి సదాశివరావు నెంతయో బతిమాలుచుండెను. సదాశివు డింటికి వచ్చి వారము గడచినది. ఇచటికి వచ్చినప్పటినుండియు వాని సంతోషమునకు పరిమితి లేదు. ఇల్లు వాకిలి తోట మొదలగునవన్నియు నూతన వ్యవస్థితములై యున్నతి నొందుట గాంచి యాతడు విస్మితుం డయ్యెను. సర్వత్ర లక్ష్మిప్రశంసన మాలకించియు సంసారము సందర్భమునం దామె కట్టుబాట్లును, దక్షతయుం స్వనేత్రముల దిలకించి యాతం డాశ్చర్యనిమగ్నుం డయ్యెను. విశేషముగ నామె సంసర్గము వలన దనసోదరునివృత్తియందు గాన్పించుచున్న స్థిత్యంతరము కన్నులారం జూచి లక్ష్మియెడ దేవివలె లోలోన నాతడు భక్తు డయ్యెను. సంసార మన నిప్పు డాతనికి స్వర్గమువలె దోచెను. ఈసమయముననే పార్వతినామెబిడ్డలను దీసికొని రమ్మను లక్ష్మి వేడికో లాతనిచెవిని బడియెను. సదాశివుడు తనలో నిట్లనుకొనెను. "లక్ష్మి! ఈస్వర్గధామమునందు నివసించుటకు నీసోదరి పార్వతి యినుమంతయు నర్హురాలు కాదు. దాని నిచటికి దోడ్తెచ్చినయెడల నీనందనవనము మరల శ్మశానవాటిక యగును."

సదాశివు డామెతో స్పష్టముగ నిట్లనెను. "దాని నిచటికి దీసికొనివచ్చిన ప్రయోజన మేమియు లేదు. జగన్నాథుని రాముని మాత్రమిచటికి గొనివచ్చుటకై నేనిప్పుడే మనుష్యుని బంపెదను"

లక్ష్మి కిది యేమియు రుచింప లేదు. రాధయు వినాయకుడును గూడ పిల్లల నిరువుర మాత్రమేదీసికొని వచ్చుట కనుమతింప లేదు. అప్పు డింక జేయునది లేక సదాశివుడు తన భార్యకూడ యుచటికి వచ్చుట కంగీకరించెను. మంచిరోజు జూచి బాలకృష్ణుని దాసి సఖూబాయిని పార్వతిపుట్టినింటికి ప్రయాణము చేసిరి. పోవుచు

పోవుచు బాలకృష్ణుడు లక్ష్మికడ కరువెంచి నమస్కార మొనర్చి యిట్లనెను, "వదినే! జగన్నాథుని రాముని దీసికొని వచ్చుటకై నేనేగుచుంటిని. సరే కాని యచట గలయింకొకవదినె నిశ్చయముగా నీవంటిది కాదు. నేనేమియునా మెను వదినే యని పిలువజాలను. నీవు దీనికి సమ్మతించినయెడల నామె నిచటికి దీసికొని వత్తును."

లక్ష్మి నవ్వుచు "పొమ్ము మూర్ఖుడా! ఆమె నాకంటెను పెద్దది. కావున నీ కామె నాకన్నను పూజ్యురాలు" అని పలికెను.

"వదినే! నీ వాసంగతి విడిచి పెట్టుము. ఇప్పుడు కానరాక పోయినను నేను మీయిరువుర నొక్కచోట జేర్చినచో దాని సంగతి యంతయు నప్పుడే తెలిసివచ్చును. గుఱ్ఱము మైదానము దావునకే వచ్చినదిలే! మావదినవంటివదినె యీభూలోకమున నెచ్చటను దొరక దని నామనోనిశ్చయము!"

ఇట్లని బాలకృష్ణుడు నవ్వుచు బయటికి వచ్చెను. దాసికూడ నచ్చటనే యుండెను; పార్వతిని పుట్టినింటికి జేర్చి వచ్చిననాటనుండియు పాపమీవిషయము దాసిమనసును కలగుండుపడ జేయుచునే యుండెను. ఈదినము పార్వతిని తిరిగి తీసికొని వచ్చునుద్యోగము దానిపై బడుటచేత దానికి గలిగిన సంతోషము కడుపున నిమిడినది కాదు "అమ్మా! అమ్మా!" యని యఱచుచు నది యింటిలో నున్న రాధకడకు వచ్చిసంతోషమున బరవశయై "అమ్మా! యీనాడదాక నేనోరు మూసుకుండాను యేమంతమహా బాగ్గెవని చెప్పను! మాదొడ్డిల్లాలు గొప్పింటిపిల్లై యుండి యిట్టా అబద్ధా లాడుతుందా! నాయింటి కొచ్చి నాతో మాయయ్యకు చానాజబ్బుగా వుండాడ. బేగేయెల్లాలి. అందుకని నీవుకూడా నాతో రమ్మన్నది. నేనల్లి ముందీడకు దీసుకొస్తా మటియిదంతా నిబద్ధో యుబ

ద్దమో తెలిపితివా. అమ్మా యేంచెప్పను! మూసాగాలు సాచ్చి ఆ మూలనుంచి నాకు" అనుచు సఖీజనము రోదనము నుపక్ర మించెను. రాధ యెట్లోగాని నోదార్చుచుండెను.

ఇప్పట్టునమాత్రమే మరల యింటికివచ్చుటకు పార్వతియేమియు సఖ్యాం తరము జెప్ప లేదు. కత నేఁ మన సఖీయోగపర్యవసానమేమయ్యెనో యదియామెయందే యెరిగి యుండెను. సదాశివరావు పిచటికి రాక బొంబాయినుండి యింటికి వెడలిపోవుటచే నామె యెంతో దుఃఖిత యయ్యెను. కాని యాదుఃఖము వెంట వెనుకటివలె నామె యభిమాన మేమియు ప్రజ్వలితము కాలేదు. జానకీ బాలకృష్ణుల వెంబడి నామె వెంటనే యత్తవారింటికి బయలుదేరివచ్చెను.

జగన్నాథుఁడు, రాముఁడు రాగనే రాధయానందమున నధీరయై పోయెను. బండిలోనుండి దిగగనే యాబాలకు లిరువురును నాయనమ్మను గ్రుచ్చుకొని వదల రైరి. ముందుగ నెవరిని దగ్గరకు దీసికొందునా యను విచారముచే నావృద్ధురా లధీర యయ్యెను. ఇంతలో లక్ష్మి చిన్నవాఁడైన రాముని నెత్తి చంకనిడుకొనయెను. జగన్నాథుఁడు నాయనమ్మను విడువలేదు. రాధ జగన్నాథు నెత్తికొనియెను. "ముందుగ నేనే మానాయనమ్మను వశముజేసికొంటిని. కాబట్టి నేనే గెలిచి తిని. మారాము డోడిపోయె" నను యోచనచే జగన్నాథుని ముఖ కమలము ప్రఫుల్లమై కనుపట్టెను.

లక్ష్మియుగూడ ప్రేమముతో పార్వతిహస్తము బట్టికొని యింటిలో నికి దీసికొనివచ్చెను. పార్వతి యత్తగారికి నమస్కరింపగనే రాధ మనఃపూర్వకముగ కోడలి కనేకాశీర్వాదముల నొసగెను. పెద్దకోడలి సర్వాపరాధములును నావృద్ధురాలిప్పుడు మఱచిపోయెను. ఆదినము జగన్నాథుని, రాముని దీసికొని సాహానందమున నామె వారి [illegible] వినుటయందు నిమగ్న యయ్యెను. లక్ష్మి పుట్టింటి

నుండి యత్తవారియింటికి వచ్చినప్పు డూరంతయు నెటుల మహో
త్సాహమున నామొగము గాంచుటకు వచ్చెనో యట్లు నేడెవ్వరు రారైరి.
పెద్దకోడలి మూగతనమెవరికి నేమియు నాహ్లాదజనకము కా
లేదు. ఎవ్వరికి నామొగము చూడవలయును ననుకోరికకూడ కలుగలేదు.
పెద్దకోడలి నింటిలోనికి దీసికొనవచ్చి కూర్చుండబెట్టినపిమ్మట
లక్ష్మి మిగుల వినయముతో నిట్లనెను. "అక్కా! నాయట్టి తెలివి
మాలిన పిల్లపై నీసంసారభార మంతయు బారవైచి మీరా దిగ
వచ్చుటకు నిట్లు నిశ్చింతముగ నెట్లుంటిరి?"

"ఏమిచేయుదునమ్మా! అత్తగారియెదుట నాకుండుట కాధారము
లేదు. నన్ను గాంచినచో నామెకన్ను లోర్వవు. మరి నే నేమి
చేయుదును?"

అక్కా! అత్తగారిమాటలిప్పుడు మన మొక లెక్కగొనవచ్చునా?
పాప మిప్పు డామె వృద్ధురాలైనది. ఆమె పలుకులకు మన
కేల కోపములు?

"లేదమ్మా లెక్కలు సేయుదుగాని పాటుపడుచున్నను నెక్క
డో కొనివేసిన ట్లుత్తఘ్నత్వానికి విధిని గానము లేకుండ నన్ను సాధించు
కొనిరినా? నిష్కారణముగ నిది నెవ్వరు సహింపగలరు?
అమ్మా, నీ కిది యంతయు బాగుగ నున్నది కాబోలు! అయినను
నత్తగారికి నీవన్న నెంతో యపేక్ష. ఆమె నీ స్నేహముయు ననగు. నా
వలనే నీమీదకూడ నోగు చేసుకొనినచో నీవుమాత్ర మిట
నుందువా?"

"అక్కా! మనమిరువురముగూడ నామెయనను గనిపెట్టి వర్తిం
చినయెడల నామె మనల నెంతుల కనవలసి వచ్చునా? అథవా యామె
యెప్పుడైన పెద్దది రెండుమాట లన్నను మనము పడకూడదా?
మరల మన మామె నిందుల కదిరింప వలయునా? సరే దాని [illegible]

యని యిప్పు డ ట్లుంచుము, ముందు కాలు సేతులు గడిగికొని కొంచెము ఫలహారము చేయుదువా? నిన్న నేవేళ భోజనము చేసితివో!"

ఇట్లని లక్ష్మి యప్పుడే తోడికోడలికి. ఫలహారాదికము లమర్చెను. పార్వతికి చూడగా నిప్పుడు సంసారమునం దేమియు లేమికి గానిపించుటలేదు. దరిద్రచిహ్నములుసైత మిప్పుడు దృగ్గోచరమగుట లేదు. ఎక్కడ గాంచిన నక్కడ నైశ్వర్యచిహ్నములే కన్పట్టు చుండెను. కాని యేమిచమత్కారము! ఇవి యంతయు గాంచినంత పార్వతిమనసు సంతుష్టి బొందలేదు. ఊదుమిక్కిలి నీర్ష్యానలముచే నామె దగ్ధ మగుచుండెను.

## ౩౫

సమయము గనిపెట్టి వ్యవసాయాదివ్యవహారము లన్నియు లక్ష్మి యిప్పుడు సదాశివునిస్వాధీనము జేసెను. వినాయకరావుగూడ పనిపాటలయం దన్నగారికి సహకారియై యుండెను. లక్ష్మి తనలక్ష్య మంతయు నిప్పుడు సాంసారికకృత్యములయం దుంచెను. ఇంటిలో నేమికలదో యేమిలేదో చూచుట, స్వయంపాక మొనర్చుట వడ్డన నవరణ మొదలగు కార్యభార మంతయు నిప్పుడు లక్ష్మి వహించెను. అట్లని పార్వతి బొత్తుగా నేమియు బనిపాటలొనర్పక పోవుట లేదు. లక్ష్మి సమిష్టిసంసారపు కార్యములు చేయుచుండ పెద్దకోడలు తన యొక్కయు, తనభర్త యొక్కయు, తనబిడ్డలయొక్కయు భోజనసంబంధ మగుకార్యములవట్టున మిగులశ్రద్ధతో దగినకట్టుదిట్టములు చేసికొను చుండును. లక్ష్మి తీరుబా టయినప్పుడెల్ల రామాయణము, మహాభారతము, భాగవతము మొదలగుబోధప్రదగ్రంథముల నిరుగుపొరుగుస్త్రీలకు చదివి వినుపించు చుండ పార్వతి శృంగారరసపూరితము లగునాటకములు, జావళీలు, పెండ్లిపాటలు అవినీతిదాయకము

లగుకథలు మొదలగు వానిని చదివి ఆప్రక్క చిన్న సందులో నున్న నీచస్త్రీలకు తనవిద్య నొసగుచుండును. లక్ష్మి జగన్నాథునకు రామునకు చదువను వ్రాయను నేర్పుచుండ పార్వతియు నానమున సుద్దముక్క చేత గాని ముగ్గులు గీయుట, పచ్చి పాడుట మొదలగు పనులు చేయుచుండును. లక్ష్మి మాడి గారము గైకొని పిల్లలచొక్కాయిలు, లాగులు మొదలగునవి కుట్టుచు కూర్చుండియుండ పార్వతి కోడసంచులు పచ్చ్రీసువాళ్లి మొదలగు మోగవస్తువుల కుట్టుచు కూర్చుండును.

ఇంకను యథార్థము చెప్పవలసినచో నీకార్యములు గాక పార్వతి కింకేపనులు చెప్పినను నామె యెటులక్ష్య ముంచుట లేదు. ఏలయన పార్వతి నెవ్వరైనను చెంబుడునీళ్ళు తెచ్చిపెట్టుమని యడిగినచో తత్క్షణమే యామె తెచ్చియిచ్చును. కాని యామెచేత నన్నందెంతచిన్న పైనను సరే యది జాత్రిక్రింద పడుటయో దానిలోని నీరు మొలికిపోవుటయో తునకలగుటయో యైన నప్పట్టున సంభవించి తీరును. ఎప్పుడైనను నొక్కదినమున స్వయంపాకము చేయుటకు సాయము రమ్మని పిలిచినచో పార్వతి యెప్పుడును కాదని చెప్పుట లేదు. ఆదినమున ప్రతిపదార్థమును మాడి బొగ్గులై బహుశః తిరిగి వంటజేసికొనవలసి వచ్చును. సారాంశము లక్ష్మి యేదో పను కూర్చుచుండ పెద్దకోడలు ధ్యానము చేయుచుండును.

ఇందువలన కృష్ణాపురంగా రింటిలో దేనియందు లోపము కలుగుచుండుట లేదు. కాగా మీదుపరి లక్ష్మి సమస్త కార్యములందును దృష్టియుంచి సమర్థించుకొని పోవుచుండెను. ఇంతియే కాదు. పార్వతి వలన నేదేని యపరాధము జరిగినచో నదికూడ లక్ష్మి తనమీదకే దెచ్చుకొనును. ఇందువలన రాధ పెద్దకోడలి నేమియు ననుటకు వీలు గాకుండెను.

ఇవ్విధముగ నాలుమాసములు గడచెను. ఒకదినముగూడ నేవిషయ మున నెవ్వరికిని వివాదముగాని పోరుగాని సంభవించ లేదు. సదాశివరావు ప్రముఖుడై మిగులను శాంతముగ నింట గూర్చుండియే సంసారము నడుపుచుండెను. ఇంతలో నొకనాడు మూడవ జామున పార్వతి సోదరి యగు గంగ "త్రిపాది" యాచటికి వచ్చెను. గంగ రాకవలన పార్వతి మొదలగువా రందఱు విస్మితులైరి. లక్ష్మి యామెకాదరాతిథ్య మొసగెను. సోదరి దర్శన గాంచి పార్వతి యెంతయో సంతాప మందెను.

భోజనాదిక మయినంత పార్వతి యప్పగారిని తనగదిలోనికి దీసికొనిపోయి "అక్కయ్యా మనపినతల్లిగారియింట నందఱు క్షేమముగ నున్నారా?" యని యడిగెను.

"దానిమొగము మండ! అది మనకు పినతల్లియా? అట్లని చెప్పుకొనుటకూడ సిగ్గుచేటు! అది యెక్కడనో చచ్చినదైన పోయినదికాదే! దానికేమి తెవులొచ్చినదా, అమాయకురాలిముండ యింకను వేయేండ్లు బ్రతుకును! మఱేమి యుభయము లేదు."

"మనపినతల్లితో నేదోపోరాటము జరిగినదని తోచుచున్నది. ఎందుల కక్కా! తగవునకు కారణ మేమి వచ్చినది?"

"అంతయు చెప్పుటకు ప్రారంభించినచో పెద్దగ్రంథ మగును. దానికొడుకు కోడలుపోరాడినారు—అదియు నాదోషమే! వారికి వీరికి తగవు పెట్టుట తప్ప నాకు వేఱేపని లేదు కాబోలు! సరేయది యట్లుండనిమ్ము. దానిపొగరుబోతుచేష్టలు చూడు" గంగ తన వీపుమీదకొంగు ప్రక్కకు తొలగించి యచ్చటచ్చట తేలిన కణుతులు గట్టియున్న బెత్తపుదెబ్బలను జూపించెను. ఆదెబ్బల జూచుటతోడనే పార్వతి మనసునమాత్రము నొప్పి కలుగకుండునా? ఆమె రహస్యముగ గంగతో నిట్లనెను. "అక్కా! విను. ఇక్కడమాత్ర మీా

సంగతి వెల్లడి గానీయకుందము. అటుగాకున్నచో మనమిచట దలయెత్తు కొని తిరుగలేముసుమా?"

సోదరిదుర్దశను గాంచి పార్వతి మనసు నీరయ్యెను. అప్పుడె వ్వరు నోదార్చువారైన లేక, పరులచే నిట్టిభయంకర మగు దెబ్బలు దిని 'అచటనుండి వెడలగొట్టబడి, ఈదినమున దనయింటి కాశ్రయ మునకై వచ్చినసోదరి విషయమున విశేషపరితాప మొందకుండ పార్వతి యెటు లుండగలదు?

దాదాపొక్కమాసము దినములు మిగులసంతోషమున గడచెను. అందరు గంగవిషయమున మిగులజాలి జెంది యెంతయో యాదరించిరి. కాని 'దేశసంచారిణి,' గంగవచ్చినప్పటినుండియు పాపముమనో రమ దుఃఖమున కంతము లేదు. గంగను గాంచినంతనే యాభీరురాలి శరీరమున రక్తమంతయు నట్టిపోయెను. ఆదినమునుండియు మనోరమ భీతిజెంది దీక్షితునిగృహమునకు సాధారణముగ వచ్చుటయే మాని వైచెను. ఎప్పుడైన వచ్చినను నక్కినక్కి, యొదిగియొదిగి, యెంతయో జడియుచు చప్పుడుకాకుండ వచ్చి లక్ష్మీనిమాత్రము జూచి పోవుచుండును. గంగవీపుపైని దెబ్బ లెప్పుడునిశ్శేషముగ మాసిపో యెనో, పార్వతి పూర్తిగ తనకు లొంగిపోయె నని యెప్పుడు స్పష్ట నిశ్చయ మయ్యెనో యప్పుడు గంగ మరల దనపూర్వస్వరూపమును ధరించెను. ఒక్కదినమున నక్కచెల్లెండ్రిద్దరు మాటలాడుచు గూర్చుండియుండగ గంగ యిట్లుప్రశ్నించెను. "ఏమే పార్వతీ, నీ తోడుకోడలన్న మీయత్తగారి కెంతో ప్రేమ యనుకొందును! అది యేమిచేసినను నోరెత్తదు. నీపొడ యేమాత్రము గిట్టదే!"

"అవును! నాకునదే మిక్కిలివింత యగుచున్నది."

"నీవునాకది వేఱె చెప్పవల యెందుకు? నేనదియంతయు నా కన్నులతో జూచుచునే యుంటిని."

"ఏమి చెయ్యనమ్మా! నాప్రారబ్ధ మిట్లున్నది! మావారిస్వభావము నీ వెఱిఁగినదే. ఆయన ముందు నా మాట యేమి యెక్కి యాకు వచ్చును?"

"అయితే తగుమాలినధర్మమా! తన పెండ్లాముబిడ్డల నధోగతి పాలు చేసి, తానుమరదలితో సుఖింపందునా యేమి?,,

"నేనేమి చెప్పనక్కా! ఆయనస్వభావ మటువంటిది. నాకు నో రెత్తుటకు వీలు లేదు. నాదుఃఖ మంతయు లోలోపలనే దిగమ్రింగి కుళ్ళి చావవలసిన యోగము వచ్చినది!"

"నేనింతవరకు సదాశివరావే మహాపౌరుషము కల వాఁడనుకొంటిని. ఏమమ్మా యీ చమత్కారము! చక్కగా చదువుసంధ్యలు వచ్చినంతకు- తనబాగోగులే తా నెఱుఁగఁడే!"

"అక్కా! ఇదియంతయు దైవఘటనమునుమా! ఇదిగో చూచితివా? లక్ష్మిఖ్యాతి యూరంత నిండి యున్నది, కాని వాళ్ళ మొగముమండ? ఆవచ్చినవాళ్ళకు నేచేసినమోసమో- నా పేరు వినగనే మండిపోవుదురు."

"ఆహా! ఇప్పుడు నా కంతయు దెలిసిపోయినది. పార్వతీ! యిదిగో చూడు! నీతోడికోడలి సంసార మంతయు కడిఁగిపెట్టుచున్నది. ఇంతవరకు నీ విది గ్రహించనే లేదని తలఁచెదను. దానికేమియు బిడ్డపాపలు లేరుగదా? అట్లగుట కొట్టకోలపాలముగా సత్యనారాయణపూజ చేయుచు, బ్రాహ్మణసంతర్పణ లొసగుచు, అతిథ్యభ్యాగతులు, మొదలగువారెవరు వచ్చినను వారందఱకు పొట్టపగుల మేపుచు నిట్లిచ్చవచ్చినట్లు సొమ్మంతయు నష్టము సేయుచున్నదే? భగవంతునిదయవలన నీకు రత్నమాణిక్యములవంటి యిరువురు కొడుకు లున్నారు. ఏమైన రెండుడబ్బులు మిగిలినచో నవి వారికే యుండును. కాని యెక్కడనుండియో యీ ఘవాంతరముగ నీగాలిదెబ్బవచ్చి

యింతయు పుట్టపెట్టుకొని పోవుచున్నదే! అయ్యో ద్రవ్య మంతయు నిష్కారణముగ నష్టమువచ్చినట్లు దుర్వ్యయము చేయుచున్నదే!"

"నిజమే యక్కా! నీవు చెప్పిన దంతయు నిశ్చయమే! అదియే నీవు నా కిట్లు జెప్పియుంటివి- నిట్టి మోసపు టురిలో జిక్కుపడదో యిప్పుడే వేటకాడ దయినది. ఇప్పుడు నీమాటలవలన నాకింగితము కలిగి నది. సరేకాని దీని కేమియు నుపాయము లేదా?"

"ఓసిపిచ్చిదానా! ఉపాయముల కేమికొదువ! ఒకటికాదు వేయి యుపాయములున్నవి. నీ వింతటనుండి యెందుకు వేఱుపడ కూడదు! ఇదిగో చూడు. నీమగఁడు బాగుగా చదువుకొన్న వాఁడు మంచి తెలివి కలవాఁడు. ఇంక దానిమగండో పట్టిమూర్ఖుఁడు జ్ఞానశూన్యుఁడు. కలిసి యున్నచో నీకే నష్టము. దాని కేమి?"

"అది యంతయు నేనెఱుంగుదును. కాని యేమిలాభము! ఆయన యిష్టపడవలెనుకదా? అక్కా! ఆయన విద్వాంసుడు. తెలివి గలవాఁడు నని నీ వనుకొంటివి కాని నాకు మట్టుకు శుద్ధమూర్ఖుఁడై నట్లు తోఁచు చున్నది!"

"నేను నీకు చక్కని యుక్తి జెప్పెదను నీయత్తగారితోను, తోడు కోడలితోను జగడమాడుటకు ప్రారంభింపుము. ఏమగునో చూతము. దీనివలన విభాగము లగుటకు దారి యేర్పడదే యదను సంప్రాప్త మగునో కాదో చూచెదవు గాక. ఓసి పిచ్చిదానా! ఇట్లు నివ్వలాట క్రింద దినమును వెళ్ళఁబుచ్చుచు గూర్చున్నచో పని యెట్లు సానుకూల మగును?"

అనంతర మక్కచెల్లెండ్రిద్దరు కొంతతడవు రహస్యాలోచన మొనర్చిరి. సారవంతమగుభూమిపై విత్తులు వెదజల్లుటయే యవ శిష్టముగా తత్క్షణమే మొలకలెత్తును కదా! మఱుదినమునుండియు కలహప్రియయు యుగంధర నాటినవిషవృక్షము చక్కగ ఫలింపను

ఇంతవరకును దీక్షితుని గృహము సంతోషదాయకమై చూడ ముచ్చటగనుండెను. రాధయు నామె పెద్దకోడలు నెడ తెరిపిలేకుండ పోరాడుచుండిరి. లక్ష్మి యాపోరాటమును మాన్పుటకై తనశక్తి ధారవోయుచుండెను. కాని నిష్ఫలము! మీదుమిక్కిలి పార్వతి వలనను గంగవలనను నామె యెన్నియో కర్ణకఠోరవాక్యములు విన వలసి వచ్చుచుండెను. కాని లక్ష్మి వాని నేమియు లెక్కగొనలేదు. ప్రతిదిన మాతీరున నత్తకును గోడలికిని జగడము మితిమీరు చుండెను. లక్ష్మినికూడ నీ కలహములోనికి దింపవలయు నని యయ్యక్కచెల్లెం డ్రిరువు రెంతో విశ్వప్రయత్న మొనర్చుచుండిరి. కాని వారి కం దేమియు జయము కలుగలేదు. పాపము సదాశివుడు మహావిపత్తులో మునిగెను. వానిస్వభావమున గలపెద్దలోప మిదియే. మహాకఠినురాలగుభార్య మొదటుగ నుండెనేని యాతడు మేకపిల్లవలె నైపోయి వానినోరు కట్టువడి పోవును. ఒక్కదినమున జగడ మాడిమాడి మిగులసలసిపోయి పార్వతి భర్తతో నిట్లనెను. "నేనికమీద నణుమాత్రము సహించి యుండజాలను. మీరీవిష యమున నేదో మంచియో చెడుగో తగిన యేర్పాటు చేసి తీర లెను. తనముద్దులకొడుకును ముద్దులకోడలిని బెట్టుకొని యామె నుండనిండు. మనత్రోవ మనము చూచుకొందము. ఇప్పుడు మన మిచట నుండుట యామెకిసుమంతయు నిష్టములేదు."

భార్యనుడువులకు సదాశివునికన్నులు తెఱచుకొనెను. ఇంత వఱకు జరుగుచున్న కలహములన్నియు వెంటనే వానిమనసునకు స్ఫురిం చెను. ఈపోరాటమునకు తగినంత కారణ మేదో కల దని యాత నికి మొదట దోచలేదు. ధూర్తయగుతనభార్యనోట నాకస్మిక ముగ నియుల్లిలభాషణము లాలకించినంత సదాశివున కత్యంతాగ్ర హము కలిగెను. ఆకోపభరమున నాత డిట్లనెను. "ఇట్లుతగవులు,

ఆమె ధర్మము, నీవధర్మము. ఆమె లక్ష్మి, నీవు దరిద్రదేవతవు. నీనోట నామెనామము శోభించునా?"

మూతవైచి బిగించినకుండలో నూతనముగబట్టి పెట్టిన త్రాచు పాము మెట్లు బుసకొట్టునో యట్లే గంగ సదాశివునిమాపుడు లాలించి బుసకొట్ట మొదలిడెను. గంగకే దేహసామర్థ్యమున్నచో నీదిన మాతని నేమిచేసియుండునో! ఒకటి రెండుమాట లని సదాశివుడటనుండి లేచిపోయెను. కొంతసేపటికి గంగ యూరకొని శాంతించెను. ఆదిన మున ఘటిల్లిన వ్యవహారమునల నందఱికిఁ గాదటన్న లక్ష్మిపై నామె మిగులఁ బగగొని యుండెను. అనగ నెప్పుడుదీర్చుకొందునా యని గంగ మిగుల తహతహపడు చుండెను.

## 36

దీక్షితునిగృహ మాదిన మెల్లనో గంద్రగోళముగ నుండెను. సదా శివునిపుత్రులు జగన్నాథుఁడు రాముఁడు స్మృతితప్పి పడియుండిరి. వైద్యుఁడు వచ్చి నాడిపరీక్షించి "ఏదో విషము కడుపులోనికి పోవుట చేత వీరికీస్థితి సంభవించె" నని తెల్పె నింటిలో నందఱు నాపిల్లల విషయమున హతాశులై, ఆ యాకస్మిక భయంకర సంఘటనమునకు శోకింప దొడగిరి. వైద్యుఁ డొసగిన యౌషధమును వినాయకరావు వారికి త్రాగనిచ్చు చుండెను. రాధ దేవతార్చనాగృహమున కరిగి దేవునిముందు సాగిలఁబడి బిడ్డలను బ్రతికింపుమని యెన్నియో తెఱఁగుల మ్రొక్కు లిడుచుండెను. పార్వతి రోదన మొనర్చుచు నాకాశ పాతాళము లేకము జేయుచుండెను. లక్ష్మివైద్యుఁడు చెప్పినచొప్పున నాబాలకు లిరువురకును పరిచర్యలు సలుపు చుండెను. ఇట్టిసర్వ నాశన మొనర్చినవా రెవరో యని గంగ యజస్రాశ్రువర్షము గురిపించు చుండెను. సదాశివరావు హతబుద్ధియై వెఱ్ఱివానివలె తెల్లవాఱఁ జూచుచుండెను.

ఇంతలో వైద్యు డొసగిన యౌషధము తనప్రభావము కనబఱిచెను. అప్యార్భకుల కిరువురకును క్రమక్రమముగ వాంతి కాసాగెను. అందఱి మనస్సులందును మరల నాశాంకురము లుద్భవించెను. మరల కొంత తడవునకు వైద్యుడు వచ్చి పరీక్ష జేసి "ఇప్పు డింక భయపడవలసిన యవసరము లే" దని ధైర్యము చెప్పి వారి యాశను బలపరచెను. కొంతతడవున కా బాలకులకు స్వస్థత కల్గెను. భోజన సమయమందే దేనివిషము కడుపులోని కేగుటవలన వారు స్మృతి తప్పి పడిపోయి యుందురని యనుమానించి, అది తెలుసుకొనుటకు వైద్యుడిప్పుడు మిగుల నుత్సాహియై యుండెను. ఆతడు వారి తినియుండట్టి పదార్థ మేదేని గానిపించునేమో యని నిరీక్షించుచుండెను. ఈదినము వంటకమందరు భుజించియేయుండిరి. అట్లగుట నీపిల్లలిరువురకు మాత్రమే యన్నములో నీవిష మెట్లువచ్చెనో తెలుసుకొనుటకు నెల్లరు నుత్సుకులై యుండిరి. తొలుదొల్త నేదోవిషపదార్థము తినుటవలన గాని, మఱి దైవికముగా గాని యిట్లు సంభవించి యుండునని వైద్యుడు తలంచెను. కాని పరీక్షణాల వలన నాతని కంటబడిన దానింగాంచి యాత డాశ్చర్యనిమగ్నుడయ్యెను. పరిశీలింపగా వాంతి మధ్యమున నల్లమందు మిశ్రిత మైనట్లాతనికి దెలియవచ్చెను. ఎవరో ప్రత్యేకముగా కలపనిచో భోజనపదార్థములందు నల్లమం దెట్లు వచ్చును? అతడు స్పష్టముగా నందరితో నిట్లనెను. "ఎవ్వరో దుర్మార్గులు భోజనపదార్థములలో నీబిడ్డలకు నల్లమందు పెట్టిరి. భోజనానంతరమున వెంటనే వాంతికి ఔషధము కడుపులో బడుటవల్ల మేలయినది. లేనిచో నిస్సంశయముగ ప్రాణహాని సంభవించియే యుండును."

ఈసంగతి విని యెల్లరు విస్మితులైరి. ఈ ఘోరకృత్య మెవరి వలన జరిగినదో యనువిచారమున నెల్లరమనస్సులు కలవర మంద

సాగెను. పసుపుపారు గమ్మునొక్కటి మాలనుండ దాచుటకూడ యుండిరి. అప్పుడా వైద్యుడు "అయితే నల్లమందు దొరకుడిది! మీలో నల్లమందు దెవ్వరికైన నభ్యాసము కలదా?" అనెను.

ఎవ్వరును సమాధాన మొసగకుండిరి. వైద్యుడు కొంతతడవు ఆలోచించి "ఎప్పటిదినమున స్వయముగా వారికిచ్చినవారో, ఈబాలకుల కీదినమున్నన్నము పెట్టిరో, వారివలననే యీకృత్యము జరిగియుండవలయును. ఈదినము వంటచేసినవా రెవరు?" అని ప్రశ్నించెను.

ఈప్రశ్న యాతనినోటినుండి వెలువడుటయే తడవుగ లక్ష్మి జూసి గంగ చప్పున ప్రత్యుత్తర మిచ్చెను. లక్ష్మి యీవిషయమును నొప్పుకొన కుండుటకు వీలులేదు. కారణ మేమన, నిశ్చయముగ నీ దినమున నామెయే వంట చేసినది. వంటకాగానే యామెయే ప్రప్రథమమున తనచేతిమీదుగ నాబాలుర కిరువురకు నన్నము పెట్టినది.

ఒకదాని కొకటి తోడుగ నావిషయమును బలపరచుచుండిరి. లక్ష్మినోటినుండి యొకమాటయైనను వెలువడ లేదు. చాలసేపటివరకందరు స్తబ్ధులై యుండిరి. తుట్టతుదకు సదాశివుడు నిట్టూర్పు విడిచి యిట్లనెను. "నాభార్యయు నా సోదరియు లక్ష్మియెడ ననేకాపచారములు చేసియుండిరి. నేనుగాని, నాపుత్రు లిరువురుగాని యేమియు నొక్కయపరాధమైన జేసియెరుగము. అట్టియెడ నిట్లు సర్వనాశన మొనర్చుటకు లక్ష్మి యెట్లుద్యుక్తురాలయ్యెను!"

బావగారి పలుకులు లక్ష్మికత్యంతదుఃఖమును కలిగించెను. ఇంతకంటె నాకస్మికముగ నాము శిరమున వజ్రాఘాతము పడినప్పటికి నామెప్రాణ మంతగా వ్యథితము కాజాలదు. సదాశివుని భాషణము నాలించి యటజేరినవా రందరు విస్మితులై తమమనసున 'అసంభవ' మనుకొనుచు నటనుండి వెడలిపోయిరి. గంగయు పార్వతియు నీసు మీరగ నేమియు నూరక బోనిచ్చినవారు కారు.

ఎన్నిదినములకో యిప్పటికి వారి మనోరథము పరిపూర్ణమైనది. వారు అనేకవిధముల లక్ష్మిని నిందింప సాగిరి. ఆదినమున గంగ యానందమున కంతము లేదు. ఆమె సంతోషమున నంతసేపు కూడ కడుపున నిముడ లేదు. ఈనాటిభయంకరకృత్యమువలన నా బాలికల కిరువురకును దేహావసానము కలిగినప్పటికి సంతసులకై గంగ యంతగా సంతసించి యుండదని తోచుచున్నది. అక్కచెల్లెండ్రిరువురును గలసి యిప్పుడీసంగతినూరంతయు చాటింపం బయత్నించుచుండిరి. సదాశివుడు ఖిన్నవదనుడై వీథియరుగు మీదికి వచ్చి కూర్చుండెను. ఈదినమున జరిగిన ఘోరకృత్యమువలన మనసంతయుం జెడి యాతడాదినమింటిలోని కరుగలేదు. వినాయకరావు వాడు హతబుద్ధియై పోయెను. సదుమనస్కుడగు నతడు గుణవతి యగుతన భార్యయొక్క యశ్రుప్లావితముఖకమలమును గాంచి మిగుల వ్యాకులమందుచుండెను. ఇంతలో పార్వతి యట్టహాస మొనర్చుచు నచటి కరుదెంచి లక్ష్మి నుద్దేశించి "నీవు తలపెట్టినకార్యము కడముట్టలేదని యిప్పుడిక్కడ కూర్చుండి యేడ్చుచుంటివా? నీ కడుపులో నెంతవిష మున్నదో యెవ్వరెఱుగుదురు?" అని పార్వతి లక్ష్మి తనబిడ్డలవద్దనుండి లేవగొట్టెను. లక్ష్మి యచటనుండి లేచి యత్తగారిదగ్గఱకు బోయి కూర్చుండి శోకించుచు "ఈసంగతి మీరు కూడ నిజ మని నమ్మితిరా?" యనెను.

వృద్ధురాలు పైటకొంగుతో కోడలికన్నుల దుడుచుచు "అమ్మా! నేను కన్నులార గాంచినప్పటికి నీసంగతి నమ్మజాలను. నీవిది మనసున నుంచుకొని యేడ్వబోకుము చూడమ్మగాడు!" అని బుజ్జగించెను.

ఆదరపూర్వకము లగునత్తగారిపలుకులు లాలించినంతమాత్రమున లక్ష్మి కిప్పుడావంతయు నోర్పు కలుగలేదు. ఆమె పెద్దపెట్టున రోద

నను [illegible] [illegible] [illegible] బోవుచెట్లు? మీ కేదీని కేదేని [illegible] జెప్పనున్నను." అని యత్తగారిని వేడుకొనెను.

అమ్మ సవతి కోడలి నోటమ్మయచు, "అమ్మా! [illegible]బుద్ధిశాలిని యున్నట్లును నే జూచితిని. అమ్మయ్య నీ వింత జేల వయ్యెద వెందులకు? తల్లీ బిడ్డా నీకు నేను చెప్పగలను. ఈవిషయ మెవ్వరైన నమ్మునవారా? నీవంటిగుణవతికి యిట్టికళంక మంటునా? నే నంతయు దెలిసికొంటిని. ఈపనియంతయు నా దౌర్భాగ్యపుముండ గంగదే. ఆముండ బంగారమువంటి నాసంసారమును మన్ను చేయుటకై వచ్చినది!"

అత్తగారి నుడువులవలన లక్ష్మిప్రాణములు కుదుటబడెను. కొంచెము స్థిరచిత్తయై యామె యటనుండి లేచిభర్తను సమీపించి "ఇందు మీ కేమి తోచుచున్నది?" అని యడిగెను.

వినాయకరా విట్లనెను. "ఈదుష్కృత్య మాదుష్టురాలు గంగదే యని నాకు బాగుగ నమ్మకము. ఆ భండాలురాలుగాక యిట్టి రాక్షసకృత్య మొనర్చుటకు సాహసింపగల స్త్రీగాని పురుషుడుగాని పృథ్వీతలమున నుండబోరు. ఇది నేగట్టిగ చెప్పగలను. కాని ప్రాణేశ్వరీ! నేడు నీధైర్య మంతయు నెట కేగినది? నేడు మాయన్నగారి నోటవచ్చినపలుకు లెట్టిగగాల్చి వైచినముద్రలవలె నామనసున ముద్రితములై చురచురగాల్చుచున్నవి. నీ వేటి కింతిగా నధీర వయ్యెదవు? సత్యమెన్నటికిని దాగనేరదు!"

లక్ష్మి మిగుల నావేశముతో "సత్యమే జయించు నని నేనును నమ్మియుంటి" ననెను. కాని యీవిషయము సాధారణముగ నణగి పోవునది కాదు. సదాశివుని మనసున గలసందేహ మెమిచేసినను తొలగకుండెను. గంగ ప్రత్యక్షముగ తనతల్లిలిబిడ్డలకు విషము

చెప్ప నగుట శక్యముగాదని యాతనిదృఢవిశ్వాసము. తుదకు దుర్బోధనలలో నొకలొక్కని సదాశివరావు వేఱుపడుటకు కూడ ప్రస్తావన చేసెను. కాని యాతడు వేఱగుట కొప్పుకొనెను. లక్ష్మి యావజ్జన్మము పుట్టినింట నుండుటకై ప్రతిజ్ఞ చేసెను. కాని యెంతచెప్పినను రాధ యందుల కంగీకరింప లేదు. అప్పుడు లక్ష్మియే తన యత్తగారి నివ్విధమున వేడికొనెను. "మీరెంతో కష్టములు కోర్చి యీసంసారము నుద్ధరించితిరి. అది యొక్కతరి చితికిపోయినచో మరల కూడు కొనుట బహుకష్టము. అత్తయ్యా! నాప్రయోజకత్వ మేమి కలదు! నాకొఱకై బంగారమువంటి మీసంసారము నేల పాడు చేసెదరు! ఇచట నుండి వెళ్ళుట నాకెందుకును విచారము లేదు కాని యీదీనురాలికి మీపాదసేవాభాగ్యము లభింపనేర దని నా కత్యంతదుఃఖము కలుగుచున్నది."

కోడలిపలుకులవలన రాధ కెంతయో దుఃఖము వచ్చెను. ఆమె యేడ్చుచు "అమ్మా! నీయోగ్యత సామాన్యమా? నీవే నాగృహలక్ష్మివి. అట్టినీవు లేనిచో నాసంసారముపస యైపోయినట్లే! బిడ్డా! నీవు లేనిచో నీసంసారము నాకెందుకు? నీవునాపజ్జ నున్నచో మఱి యీసంసారమంతయు మునిగిపోయినను నాకు భయము లేదు." అని చెప్పెను.

ముదుసలి పెద్దపెట్టున నేడ్వదొడగెను. ఆమె యింకేమియు బలుకజాల దయ్యెను. తల్లియొక్క శోకస్వరము వినవచ్చినతోడనే వినాయకరావచటి కరుదెంచి యిట్లనెను. "అమ్మా! సత్య మెన్నటికిని దాగి యుండనేరదు. ఈదినము పలికినపలుకుల కన్నయ్యయు నెప్పుడో యొకప్పుడు పశ్చాత్తాపము నందకపో డని నానమ్మకము. దీని నిప్పు డిచ్చట నుంచుట యేమియు లాభము లేదు. కొద్ది దినములలో నిజము బయలుపడక పోదు. మఱి తిరిగి దీనిని తీసికొని

వచ్చుట కెట్లోయవకాశము కల్గును? సోదరీ! లింతపురము వేయి పడుటకంటె నీకు పుట్టినింటి కేగుటయే యుత్తమము."

మఱి యుపాయము గానరానందున తుద కొప్పుకొనుట [illegible]ంచుట కష్టపడియెను. లక్ష్మి యాజన్మమును పుట్టినింట గడుపు నుద్దేశముతో నావిధమే పుట్టినింటికి పయన స్థిరపరచుకొనియెను. బండిలో నెక్కుటకుముందు నత్తయు కోడలు నొండొరుల గౌగలించుకొని యెంతయో విలపించిరి. జగన్నాథుని రాముని దగ్గఱకు తీసికొనవలె నని లక్ష్మి వారిని దగ్గఱకు బిలిచి వారి మోముల ననహస్రముగా నిమిరి ముద్దు బెట్టుకొనుచుండెను. ఇంతలో గంగ యొక్కగంతున నట్రవాలి యాబాలుర నిరువుర నామెకౌగిటనుండి లాగికొని పోయెను. లక్ష్మి సజలనయన యై తదేకదృష్టిని వారివంక జూచుచు బండి యెక్కెను. వినాయకరా వామెను బంపించుటకై వెంట బయలుదేరెను. బాలకృష్ణుడు కూడ వారితో ప్రయాణమయ్యెను. నిజముగ బాలకృష్ణు డరుగ నవసర మేమియు గనబడదు. రాధ సదాశివుడు నింక కొంతమందియు వాని ననేకవిధముల వారించిరి. కాని వానిని బట్టి యాపుట కెవ్వరికిని ప్రజ్ఞలేకపోయెను. అత్తవారియూర నిడిసము లక్ష్మి శాశ్వతముగ సెలవు గైకొనియెను. శత్రువుల కుపకారమొనర్చుటకై యామె తనసౌఖ్యమును తృణప్రాయముగ వర్జించినది!

బండి దృష్టిపథము తప్పెను. గంగ యానందవిహ్వాలయై పార్వతిని గాఢాలింగనము చేసికొనెను.

## ౩౨

లక్ష్మి పుట్టినింటి కరిగినతరువాత పాపము రాధ మంచము పట్టెను. మూడుదినములవఱకు నన్నమైన ముట్టలేదు. అన్యాయముగ దుస్సహమగునపనిందపాలై కోడలు పుట్టినింటి కేగుటవలన రాధ యత్యంత

దుఃఖితో యయ్యెను. క్రమక్రమముగ నీసంసారకష్టములకుం బాపు విరక్త యయ్యెను. ఏమాడుజాముల నో నాటివెనగ [illegible] బలవంతముగ మీద రెండుముద్దలు నోట వేసికొని, యాపె మొం [illegible], కన్నుల గార్చుచు దినము బుచ్చు చుండెను.

దీక్షితునిసంసార మంతయు నిప్పుడు విచ్ఛిన్నమైపోయెను. నా జ్యేష్ఠభగిని గంగయుక్కయు, జేతులలో బడియుండెను. [illegible] వలన సదాశివరా విష్ణుడు నుగల కంట్రాక్టులను ప్రారంభించెను. [illegible] వలన నాతఁడు మాటిమాటికి పొరుగూరి కరుగవలసి వచ్చు చుండెను. కాంతాకాంచనముల యుద్భూతమోహినీశక్తికి బలియైపోయి సదాశివుడు వెనుకటిసంగతు లన్నియు బాగుగ మరచి పోయెను. అట్లగుట నమాయకు డగుసోదరుని ద్రవ్యము గొని తన ఋణములు తీర్చుకొనవలయు ననియు, తనయిచ్చానుసార [illegible] మును వినియోగించవలయుననియు వానికి బలవత్తర మగుకోరిక కలిగెను. వినాయకరా వేపనిచేయుటకును నిప్పుడు మునుపటివలె నంతటి యుత్సాహిగా లేడు. తన కొకయుపదేశిక అన్నగారిమాట చెప్పినను త్రోసివేయుట లేదు. అన్నగారి నెదుట నిలువబడి వినాయకరావు భక్తిభావమున శిరసావహించి యొప్పుకొనుచుండెను. ఈయుంట నుండుట కిప్పుడు వినాయకరావున కణుమాత్రము నిష్టములేకుండెను. కేవలము తల్లికి నన్నగారికిని మనసు నొచ్చునని శ్వశురగృహమునకు బోవ డయ్యెను.

లోకు లనుకొనుమాట చివరకు నిజమే యయ్యెను. సంవత్సరమునకు దాదాపు పదిపండ్రెండు వ్రతములు దీక్షితుని గృహమున జరుగుచుండెడివి. అవియన్నియు నిప్పుడు కట్టుబడి పోయెను. అతిథ్యాభ్యాగతుల పరామర్శ యిప్పు డెవ్వరును చేకొనుట లేదు. భిక్షుకులకు

కారణమున నిచట నుండగోరెనో యది యంతయు సిద్ధించినది. ఆలోకించుటయే నా కామెమీద సంశయము గలుగజేయు చున్నది. ఇది గాక యామెయెడ సంశయించుటకు నాతియొక విశేషకారణము కూడ కలదు.”

“శ్రీనివాసరావుని నే నెఱుగక పోలేదు. ఎట్టిదైనను నీసందర్భమున నామె మీద ననుమానపడుటకు నా కేమియు కారణ మగుపడుట లేదు.”

ఓహో! అర్భకుల కేదేని మతియొకటి బెట్టియుండినచో నేనును నమ్మకపోదును. కాని నల్లమందు బెట్టినని యెప్పుడు నే వింటినో యప్పుడే నాకు గట్టి యనుమానము కలిగినది. నీకు నిశ్చయముగ చెప్పుచుంటిని. ఈపని తప్పక యా చండాలురాలిదే! నారాయణుని గారికి నల్లమందు తినుపాడుక కలదు. అది నీవు మరచితివని తలచెదను. ఈదురాగ్రహురాలప్పటినుండియు దొంగతనముగ నల్లమందు తినుట కలవాటుపడినది. సదాశివరావు! నీ వానిర్మలశీలసాధ్వియని విషయమున ననుమానించుట నిజముగ మిగుల నన్యాయముసుమా!

మాధవరావుపలుకు లాలించినంత సదాశివుని హృదయమున విస్మయప్రకాశ మొదవెను. కన్నులపై నున్న పొరలు దీసివేసినట్లు నిజావస్థ యెట్టు లుండునో యీసమయమున వాని యవస్థ యట్టు లయ్యెను. సకలవిషయము లిప్పుడు వానికనులయెదుట స్పష్టముగ గన్పట్టుచుండెను. వానిముఖము వెల్లనైపోయెను. ఇంతలో మరల మాధవరా విట్లనెను. “నీకు నామాటలయందు నమ్మకములేనిచో పరీక్ష చేసి చూడుము. దానికడ నీకు నల్లమందు దొరకు నని నే నొక్కి చెప్పగలను.”

సదాశివుని మనమున కేమితోచెనో యెవ్వరెరుగుదురు! మాధవరావు నచ్చటనే కూరుచుండు మని చెప్పి, యాతడు తత్క్షణములోని కరిగి, కొలదిసేపటిలోనే చేత నొకడబ్బి పట్టుకొని బయటికి వచ్చెను.

ఆబరిణె మాధవరావుచేతి కిచ్చి "బరిణెలో నేమున్నదో తెఱచి చూడు" మని యతనితోఁ జెప్పెను.

మాధవరా వాబరిణె నానవాలుపట్టి "నివే యున్నవి. దీనిలో నల్లమం దున్నదో లేదో" యనెను.

సదాశివుడు సిగ్గిలుచు "మాధవరావు, నీ వనిన దే నిజము. లక్ష్మి విషయమున నిష్కారణముగ సంశయించి యామెను నిందలపాలు చేసితిని" అని పలికెను.

మాధవరావు మిగుల నుత్సాహముతో "అయితే మాత్రిపజలకు నిజమేదో తెలియజేయుటకు విలంబము చేయకు" మని యుపదేశించెను. ఇది జరిగినతరువాత మాధవుడు శ్వశురగృహమునకు బయలుదేరెను.

చివఱకు నిజ మేమో బయటబడినది. తనకోడలిపై నన్యాయముగ వచ్చిన యపవాదు తొలగిపోయిన దని తెలిసినంతనే రాధకు పట్టరాని సంతసము కలిగెను. తనయనుంగుకోడలు మరల నింటికి రాగనే మిగుల వైభవముగ సత్యనారాయణపూజ చేయునట్లు నని యామె నిశ్చయించుకొనియెను. అందుకు దగినప్రయత్నముల గూడఁ జేయుచుండెను. కాని యీసంగతి వినినంత వృద్ధురాలియానందము బ్రహ్మాండము పట్టజాల కుండెనో యావిషయమే పార్వతి చెవిని బడినంత నామెక్రోధము బ్రహ్మాండమును బ్రద్దలుచేసికొని బయట బడియెనా యేమి యను భయ మగుచుండెను. సంతాపభరమున చేతిలోనిపని యట్లనే యెక్కడి దక్కడ విడిచిపెట్టి, పార్వతి గంగపై నొక్కపెట్టున విఱిచికొనిపడి, యత్యంతకఠోరవాక్యప్రవాహములచే నామెహృదయముభేదన మొనర్ప దొడగెను. ఆమె మిగుల తీవ్రముగా "నీమొగము మండ రాక్షసిముండ! నీవంటిభయంకర కాలసర్పమునకు పాలు పోసి నేనింత వఱకు పెంచు చుంటినే! నీ

హృదయమున నేమైన పంచు యనుచున్నావా లేదా? నో రెత్తక గను నాముద్దుబిడ్డలకు విషముపెట్టి చంపి నీకు చాలు లేటు వచ్చెనే చండాలపుముండ! నీచేతులు తెగి పడ మాడి పడెదవో తెలియదు!" అని యఱచెను.

కృతాంతునివలె భయంకరమైన పార్వతీమూర్తిని చూచుట తోడనే గంగ మొదట కొంచెము వెఱగుపడియెను. కాని యిది యంతయు నెమ్మదిగ సహించి యూరకుండుట యుచితము గాదని మనములోఁ దలపోసి, యామె దిల్లరిభయంకరగర్జనకు ప్రత్యుత్తర మొసఁగుట కెంతో బలవంతముగ నోపిగ దెచ్చుకొని, నోరు దెఱచి "ఏమి— అంతనోరు పాఱవేసికొను చుంటివి! నీ వెవరి నట్లను చుంటివో నాకు దెలియుట లేదే!" యనెను.

గంగనోటివెంబడి నీమాటలు వెలువడినవి, కాని యామె గుండె మాత్రము దడదడకొట్టుకొనుచునే యుండెను. మొగము బొగ్గువలె నల్లనై పోయెను. ఇంతలో పార్వతినోరు మరల విడఁబడియెను. "ఓసి చండాలపుముండ! నీకింకను మొగ మెత్తుకొని మాట్లాడుట కేల సిగ్గులేదు! నీపెట్టెలోనే నల్లమందుబరిణె కాన్పించినది; కాదా? ఓసిదౌర్భాగ్యపుముండ! నీ కేమియు ధర్మాధర్మభయము లేదా ఎవరియన్నము తినుచుందువో వారినే మొదటంట నాశన మొనర్ప ప్రయత్నించెదవా? అక్కడ సీతమ్మనిసంసారమునకు నిప్పంటించి నావు. పినతల్లిగారియింటికి వెళ్ళి యక్కడకూడ వెలుఁగబెట్టి వచ్చి తివి. ఇప్పు డిక్కడకు వచ్చి మాకొంపురమునకు నిప్పంటించి కూడు చుంటివా దౌర్భాగ్యురాలా! నిన్నెవ్వరైన సరిగా నిట్లు చూతురు? నీకాళ్ళపై నీచేతులతోనే ప్రాతి నేల పడవైచికొనెదవు? నీనోట నీవేల మన్నుకొట్టుకొనెదవు? నీచేతులలో పుండుపుట్ట! లోకులను వేపుకొని తినినగాని నీకడుపుమంట తీరదా ఏమి—మాట్లాడ వేమి? నోరుపడిపోయినదా యేమి?"

ఇంక చెల్లెలియెదుట నిలుచుటకు గంగకు శక్తి లేదు. ఆమెపాదములు గడగడవణకసాగెను. గొంతెండి పోవుచుండున పార్వతివలె గట్టిగా మాట్లాడుటకునైన నామెకు సామర్థ్యము లేదయ్యెను. ఇంక నేమియుఁ జేయఁజాలక యొకానొక విషహీనసర్పిణివలె నామె 'హా హా' యనిమాత్రము ఫూత్కారము చేయఁ దొడఁగెను.

ఇంతైనప్పటికిని గంగ సిగ్గుమాలి బుసలుకొట్టుట గాంచి పార్వతి కెంతో కోపము వచ్చెను. క్రోధావేశపరవశ యై యామె యిట్లనెను. "తమ్మునిచే నింటిలో నుండి వెడలగొట్టించుకొని, పినతల్లి యింటికి పోయి యక్కడ దెబ్బలుపడి యిప్పుడిక్కడకు వచ్చితివి. దౌర్భాగ్యురాలా! నీ కేమియు సిగ్గైన లేదే! ఇప్పుడిచ్చటినుండికూడ దగినప్రాయశ్చిత్తము జేసి పంపించెదను. ఇప్పుడు నిన్నెవ్వ డింటిలో కాలుబెట్టనిచ్చునో చూచెదను——"

గంగకన్నులవెంట నశ్రువులురాలసాగెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచు నిట్లనెను. "ఇంతకాని ప్రారబ్ధ మిట్లు పెట్టినది! నే నెంత మంచి చేసినను విషమైపోయెను. ఎక్కువగా చదివినవాళ్లు నామీద బడుటకై తయారుగుందురు. చివఱకు నీవు మాత్రము నిటు లనుటలో నాశ్చర్య మేమున్నదమ్మా!"

కాని పార్వతి యేమాత్రమును శాంతింప లేదు. ఆమె కోపమున మరల నిట్లనెను. "ఒసే దురాత్మురాలా! ఈకుచ్చితపుమాట లన్నిటిని నే నెఱుఁగుదును. ఒకరక నీవు చేయఁగలమంచి యేమి! నీ మొగము బొగ్గులు గాను! నీవు నన్నేమియు నుద్ధరింప వద్దు. నీ విక్కడ నుండి తగవు. తక్షణమిటనుండి వెడలిపొమ్ము. జాగ్రత్త! ఒక్కక్షణమైన నిట నుండెదవేమో! నదు——నీదొంగయేడ్పు లేమియు నా మనసునుకరగింప జాలవు. తెలిసినదా?"

చెల్లెలొనర్చిన యిట్టియసహనీయమైన యవమానమువలన గంగ

రోదనము వెంటనే ఆగిపోయెను. ఇప్పుడు క్రోధలక్షణములు గానవచ్చుచుండెను. అతఁ డామెను గాంచి తనయుగ్రస్వరూపమును ధరించెను. పండ్లు పటపట గొరుకుచు, నధరమును మొనద్రొచ్చుచు, భయంకరకర్కశస్వరమున నామె "నా మొగము బొగ్గులు కావలయునా? యంటివి. సరే జరుగుచున్నదిలే! పాపాత్మురాలా! ముందు నీవును—నీసంసారమును బొగ్గులు కాని నీ—నుతి నా మొగము బొగ్గు లగునా? యని కేక వేసెను. పార్వతికూడ నంక సహింపజాలదయ్యెను. రోసమునఁ గన్నులు జేవురింప నామె బాహ్యజ్ఞానశూన్యయై పోయెను. ఆసమయమున వినాయకరా వటకు వచ్చి యుండనిచో నక్కచెల్లెండ్రకును భయంకరయుద్ధము జరిగియే తీరును. వినాయకరావు వదినెగారిచేయి బట్టుకొని యెంతో కష్టము మీద నామె నావలకు దీసికొనిపోయెను.

## ౩౦

మాధవరావు సదాశివుని యొద్దనుండి బయలుదేరి వెంటనే తన యత్తవారింటి కరుగుచుండెను. త్రోవలో వెంకటేశసంగతు లన్నియు నొకదానివెనుక నొకటిగ తలపునకు రాసాగెను. మనోరమ యాకృతి యాతనికట్టెదుట గన్పట్టుచుండెను. ఆమెకు గలసహజ భీతియు, సంశయమును, ఆమెవిషాదాకృతియు, లజ్జావనతదృష్టియు నిష్కారణముగ దనవలన గలిగినమర్మభేదకతిరస్కారమును! కఠోర దూషణములవలన నెన్నడును జలింపనియాకోమలహృదయాంతర్గత మగునగాధప్రేమయు, భయమున నిట్టూర్పులు విడుచుచు కరుణాజనకస్వరంబున నామె పలికిన యస్పష్టవాక్యములు మొదలగునవు స్వహృదయద్రావకవిషయసముద్రితమైన మనోరమయాకృతి క్రమక్రమంబున మాధవరావుదృష్టిపథమున వచ్చి నిలువబడియెను. అనంతరము తన

జ్యేష్ఠసోదరులగు మనోరమకు గలిగినదుర్భరశోకంబును నాని గన్నులు
గట్టినట్లుండెను. ఇవ్విధముగ నొక్కొక్కటియే స్మరణకు వచ్చి,
ఒక్కొక్క విషయమే యెట్లు వానికన్నులగుండు గన్పట్టుచుండెనో;
యట్టులే యూరకున్నవారాధిని యెగునయజ్ఞాన శాలిక సహనశీలతయూడ
జ్ఞప్తికి వచ్చి మాధవరావు విస్మితుడు కాజొచ్చెను. మాధవరావు
తానిక్కడ నేదోస్వల్పముగ మనోరమను నొప్పించి యుండెను
కదా! భార్యవిషయమున దా నొనర్చినయన్యాయాత్యాచారము స్మరణకు
వచ్చుటతోడనే వానిహృదయమును కాల్చినంత మయ్యెను. తన
గానే కొంతసేపు నిట్టూర్చుచుండెను. పశ్చాత్తాపమువలన నాతని
హృదయమును దగ్ధము కాసాగెను. ఇప్పుడు భార్యకు మొగ
మెట్టుల జూపగునా యని మాతండు సిగ్గుపడు చుండెను. ఈవిచార
ములవలన నాతనితల తిరిగిపోవు చుండెను.

ఇవ్విధమున మనస్సున పశ్చాత్తాపమునొందు కడకు గన్నీటిని బాగుగ
తుడిచికొని మాధవరావు సంశయించుచు శ్వశురగృహప్రవేశ మొన
ర్చెను. అగ్రస్థపడకటింటి దో యాతనే మనోరమ మాసిద్ధృష్టిని బడి
యెను. దగ్గఱ నెవ్వరును లేరు. మాధవరావును జూచుటతో
డనే మనోరమ మూర్ఛిత యయ్యెను. మాధవరావు పరుగెత్తుకొని
పోయి యామెను జాగ్రత్తగ బట్టుకొని యాప్రక్కగదిలో నున్న
సెజ్జపై బరుండబెట్టెను. భార్యయవస్థ జూచినంత మాధవరావు మనసు
మిగుల దిగులుజెందెను. మనోరమ మూర్ఛితయగుట చూచి మాధ
వునిహృదయము శతధావిశీర్ణ మయ్యెను. బాలకుని చందమున నాతడు
వెక్కివెక్కి యేడ్వసాగెను. తుదకు మిగుల ప్రయాసమున నాత
డేడ్చుట మాని, యుపచారము లొనర్చి మనోరమను మూర్ఛ
నుండి తేర్చెను. మనోరమ మెల్లగా దనసల్లనివిశాలనేత్రముల దెఱ
చెను. ఎట్టయెదుట జూడ నాథునిముఖకమలము గానవచ్చెను.

కొంచెము ఫలహార మొనర్చెదవు. ఈ వ్రతము వలనను, నీయుపవాసము వలనను నీకు దేవతాప్రసన్నము కలదని ప్రజ లందఱు ననుకొను చుందురు. కావున నింకెంత కాలమునకు నాకు పతిసేవాభాగ్యము కలుగునో నీవు చెప్పుము చూతము?"

లక్ష్మి యొక్క నిష్కపట వాక్యము లాలించి "పిచ్చిపిచ్చి పట్టి లేదుకద? నేనేమి జ్యోతిష్కురాలను తపస్విని ననుకొంటివి కాబోలు! సరే యిది నిజమైనచో -వదినె- నేను నీ కాశీర్వాద మొనర్చెదను. దైవము నీయభీష్టము సత్వరము నెఱవేర్చుఁగాక!" "మఱి నీకు దేవతాప్రసన్నము కలదని యందర మనుకొనుమాట యసత్యమే, సరే అట్లుకానిచో వదినే! మఱి నీవిట్లు వ్రతోపవాసము లొనర్చి శరీరమును గష్టపెట్టు టెందులకు? అటు లయ్యు నీశరీర మిట్లు తేజఃపుంజ మెటు లైనది?"

"నీవూరక కిటుల బిచ్చిపడ శోకము లక్ష్మీ! నా కట్టి పాతకికి వైకుంఠధాముడు ప్రసన్నుడగుట? కాని యొక్కానొక సమయమున నాకు స్వప్నమున వైకుంఠము కనబడినది. ఇంతను అందిట్లు గాన్పించినది. ఆవైకుంఠమున వైకుంఠేశ్వరుడు సింహాసనారూఢుడై యున్నాడు. అప్పటినుండియు ప్రతిదినమును నేను నాహృదయరాజ్యమున నుద్దేశపూర్వకముగ నావైకుంఠనిర్మాణ మొనర్చి, నాజీవితేశ్వరుని హస్తయుగ్మమున శంఖ, చక్ర, గదా, పద్మముల నొసగియాతని నీయా వైకుంఠములోని వైకుంఠేశునిగ నొనర్చి వానినే సర్వదా ధ్యానించు చుందును. ఒక్కొకప్పుడా మూర్తిని స్మరింపు చుండ నా కాకలిదప్పులు కూడ స్ఫురింపవు."

"ఏమి? వదినే! ఏమనుచుంటివి! ఇందు వలన నీ కాకలిదప్పులు కూడ లేకుండఁ బోవునా!"

నెట్టిరహస్యమును గాంచుటలేదు. సంవత్సరము కారాగృహవాస శిక్ష పొంది నే నొనర్చిన ఘోరపాతకమునకు ప్రాయశ్చిత్త మనుభ వించితిని. ఇప్పుడు నేను సన్మార్గమునందు ప్రవర్తింపఁగోరు. చెప్పుచెప్పు, మనోరమా! నామాటలయందు నీకు నమ్మకము గలదా!" అని మాధవరావు పలికెను. సిగ్గుచే మనోరమ తలవంచి యిట్లనెను. "మీపాపకర్మల నెన్నడైన సంశయించితినా! ఇప్పటికిని మీవలన నెట్టి పాపము సంభవించినదో యావిషయమును మాత్రము నామనసున నెన్నటికిని చోటు——"

ఇంతలో వినాయకరావు మాధవరావును కేకవైచెను. ఎంతో కష్టముపై కన్నీటిని దుడుచుకొనుచు అక్కడ జేర్చియున్న భార్యాశిర మును విధిలేక తొలఁగించి మాధవరావు మెల్లమెల్లగ బయటికి రా దొడగెను. మనోరమ విస్మితయై నిశ్చలదృష్టుల నాథునివంక జూచు చుండెను.

మాధవరావు బయటికి వచ్చినంతనే వినాయకరా విట్లనెను. "బావా! మీయుపకార మెన్నటికిని మఱవను. అమృతసేవ చేయించి యామృతదేహమున మరల నీదినమున మీరు ప్రాణము పోసితిరి. మరల నాకు సంసార మొనగూర్చి మీరు పుణ్యము గట్టుకొంటిరి. నడువుడు. మాయన్న మీకై యెదురు చూచుచున్నాడు. ఒక్క తూరి యటకు రండు!"

"ఈవిషయమున నే నొనర్చిన సహాయ మేమియు లేదు. వినాయ కరావు, మీకింతవఱకు కేయేయనిష్టములు వాటిల్లెనో వానికన్నిటికి నీవిచూడ, యీపాతకి యగుమాధవరావే కారణముకాదా? సరే యది పోనిమ్ము. నీవు ముందు నడువుము. నేను వెనకనే వచ్చెదను"

వినాయకరావు వెడలిపోయెను. ఇంతలో సదాశివరావే యచ్చ టికి వచ్చిచేరెను. మాధవరావును చూడగనే సదాశివు డిట్లనెను.

"మాధవరావు! మే మిండు ఇప్పుడు లక్ష్మిని దీసికొనివచ్చుటకై పోవ నుంటిమి. నే నామెపై నారోపించిన నిష్కారణదోషమును గూర్చిన యథార్థవృత్తాంత మామెకు దెలియజేసి యామె మనస్తాపము దొలగించినగాని యిప్పు డొక్కక్షణ మైనను నా మనసు స్వస్థత వహింపదు.!"

ఇది వినుటతోడనే మాధవరావు మిగుల సంతసమున నిట్లనెను. "అవు నవును. అట్లుచేయవలసినదే. నడువుము. నేను కూడ మీతో వచ్చెదను. మా వదినెగారు కూడ నచటనే యున్నది. ఆమె పట్టున నే నింతవరకు జేసిన యపరాధములకు నామెను క్షమాపణ వేడికొని యెటులైన నామెను మరల నింటికి దీసికొని వెళ్లెదను. సదాశివరావు ఆమె యనుమతి చొప్పున నేల ముఖ్యముగ వదినె యెట్లు చెప్పునో యట్లేప్రవర్తించి యిప్పుడు నూతనసంసారము ప్రారంభించెదను."

"నడువుము. అయితే మఱి బయలుదేరుటకు ప్రయాణముగమ్ము. అమ్మా, వినూ, జగన్నాథు, రాముడు ఇంక నింటిలో నందరిని వెంటదీసికొని వెళ్లెదను. ఎందుచేతనో నా కొంటరిగ నచటి కేగుటకు ధైర్యము చాలకున్నది. మాధవరావూ, నీవే చెప్పుము. ఇప్పుడొంటరిగ నచటి కే మొగము బెట్టికొని పోదును?"

మాధవరావు నవ్వుచు "మఱి నేను మనోరమను కూడ వెంట దీసికొని వచ్చెదను. ఇంక నామెను విడిచియుండుట లేదు!" అని పలికెను.

నిర్ణీతదినమున నందఱును లక్ష్మిని దీసికొని వచ్చుటకై బయలు దేఱిరి. దాసి యగు సఖూబాయియు, నొక్క నౌకరు, గంగయు నీముగ్గురుమాత్రము సదాశివరావుగృహమున దిగబడిరి.

## ౩౮

నేడు వాటిల్లిన సకలతప్పులవలన గంగకు పార్వతియెడ గల సోదరీవాత్సల్యము రవంతగూడ కడముట్టెను. [illegible] విషము బెట్టి గంగ యింతవఱకు సంతోషసాగరమున నోలలాడుచుండెను. కాని యెంతవిచారకరము! ఆ సంతోషసాగరమున నేడు హాలాహలతరంగము లుద్భవించి మహాకల్లోలము నొసగుచుండెను. అట్లగుట నిప్పుడు గంగకు పగ దీర్చుకొను రాక్షసవాంఛ యుద్భవించెను. తాఁ బూనిన కార్యము సఫలమగుటకై మిగుల యోచించుటవలన నామె హృదయము దగ్ధమగుచుండెను. ఆమె మేల్కొన్నను స్వప్నమునను పగయే దోఁచుచుండెను.

రాత్రి రెండుజాములయ్యెను. కాని గంగ నిద్రయన నెట్టిదియు నెఱుగదు. ఆభయంకరనిశీథసమయమున నామె పిచ్చిదానివలె నిల్లంతయు కలయదిరుగుచున్న దేలనో! ఈదిన మింట నొక్కసిట్టయైన లేదు. ఈనాఁ డామెయిష్టానుసార మొనర్చుట కేయాటంకము లేదు. అనాయాసముగ సంభవించినసిట్టిమంచియదను గంగ వంటి పగ బూనియున్న మానిసివలన నెందుకూరక బోవును! తన దుర్వాంఛ నేతీరున నెఱవేర్చుకొందునా యని యామె యోజించుచుండెను. ఎంత యోజించినను చాలసేపటివఱ కేమియు స్థిరపడినది కాదు. అందువలన నామె మిగుల నస్థిరయై విడువబడినయున్మాదినివలె నిల్లంతయు నృత్యము సేయ సాగెను. అట్లుండ నామెదృష్టి సమీపమున నున్న ధాన్యపుకొట్లవంకకు బోయెను. ఇంక జెప్పవలసినదేమి! ఆరాక్షసి మహానందమున కిలకిలనవ్వ సాగెను. నిస్తబ్ధమగునాగంభీర నిశీథసమయమున గంగ వికటహాస్య మెంతో భయానకముగా నుండెను!

ఆమెమనసున నేమి తోచెనో యెవ్వ రెఱుంగుదురు ! గంగ లోపలికి పరుగెత్తుకొని పోయి కొలదిసేపటిలో వెలుగుచున్న పెద్ద కాగడ చేతబట్టుకొని బయటికి వచ్చెను. ఇదియేమి! ఆకొట్లవంక జూచి యాచండాలురాలు మరల పకపక నవ్వుచున్న దెందులకు! కాగడా వెలుతురులో నామె మొగము మెటికింత భీషణముగ గానవచ్చుచున్నది! ఆ కాగడాతో సమానముగ గంగకన్నులుకూడ నెందుల కట్లు ప్రజ్వలించు చున్నవి ! ఎంత భయంకరము—ఇది యెంత భీషణమూర్తి. చూచిచూచి చేతిలో గట్టిగ బట్టికొనియున్న యా కాగడ నాదుర్మార్గు రాలు ధాన్యపుగొట్లు కంటించెను. అంతట భయంకర మగు వెలు తురు వచ్చెను. కొట్లు పెళపెళ పేలు చుండెను. ఆపెళపెళధ్వను లకు సరిగా గంగ కూడ పకపక నవ్వసాగెను. శ్మశానమధ్యమున ప్రజ్వలిత మగుచితిచుట్టును మూగి పిశాచము లెట్లు భయంకర ముగ జిందులు ద్రొక్కునో యటులే యీపిశాచియు మిగుల సంతస మున నాట్యము చేయు చున్నది.

ఇప్పు డింకేమిచేసినను నగ్ని జల్లార్చుట కలవిగా దని తోచి నంత గంగమనసున నేమిపొడమినదో యెవ్వ రెఱుగుదురు ? ఆ రక్కసి తానుపండుకొన్న గదిలోని కరిగి తలుపు లోపల గట్టిగడియ వైచికొనెను. భగభగ మని భయంకరాగ్నిజ్వాలలు లెటుల మేఘ మండల మంటుచున్నవో యటు ట్టీమహ్హరా లగుగంగయానందము కూడ భూమ్యాకాశముల పట్టుకుండెను. కొట్లలోనిధాన్యము తగుల బడుచున్న పటపటధ్వనులు నలుగడల గనిపింపజేయు చుండ దానిలో పిశాచీవికటహాస్యము గూడ నిండిపోయినదే! క్రమక్రమముగ భీషణాగ్నిజ్వాలలు లేచి యెట్లాకాశమండలము నిండి పోవు చుండెనో యటులే గంగయానందముకూడ నాకసమున భేదించుకొని పోవు చుండెను. కాని హాహా! ఇంటిలో నింక పెద్దవెలు గెక్కడిది!

"అదియును సత్యమే. సరే. కాని మరి నీ విటుల రేయింబవళ్ళు కన్నీరు విడుచుచుండుటకు?"

ఆ సమయమున లక్ష్మి మనసున దుఃఖావేశము పొంగివచ్చెను. కన్నులనుండి యవిరళాశ్రుధారలు ప్రవహింపసాగెను. ఆమె యిట్లనియెను. "వదినె! మనకన్నులనుండి యశ్రువులు కారినచో దుఃఖములను సుఖ మిట్టు పెట్లు!"

సుశీల మిగుల ననురాగమున లక్ష్మిని దగ్గఱకుఁ దీసికొని యామె బాష్పములఁ దుడిచివైచి సప్రేమముగ నామెవీపుపైఁ జేయి వైచి "నా మాట విని నీ విప్పుడత్యంతకరుగకు" మని బోధచేసెను.

"నాయెదుట నీవింక నామాట దలపెట్టకుము. అది యసంభవము. బావగా రెంతదనుక నావిషయమై సంశయింతురో, యెంత వఱకు నిజము బయలుపడదో యంతవఱకు నాకన్నీటిధారలు కట్టుబడవు. నేనచటి కేగుటయు సంభవింపదు. సరే! అది యటుండనిమ్ము. వదినె! ఇన్నిదినములనుండి కరుణజూపు మని దైవమును ప్రార్థించుచుంటిని. కాని యింతవఱకు నాపై వానికి కనికరము గలుగలేదు!"

"అమ్మా! మనయదృష్టఫలమును మనమే యనుభవింప వలయును. పూర్వజన్మమున మన మెట్టిసుకృతదుష్కృతములొనరించితిమో యవ్విధముననే యీజన్మమున వాని ఫలితము ననుభవింపక తీరదు. మన మెంత ప్రయత్నించినను వాని గడువశక్యము కాదు. ఫలితము పొందినతరువాత భగవంతునకు దయగలుగును. సర్వవిషయములును నియమము తప్పకుండ జరుగునని తెలిసికొనుము."

"వదినే! నీవును దినమంతయు పూజా, అర్చన, ధ్యానము, జపము వీనితోడనే గడుపుచుందువు. పగలంతయు గుక్కెడు నీరైన దీసికొనవు. రాత్రిమాత్ర మెప్పుడో దేవతాతీర్థమును బుచ్చుకొని

కొంచెము ఫలహార మొనర్చెదవు. ఈవ్రతము వలనను, నీయుప
వాసము వలనను నీకు దేవతాప్రసన్నము కలదని ప్రజ లందఱు నను
కొనుచుందురు. కావున నింకెంత కాలమునకు నాకు పతిసేవాభాగ్యము
కలుగునో నీవు చెప్పుము చూతము!"

లక్ష్మి యొక్క నిష్కపట వాక్యము లాలించి "పిచ్చిపిచ్చి పట్టి లేదుగద! నేనేమి జ్యోతిష్కురాలను తపస్విని యనుకొంటివి కాబోలు! సరే యిది నిజమైనచో -వదినె- నేను నీ కాశీర్వాద మొనర్చెదను. దైవము నీయభీష్టము సత్వరము నెఱవేర్చుఁగాక!"
"మఱి నీకు దేవతాప్రసన్నము కలదని యందఱనుకొనుమాట యసత్యమే, సరే అట్లుకానిచో వదినె! మఱి నీవిట్లు వ్రతోపవాసము లొనర్చి శరీరమును గష్టపెట్టు టెందులకు? అటు లయ్యు నీశరీర మిట్లు తేజఃపుంజ మెట్లు లైనది?"

"నిర్పూర కిటుల బిచ్చివడ్డ లోకము తల్లీ! నా బుట్టి పాతకికా వైకుంఠధాముఁడు ప్రసన్నుఁడగునా? కాని యొక్కదినమున నాకు స్వప్నమున వైకుంఠము కనఁబడినది. ఇంకను అం దిట్లు గాన్పించినది. ఆవైకుంఠమున వైకుంఠేశ్వరుఁడు విరాజమానుఁడై యున్నవాఁడు. అప్పటినుండియు ప్రతిదినమును నేను నాహృదయ రాజ్యమున నుద్దేశ పూర్వకముగ నా వైకుంఠనిర్మాణ మొనర్చి, నాజీవి తేశ్వరుని హస్తయుగ్మమున శంఖ, చక్ర, గదా, పద్మముల నొసగియాతనినే యా వైకుంఠములోని వైకుంఠేశునిఁగ నొనర్చి వానినే సర్వదా ధ్యానించు చుందును. ఒక్కొకప్పుడా మూర్తిని స్మరింపుచుండ నా కాకలిదప్పులు కూడ నస్ఫురించవు."

"ఏమీ! వదినె! ఏమనుచుంటివి! ఇందు వలన నీ కాకలిదప్పులు కూడ లేకుండఁ బోవునా!"

"ఓసివెఱ్ఱిదానా! ఒక్కసారిమనసు ప్రసన్నమైనచో మఱింక నెక్కడి తృప్తివాసలు?"

"వదినే! నీ వేమైన ననుము. నాకిట్లు దోచుచున్నది. నీ వేనే నొకశాపభ్రష్ట దేవతవై యుందువు. నీవు ధన్యవు. నీపతిభక్తి ధన్యము. కానిచో మేము ప్రత్యక్ష సంసారమునం దుంటిమి కాని యేమిప్రయోజనము? పతి ధ్యానించియు, చింతన మొనర్చియు మేము ప్రసన్నహృదయుల మగుటకు దూరులమై మీదు మిక్కిలి వ్యాకులము మాత్ర మొందుచు శోకించుచుంటిమే! మా దెట్టిపతిభక్తి! అటులయ్యును వదినే, నీ కేమియు బతిదర్శన మగునను నాశాలేశముగూడ లేదు. దైవానుగ్రహమువలన మా కట్టియాశ కలదు."

అదివిని సుశీల మిగులనావేశమున నిట్లనెను. "ఏమి, లక్ష్మీ! యేమంటివి! నాకు వారిదర్శన మగుననునాశయే లేదా? ఏయాశ యాధారమువలన నే నింతదనుక ప్రాణధారణ మొనర్చుచుంటినో యాయాశనే నీవు లేకుండజేయు నెంచితివా? మాకు కూడ పునర్దర్శనము కలదుసుమా! అది యీలోకమునమాత్రము కాదు-వైకుంఠమున! ఓసి యమాయకురాలా! ఇచ్చటి మీదర్శనమున కనేక విఘ్నములు కలుగ గలవు. మాటిమాటికి వియోగము తటస్థింప గలదు. కాని యచటి మా సంయోగము చిరస్థాయిగ నట్లుండవలసిన దే!"

లక్ష్మి సుశీల మొగమువంక జూచుచుండెను. ఆసమయమున నామె వదనమండలముపై నొకవిధ మగుప్రతిమ తేజము విరాజమానమై యుండెను. ఆ తేజముముందచట వెలుగుచున్న దీపప్రకాశముకూడమంద మగుచుండెను. లక్ష్మి నయనాశ్రుభరంబుల సుశీల పాదములపై శిర ముంచి గద్గదకంఠియై యిట్లనెను." వదినే! నేను మిక్కిలి మూఢురాలను. నాపల్కులకు నీకు కోపమువచ్చినదా! నన్ను మన్నింపవా!"

సుశీల లక్ష్మిని దగ్గరకుదీసికొని, యక్కున జేర్చి బుజ్జగించి, ప్రేమ మీఱ నామెను ముద్దిడుకొని యిట్లనెను. "లక్ష్మీ! నీ వీదినమున నింతపిచ్చిదాన వైతి వేలనమ్మా? నే నిప్పుడే దేవతను గాను. నీపై నాకేమియు కోపము లేదు. కన్నులు దుడిచికొని చూడుము."

ఇంతలో నొకపరిచారిక యటకు బరుగుపరుగున వచ్చి లక్ష్మి నుద్దేశించి యిట్లనెను. "అమ్మా! ఇంకా కూకుండా రేం? మీయత్తో రందరు మనగుమ్మం కాడికొచ్చే రండి. అల్లదో సూడు. మీ యత్తమ్మోరున్నూ, పార్వతమ్మగారున్నూ యీడకేవస్తుండారు-"

పరిచారికవాక్యములు చెవి సోకినంత లక్ష్మి మ్లానవదనము ప్రఫుల్లమయ్యెను. ఆమె చప్పున లేచి వీథిద్వారము వద్దకుఁ బరుగెత్తుకొనిపోవు చుండెను. ఇంతలో రాధయు, పార్వతియుఁ బడకటింటి లోనికి వచ్చిరి. లక్ష్మి వారియిరువురకు సాదరపూర్వకముగ నమస్కారమొనర్చెను ఆమెనేత్రము లానందాశ్రువులచే నిండిపోయెను. సుశీలయు మిగులనాదరమున రాధకు నమస్కారమొనర్చి కుశలవార్తల నడిగెను. రాధ లక్ష్మిని మిగులఁ బ్రేమమునఁ గౌగిలించుకొని యిట్లనెను. "బిడ్డా! తుదకు దైవము సత్యమును బయలు పరచెను. ఈ కార్య మాపరమచండాలిదే యని యిప్పటికి మా కెల్లరకు నమ్మిక కలిగినది."

అనంతర మావృద్ధురాలు గంగసంబంధ మగుసమస్తవృత్తాంతమును తెలియఁ బరచెను. లక్ష్మి యత్తగారివద్దనుండి యీవలకు రాగనే పార్వతి యామె కేలుఁ బట్టికొని యిట్లనెను. "సోదరీ! నేను నీ కనంతాపరాధము లొనర్చి యుంటిని. కాదు. కాదు. నిన్ను దుస్సహమగునపనిందపాలుఁ జేసితిని. కాని యవి యన్నియు మనసున నుంచికొని యిబ్బందులకై యేమియు చింతింపకుము. నీవు నా కన్న చిన్నదాన వైనను, నే మందరము నిన్ను మన్నన వేడికొను

టకై యీదినము ప్రత్యక్షముగ వచ్చితిని. ఇంతకాలమువఱకును
నిన్ను సరిగా చూచుకొనలేకపోతిని. కాని నీవు సుశీలవై నాయాజ్ఞ
నాకు సంపూర్ణముగ చెల్లించుచున్నావు. కడచిన దినములు మనము
మఱచిపోవలయు."

పార్వతికన్నులనుండి బొటబొట బాష్పములు కారసాగెను. తోడి
కోడలిపలుకులవలన లక్ష్మిముఖకమలము ప్రఫుల్లమాయెను. ఆమెకు
గూడ నేత్రములనుండి యానందాశ్రువులు ప్రవహించుచుండెను.
ప్రభాతసమయమున వికసించిన కమలములపైఁ బడిన మౌక్తికా
కార హిమబిందువులవలన కమల మెట్టుల సుశోభిత మగునో యట్లు
లక్ష్మివికసితముఖకమలమున కీసమయమున నానందాశ్రువు లధిక
శోభను గలిగించెను. కారుమబ్బులమాటున క్షణకాలము మాటు
బడియున్న పున్నమచందురుఁ డామబ్బువిడిపోవగనే మరల నెట్టుల
తనపూర్ణప్రకాశముతో నభోమండలమున దేదీప్యమానుఁడై ప్రకా
శించునో యటులే నిష్కారణముగ వచ్చినయపనింద తొలగిపోవుట
తోడనే లక్ష్మిముఖచంద్రము పూర్వతేజమున విలసిల్లసాగెను.

ఆమె వికసితాంతఃకరణ యై యిట్లనెను. "అక్కా! ఆవిషయము
మణుమాత్రమును నామనసున లేదు. దానివలన నాకెప్పుడును నెట్టి
కోపమును కలుగలేదు. కాని నీవుగనుక నన్ను సోదరీభావమున జూచి,
నాయెడ నిశ్చయముగ సంతుష్టవైతివేని యొక్కమారు నాజగ
న్నాథుని, రాముని నీచేతితో నాయంకతలమున గూర్చుండబెట్టితి
వేని నాకష్టము లన్నియు దూరము లగును."

ఇంతలో మనోరమ యొకచేత జగన్నాథుని యొకచేత రాముని
బట్టికొని నవ్వుచు నటకరుదెంచెను. లక్ష్మి యభీష్టము నెరవేర్చు
టకు పార్వతి మిగులనానందమున సంసిద్ధ యై యుండెను. ఇంతే
కాదు. అందులకై యామె కెంతయో కుతూహలము కలిగె

యుండెను. కాని పార్వతివలన నీకార్యము నెఱవేఱుటకునైన లక్ష్మి యోపిక బట్టజాల దయ్యె. ఆయర్భకుని కంటబడుటతోడనే యామె రయమున పరుగిడిపోయి వాని నెత్తి చంకనిడుకొని మిగుల ప్రేమమున వానినిర్దోషవదనముల పలుమాఱుగ ముద్దుగొనసాగెను. టక్కరికాడగు రాముడు మాత్ర మేమిచేసినను తనపినతల్లి చంకనుండి క్రిందికి దిగ డయ్యెను.

మనోరమ లక్ష్మిపాదములు గట్టిగ బట్టుకొనెను. ఆమె సంతోష మీదినము త్రిభువనములును బట్టజాల కుండెను. లక్ష్మి మిగుల ప్రేమమున నామెను లేవనెత్తి యాలింగనము జేసికొని, రహస్యముగ నామెచెవిలో వినోదముగ నిట్లనెను. "ఏమె ? యిప్పటికైనను పలుకు లనుభవము లోనికి వచ్చినవా లేదా? వచ్చినాడా లేదా నీ నాథుడు తనకుదానై నిన్ను వెదుకికొనుచు?"

మనోరమ సలజ్జయై మధురస్మిత మొనర్చుచు "మావదినెగారి వాక్కు లెన్నడైన నసత్యములగునా?" యనెను.

ఆహాహా! ఇట్టిమధురహాస్యము మనోరమముఖమున నింతకు బూర్వ మెన్నడును గనబడలేదుగదా! ఆమెముఖమున మధురస్మితము గాంచినంత లక్ష్మి యానందము ద్విగుణీకృత మయ్యెను. నవ్వుచు నామె యిట్లనెను. "మనోరమా! ఇప్పుడు మాత్రము నీసర్వస్వ మును చక్కగ గాపాడుకొనుచుండవలయును సుమా! ప్రయత్న మొనర్చినచో వనములోనైన సస్యము పండదగును. మతి పురుషుల సంగతి యెందులకు?"

మనోరమ మరలలజ్జితయై శిరము క్రిందికివంచి మెల్లగ నిట్లనెను. "అది యెట్లు కాపాడుకొనవలయునో మావదినెగారే నేర్పవల యును."

లక్ష్మి ప్రేమాతిరేకమున దనహస్తము మనోరమ గడ్డముక్రిందికి

చేర్చి "ఏమి యింతవఱకు నీవు నేర్చుకొనవనే లేదా! ఎంత చేలవు!" అని నవ్వెను.

ఈప్రకారము భాగ్యలక్ష్మివలన మనోరమకు కలిగిన [illegible] వర్ణించి తెలుపుట శక్యముకాదు. మనోరమ [illegible] కడ మరల [illegible] లక్ష్మి [illegible] ముద్దిడుకొనెను.

## ౪౧

ఈదినము నానాగారి సంతోషము నేను వర్ణింప జాలను! లక్ష్మివంటి యోగ్యపుత్రికపై వచ్చినయాపదానిని మీనాదినమున పరమకృపాళువైన యీజగన్నాయకుని కరుణవలన తొలగిపోయి అత్తింటనివసించు భాగ్యము తనకు లేదని నిరాశచేసికొనివచ్చిన తనపుత్రిని, యీదినము [illegible] భర్తయొక్క-చేతికి యిటుగా వారందఱు నాసొమ్ముడ మునుపటివలె నినుమడిగప్రేమగలవారై, మిగుల సన్మానంబున మఱల దోడ్కొనిపోవుటకై వచ్చుటచే నానాగారి కపరిమితానందము కలిగెను. సత్యమువట్ల భగవంతుఁడు కలఁడనుటాని కీనాఁటికి ప్రత్యక్షసాక్ష్యము కనుపట్టినందున భక్తిరసముచే నాతని పవిత్రాంతఃకరణము పొంగిపొరలసాగెను. అతఁడు మహాదరంబున వచ్చినవారి కెల్లరకు స్వాగత మొసంగెను. మార్గాయాసముచే నలసినవారలగుటచే వారందఱు భోజనములైన వెంటనే నిద్రించుటకరిగిరి. నానాగారికి మాత్రము నిద్ర యేమాత్రము వచ్చినదికాదు. ఆనందాతిశయమున నాతనిహృదయము మీఁదినము పరిపూర్ణత నొందెను. ఏమంగళకరప్రభువుదయవలన నీదినము సుదినమైనదో యాతనిచరణకమలములయందు లీనమై యాతని గీర్తించుటయందు నాతని కారేయి గడచిపోయెను. ఈదినము వియ్యాలవారికి విందు చేయఁదలచి

